# జగద్గురు శ్రీ శంకరాచార్య



మూలం :

**దీనదయాళ్ ఉపాధ్యాయ**

అనువాదం :

**పురిపండా అప్పలస్వామి**

# జగద్గురు శ్రీ శంకరాచార్య



మూలం :

దీనదయాళ్ ఉపాధ్యాయ

అనువాదం :

పురిపండా అప్పలస్వామి

నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

జగద్గురు శ్రీ శంకరాచార్య
తృతీయ ముద్రణ
సంక్రాంతి - శ్రీముఖ పుష్యమాసం
జనవరి 14, 1994

**మూల్యము రూ. 15-00**

ప్రచురణ :

**నవభారతి ప్రచురణలు**

3-4-705/4, నారాయణగూడ
హైదరాబాద్ - 500 029.

ప్రతులకు :

**సాహిత్య నికేతన్**

3-4-852, బరకత్‌పురా
హైదరాబాద్-500 027
ఫోన్ నం 600792

**సాహిత్య నికేతన్**

ఏలూరు రోడ్డు,
విజయవాడ - 520 002.

కవర్ ప్రింటింగ్ :

**భాగ్యనగర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ ప్రై. లి.**
కాచిగూడా, హైదరాబాద్. ఫోన్ నం. 514679

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
1-1-517/బి/1, న్యూ ప్రాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380.
ఫోన్లు : 611413, 500547.

# ముందుమాట

ప్రపంచ తాత్వికులలో దార్శనికులలో ప్రథమ స్థానం ఆదిశంకరాచార్యులదే. ఆయన తర్వాత భారతదేశంలో తాత్వికులు ఆయనకు వ్యాఖ్యానం మాత్రమే చేయగలిగారు. నాస్తికులు, శూన్యవాదులు తమ వాద ప్రవాహంలోపడి, ఈ జాతీయ జీవన అస్మితాన్ని కూడ విస్మరించి, దేశ సాంస్కృతిక సమగ్రతను విచ్ఛిన్నం చేయబూనినపుడు, ఒంటరిగా తన బుద్ధికుశలతతో, మనోబలంతో, తర్కబద్ధమైన జ్ఞానంతో మన సంస్కృతినీ, సనాతన ధర్మాన్నీ పునఃప్రతిష్ఠించి, పతనోన్ముఖమైన జాతిని పునరుద్ధరించిన ఆచార్యోత్తములు ఆయన. భక్తి, కర్మ, జ్ఞాన యోగాలను సమన్వయించి, మనలో ఉన్న అనేక సందేహాలను తొలగించి, జగద్గురు స్థానాన్ని పొందగలిగారు. హైందవేతరులచే కూడ భారతీయ ఏకాత్మకు ప్రతీకగా కొనియాడబడ్డారు.

పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ భారతీయ మేధావులలో అగ్రగణ్యులు. మన సామాజిక జీవనాన్ని భారతీయ దృక్పథంతో విశ్లేషించిన వారు. వారు ప్రవచించిన ఏకాత్మ మానవతా వాదం ఆలోచనాపరుల మెప్పును పొందింది. ఆయన జగద్గురు శంకరాచార్యుల జీవితానికి చేసిన అక్షర రూపమే ఈ గ్రంథం.

శ్రీ పురిపండా అప్పలస్వామి తెలుగులో అనువదించిన ఈ గ్రంథాన్ని జాగృతి ప్రచురణలవారు మొదట ముద్రించారు. ద్వితీయ, తృతీయ ముద్రణలకు అనుమతించిన, వారికి మా కృతజ్ఞతలు.

**సంపాదకులు**

నవభారతి ప్రచురణలు

# ప్రస్తావన

మన జాతీయ జీవనం గంగా ప్రవాహం లాగ ఆదికాలం నుంచీ ప్రవహిస్తోంది. గంగా నది పుణ్యజలం ప్రతి ఒక్క బిందువూ పవిత్రమైనదే. అందులో ఎక్కడ మునకలు పెట్టినా ముక్తి లభిస్తుంది. అయినా కొన్ని కొన్ని స్థలాలకు ప్రత్యేకమైన మహత్వం లభించింది. హిమాలయం వొడిలోనుంచి దిగజారి భారతభూమి మీద బిలబిల గంతులేసిన గంగమ్మ తల్లి హరిద్వారంలో సాటిలేని మహత్వం సాధిస్తుంది. ప్రయాగ దగ్గిర యమున నల్లనల్లని కాలకూటం పట్టుకువచ్చి శివపత్నికి అందిస్తుంది. శివుడులాగే ఆమెకూడా సంతోషంతో పానం చేసిన ఆ చోటు - ప్రయాగ తీర్థరాజమే అయిపోయింది. ఇలాగే భారత జాతీయతా ప్రవాహం ప్రతి కణమూ పవిత్రమైనదే! ఏ స్థలమైనా, ఏ కాలమైనా తలుచుకుంటే చాలు మనస్సు నిర్మలమవుతుంది దేశభక్తితో తొణికిసలాడుతుంది. అయినా తీర్థరూపులైన మహాత్ములు జన్మించిన కాలాలకు మాత్రం జాతి జీవితంలో మరింత మహత్వం ఏర్పడుతుంది. గంగ వొడ్డున వుండడంవల్లే తీర్థాలకి మహత్వం వచ్చినా, ప్రత్యేకంగా అక్కడికే వెళ్లాలన్న అభిలాష భక్తుడయిన ప్రతి వాడికీ వుంటుంది. మహా పురుషుల జీవనం, వాళ్ళ కీర్తి, ప్రజల హృదయాలలో

వాళ్లు నిలిపిపోయిన ప్రభావం, జాతీయ చరిత్ర నిర్మాణంలో వాళ్ళు ప్రవేశ పెట్టిన ఆదర్శాల ప్రోత్సాహం- ఇదంతా దేశానికి అమూల్యమైన సంపద, శక్తికి జీవనది. వాటి మననమూ, వాటి ఆలోచనా, విమర్శా జాతిలో నిత్య నవీనమైన ఉద్దీపనం కలిగిస్తాయి. ఉత్సాహమైన జీవనమూ ప్రసాదిస్తాయి. ఈ పుణ్య స్థలాల్లో - జీవన ప్రదాయిని అయిన ఈ జాతీయ జాహ్నవిలో- మునకలు పెట్టడానికి ఎవళ్ళ మనస్సు ఉవ్విళ్ళూరదు? ఇక శ్రీ మచ్ఛంకరాచార్యుల స్థితి- అది తీర్థరాజమయిన ప్రయాగతో సమానమైంది. అక్కడ భక్తజనం ఇసుకవేస్తే రాలకుండా వుండడంలో ఆశ్చర్య మేమున్నది?

మన జాతీయ నిర్మాతలలో శ్రీ శంకరాచార్యుల స్థానం మహోత్తమమైనది. ఎందరో విద్వాంసులు ఆయన ఆధునిక హిందూ ధర్మానికి జనకుడే అన్నారు. గుడిలో విగ్రహం స్థాపించి ప్రాణప్రతిష్ఠ చేసిన ఆచార్యుణ్ణే తరుచు దేవాలయ నిర్మాత అంటారు. అయినా తన ఉలీ, సుత్తీ పట్టుకుని ఒక్కొక్క దెబ్బవేసి విగ్రహానికి స్వరూపం కల్పించిన శిల్పినీ, దేవాలయం కట్టిన ఎంతో మంది తాపీవాళ్ళనీ, పని వాళ్ళనీ కూడా గుర్తించకుండా వుండటానికి వీల్లేదు. అంత మంది ప్రజల పరిశ్రమ గమనించక పోవడమంటే, కేవలం కృతఘ్నత మాత్రమే కాదు- సామాజిక జీవనంలోని విధాయక నియమాల గురించి మన తెలివితక్కువ ప్రకటించుకోవడమున్నూ అవుతుంది. ఒక్కరోజులోనో, లేదా రెండు మూడు సంవత్సరాలలోనో జాతీయ జీవనంలో హెచ్చు తగ్గులేవీ రావు. లేదా జాతీయ జీవన సంస్కారాలతో పనే లేకుండా తన మానసిక, ఆధ్యాత్మిక శక్తులూ, శారీరక శక్తులూ వికాస పరుచుకుంటూ ఏ మహాత్ముడైనా జాతీయ జీవనాన్ని నిర్మించలేడు. జాతీయ సాధనలో మహాపురుషులు విగ్రహ స్వరూపులు మాత్రమే. సంవత్సరాల తరబడి సంఘంలో మెదలుతూన్న భావాలు ఒకనాడు మూర్తిమంతమై మహాపురుషుడుగా ప్రత్యక్షమవుతాయి.

ఆ మహాపురుషుని అలౌకికమయిన శక్తి, దైవిక సంపత్తి, సర్వతో ముఖమయిన ప్రతిభా, అఖండమైన కర్మయ జీవనమూ చూసి మన కళ్ళు జిగేలు మంటాయి. దాంతో ఆ మహాపురుషుడు అవతరించడానికి ధారావాహికంగా వచ్చిన మూలకారణాలు పూర్తిగా మరచిపోతాం. ఆయన అవతరించిన సంఘం గురించి ఏ మాత్రమున్నూ ఆలోచించం. అగ్ని పర్వతం విజృంభించటం చూశాక, మెల్లిమెల్లిగా దిగజారే నీళ్ళ దిక్కు తలంపు పోదు. బాగా వికసించిన పువ్వుల పరిమళంతో చెట్టు మరుపు వస్తుంది. బహుశా ఈ ప్రవృత్తి చాటున వ్యక్తిగతమయిన స్వార్థమే మరుగుపడి ఉందేమో! ఏమంటే, సంఘం బాగోగులు చూసుకోవలసినవాడు ఎవడో మహాపురుషుడే అనుకుంటూ మన బాధ్యతలు వొదిలేసి మనం దూరంగా ఉండిపోతాం. మహాపురుషుడన్నవాడు ప్రతి వ్యక్తి జీవనంలోనూ సంచలనం కలిగిస్తాడు. కార్యశక్తి, ప్రేరణా ప్రసాదిస్తాడు. అయితే నిజానికి అదంతా అతడు మొదట సంఘం యొక్క సామూహిక ప్రయత్నాలలోంచే స్వీకరిస్తాడు. జాతి ప్రాణంలో ఆంతరంగికంగా సజీవమై ప్రవహించే ఈ సాధన స్వరూపం వేరువేరు యుగాలలో ఆయా మహాను భావుల ప్రయత్నాల వల్లను, తత్ఫలితాల వల్లను ఆయా కాలాలకు తగినట్లు అలంకరించుకొని, ప్రత్యక్షమవుతుంది.

అంచేత ఏ మహాపురుషుణ్ణయినా అర్థం చేసుకోవాలంటే, ముందు జాతీయ జీవనం తాలూకు ఈ సాధనా స్వరూపం తెలుసుకోవాలి. యుగ పురుషుడయిన శ్రీ శంకరాచార్యుల మహత్వం కూడా అప్పటి యుగ ప్రవృత్తులు అవగత మయితేనే అర్థమవుతుంది. సాధారణజనం శంకరులను బౌద్ధ ధర్మం నాశనం చేసినవాడనీ, హిందూ ధర్మం స్థాపించిన వాడనీ భావిస్తారు. కాని ఎంతోమంది విద్వాంసులికి ఆయనలో 'ప్రచ్ఛన్నబౌద్ధం' గోచరిస్తుంది. ఈ రెండు చిత్రాల మరుగునా కొంచెం నిజం లేకపోలేదు

ఏమంటే, లక్ష్యం తప్పి పెడదార్లు పట్టిన బౌద్ధ ధర్మమూ, కేంద్రాభిముఖ మయిన హిందూ ధర్మమూ - ఈ రెండింటి పరస్పర సంఘర్షణా, సమన్వయాల చరిత్రే పూర్తిగా ఆయన కాలం నాటి వెయ్యి సంవత్సరాల చరిత్ర. అంచేత బౌద్ధ ధర్మం పుట్టుక మొదలుకుని శంకరాచార్యుల కాలం వరకూ బౌద్ధధర్మ వికాసమూ, దాని ప్రవృత్తులూ - వీటితోపాటు హిందూ ధర్మం యొక్క భిన్న భిన్న ప్రవృత్తులూ మనం సింహావలోకనం చేసుకోవాలి.

బుద్ధ భగవానుడు జన్మించిన సమయానికి దేశంలో వైదిక కర్మ కాండ మీద తిరుగుబాటు ఆరంభమై వుంది. దేశంలో కర్మకాండ ఎంత పెరిగి పోయిందంటే, లోకులు మానసికమయిన సత్ప్రవృత్తులకంటే, కేవలం యజ్ఞాలూ, యాగాలూ గొప్పవని భావించారు. ఆత్మోన్నతి విడిచిపెట్టారు. బాహ్యోపచారాలూ, కర్మకాండా పట్టుకు పాకులాడారు. వీటివల్లే స్వర్గం లభిస్తుందని విశ్వసించారు. దీని పరిణామం బంగారు గిన్నెలో విషం నింపడమే అయింది. ధర్మశాస్త్రవేత్తల మనస్సులో కూడా నీచ ప్రవృత్తులు మొలకెత్తాయి. దయా, శాంతీ, అక్రోధమూ, అహింసా- వీట్ల స్థానాన్ని క్రౌర్యం, క్రోధం, హింసా ఆక్రమించాయి. క్షమ అంటే పిరికితనం క్రింద జమ పడింది. సాంఘిక విభేదాలు పెరిగిపోయాయి. ఒక వర్ణం మరొక వర్ణాన్ని ద్వేషించడం మొదలుపెట్టింది. బ్రాహ్మణులు త్యాగమూ, వృత్తి ధర్మమూ వొదిలిపెట్టేశారు. తమలో పాపభావాలు వ్యాపించినా తామే ఉత్తములమని వాదించారు. సంఘంలో నాయకత్వం తమ వారసత్వమని భావించారు. బ్రాహ్మణుల ఆండంబరాన్ని సరిగా తెలుసుకొని, వారి పొల్లు మాటలకు లోబడిఉండేందుకు క్షత్రియులు వొప్పుకోలేదు. దాంతో ఎక్కడ చూచినా అసహనమూ, ద్వేషమూ తాండవించాయి. ఆత్మవంచన అన్నిటి

కన్నా అధికమయింది. సమాజం ఇలాంటి స్థితికి వచ్చినప్పుడు దాని శక్తులు క్షీణించడం సహజం. అప్పుడు శరీరాన్ని వృద్ధిచెయ్యడంకంటే, దాని శక్తులు వృద్ధిచెయ్యడం అవసరం. బుద్ధదేవుడికంటే ముందే ఈ ఊహలు దేశాన్ని కలవరపరచడం మొదలుపెట్టాయి. ఉపనిషత్తుల్లో ఈ తిరుగుబాటు చూచాయగా అగుపిస్తుంది. కాని భాగవతధర్మం, బౌద్ధ ధర్మం, జైనధర్మం - వీట్లల్లో ఈ తిరుగుబాటు స్పష్టంగా అగుపిస్తుంది.

భాగవతధర్మం చేసిన తిరుగుబాటు సామాన్యమైంది, విప్లవావేశంలో పడి ఎదుట పడ్డ ప్రతిదాన్నీ నాశనం చేసెయ్యడానికి పూనుకోలేదు. రోగంతోపాటుగా రోగినికూడా దిగమింగి కూర్చోలేదు. భాగవతధర్మం కర్మకాండని ఎదిరించింది. సాంఘిక వ్యవస్థలోని రూఢివాదం ఖండించింది. కాని పూర్వ సంప్రదాయాలకీ, ధర్మ గ్రంథాలకీ, సాంఘిక వ్యవస్థల పునాదులికీ ఏమాత్రమూ దెబ్బ తగలనివ్వలేదు. భాగవతధర్మి కృష్ణభగవానుడు, ఇంద్రుడూ మొదలైన వైదిక దేవతల పూజలు మానిపించాడు. గోవర్ధనపూజ ప్రారంభించాడు. కాని వేదాలమీద, వైదిక వ్యవస్థమీదా సంపూర్ణంగా ఆదరభావం కూడా చూపించాడు. జీవితంలో యజ్ఞాలూ యాగాలూ ఎదిరించాడు. అయినా ధర్మరాజుని రాజసూయం చెయ్యమని ప్రోత్సాహపరిచి, అందులో తాను ప్రముఖపాత్రను ధరించాడు. భాగవతధర్మం చేసిన తిరుగుబాటు చెడ్డమీద మాత్రమే, వ్యవస్థ అంతటి మీదా కాదు. కాని బౌద్ధధర్మం సాగించిన తిరుగుబాటు అలాంటిదికాదు. దానికొక హద్దంటూ ఏమీ లేకపోయింది. గోధుమల్లో కొన్ని రాళ్ళు కనిపించాయి. దాంతో గోధుమలన్నీ పారేశాడు బుద్ధదేవుడు. కర్మ కాండలో హింసాకాండ చూశాడాయన. దాంతో కర్మకాండనే ఎదిరించి వూరుకోలేదు. వేదాలూ, బ్రాహ్మణులూ ఈ పాపాలకి మూలమని భావించాడు. వాటి ఆదేశాలనే నిర్మూలించాడు, మొదటినుంచే వస్తూ

వున్న పద్ధతులన్నీ వొదిలిపెట్టేశాడు. తన ప్రచారం సంస్కృతంలో మానేసి పాలీభాషలో ప్రారంభించాడు. వర్ణవ్యవస్థను కాదన్నాడు. ఇలా వైదిక సంప్రదాయంతోనూ, వ్యవస్థతోనూ పూర్తిగా సంబంధం వదులుకున్నా డాయన.

వైదిక ధర్మంలో ఎల్లప్పుడూ మార్పులు జరుగుతూనే వచ్చాయి. గంగాప్రవాహంలా చైతన్యవంతమై ప్రవహిస్తూన్న ధర్మమది; సజీవమైనది. పడియలోన నీళ్ళలా కదలకుండా, జడస్వరూపమయి, నిర్జీవమైనది కాదది. వైదిక ధర్మంలో కొత్త కొత్త భావాలు ఎప్పటికప్పుడు కలుస్తూనే వున్నాయి. పాత పద్ధతులు మారుతూ వికాసం పొందుతూనే వచ్చాయి. ఐతే, ప్రతి కొత్త మార్పు వెనుకటి వాటితో సంబంధం నిలుపుతూనే వచ్చింది. కొత్తగా ఆందోళన సాగించిన ప్రతి వ్యక్తి తన పూర్వులమీద శ్రద్ధాభావం చూపిస్తూనే వచ్చాడు. ప్రతి కొత్త సంస్కర్త కూడా ప్రాచీన సంప్రదాయాలు గౌరవించాడు. తన పూర్వుల్ని, వాళ్ళ కార్యాల్నీ గౌరవిస్తూనే కాలానుగుణ్యమయిన భావాలు ప్రవర్తింపజేశాడు. కొత్తభావాలకి మూలంతో సంబంధ ముండేది. అంచేత జాతీయ జీవనం దెబ్బతినేదికాదు. పైగా అది వికాసవంతమే అయింది. అనాది కాలం నించి వస్తూవున్న జాతీయ సంప్రదాయాలు నాశనం చేసే ప్రయత్నం అంతవరకూ ఎవరూ చెయ్యలేదు. కాని బుద్ధభగవానుడూ, అంతకంటె ఎక్కువ ఆయన అనుయాయులూ ప్రాచీనా సంప్రదాయాలతో పూర్తిగా సంబంధం వొదులుకున్నారు. అనంతమైన జ్ఞానానికి ఉనికిపట్టు వేదాలు. వాటితో తమ మతం పుష్టికరమైందిగా చేసుకోడానికి బదులు, తమ ధార్మిక వ్యవస్థలో వేదాలకు స్థానమే లేకుండా చేసుకున్నారు వాళ్ళు. వేదాల మీదా దేవుడిమీదా బుద్ధభగవానుడు ఉదాసీనభావం వహించాడు. అది తన శిష్యులలో వేదాలమీద దేవుడిమీదా విరోధభావంకింద పరిణమించింది.

దాంతో బౌద్ధ ధర్మానికీ హిందూ ధర్మానికి పరస్పరం విరోధమే ఏర్పడి పోయింది.

"బుద్ధుడివరకూ మన ధార్మిక భావన మెల్లి మెల్లిగా ఏ వొడుదుడుకులూ లేకుండా వికసిస్తూ వచ్చింది. కొత్త కొత్తగా వచ్చే భావాల మెత్తదనంమీద ధ్యానమే వుండేదికాదు. మన ధార్మిక వృక్షం పెరిగి పెరిగి ఆకాశాన్నందుకుంది. ప్రతి కొత్త ఆచార్యుడూ కొత్త భావాలు ప్రాచీనమైన వాటితో ఎంత చక్కగా జోడించాడంటే- ఆ మొలక ఎప్పుడు ఎలా పెరిగి అంత పెద్ద వృక్షమయిపోయిందో ఎవ్వరు గమనించలేక పోయారు. మహాత్ముడైన బుద్ధుడు దాని కొమ్మలూ చివుళ్ళూ నరికేసి, కత్తిరించేసి ధార్మిక ప్రపంచం అల్లకల్లోలం చేసేశాడు. గారడీ చేసి, మొదట చెట్టు మాయం చేసేసి మరో చెట్టు నిలబెట్టినట్టయింది. అలాంటప్పుడు ఆయన వ్యక్తిత్వప్రభావం మతంమీద పడడం సహజం. అంచేత ఈ ధర్మం వ్యక్తిత్వ ప్రధానమయిన ధర్మమైపోయింది."

భూమిమీద మొక్కనాటితే అది భూమిలోంచే పోషణకై ఆహారం తీసుకుంటుంది. పెరిగి పెద్ద వృక్షమవుతుంది. అలా కాకుండా వేరే వొక గోలెంలో మొక్క నాటాడు బుద్ధుడు. గోలెంలోని మొక్క దేశ దేశాలు పట్టుకు వెళ్ళడానికి మాత్రం వీలయింది. కాని ఎక్కడికి పట్టుకువెళ్ళినా అది పెద్ద వృక్షంలా పెరగలేకపోయింది. గడ్డిలాగా వ్యాపించింది. అంతే మర్రిచెట్టులా విశాలం కాలేకపోయింది. భారతదేశంలోని సంప్రదాయానికీ, వైదిక ధర్మానికీ, భాగవతధర్మానికీ ఇక్కడి పర్వతాలతోనూ, నదులతోనూ, అడవులతోనూ అవినాభావమయిన సంబంధముంది. బౌద్ధధర్మం ప్రాచీన సంప్రదాయాలు నాశనం చేసినచోట, ఆ సంప్రదాయాలకు ఆధారమయిన భూమితోనూ, ఆ సంప్రదాయాలు మన్నించే పూర్వులతోనూ

కూడా సంబంధం వొదులుకుంది. పూర్వమహర్షులన్నా, రాముడూ కృష్ణుడూ అన్నా బౌద్ధ ధర్మంలో మహత్వం లేకుండా పోయింది. తమ పూర్వులమీద గౌరవం నశించినప్పుడూ, తమ జన్మభూమితో సంబంధం లేని చోటా వ్యతిరేకమయిన జాతీయభావాలు ఉత్పన్నం కావడం స్వాభావికం. మమత్వమనేది లేకుండానే బౌద్ధధర్మం దేశాంతరాలు వెళ్ళింది. అక్కడ తాను జ్ఞానమూ, శిక్షణా ఉపదేశించింది. దాంతోపాటు ఆయాదేశాలనించి కూడా అనేక విషయాలు తనలోకి తెచ్చుకుంది. అంతేకాదు, రాను రాను తన దేశబంధువులకంటె, ధర్మబాంధవులే తనకు కావలసిన వాళ్ళని భావించింది. మనదేశం ఆక్రమించడానికి వచ్చిన పరాయిదేశంవాళ్ళా బౌద్ధ ధర్మంలోని ఈ జాతీయ విరుద్ధ ప్రవృత్తులు తమ స్వలాభానికి వినియోగించుకున్నారు. అందుకనే వాళ్ళలో ఎంతోమంది బౌద్ధధర్మం స్వీకరించారు. దేశ స్వాతంత్ర్య మపహరించిన ఈ ధర్మబంధువుల్ని బౌద్ధ ధర్మం తన వాళ్ళని కౌగిలించుకుంది. ఆ దినాల్లో బౌద్ధధర్మం వొక అత్యాచారవర్గం తాలూకు పెంపుడు బిడ్డలా తయారయింది. ఆ వర్గం నాశనం కావడంతోనే బౌద్ధధర్మం పతనం కావడం తప్పనిసరి అయింది. దాంతో బౌద్ధధర్మం జాతీయ శిఖరంనించి పడిపోయి హిందూస్వరూపానికి వ్యతిరేకమయిన స్వరూపం ధరించింది.

ఈస్థితిలో బౌద్ధధర్మం నిర్మూలించడం జాతీయమైన ఒక కర్తవ్యమైపోయింది. ఒకరి తరువాత ఒకరు మహాపురుషులు జన్మించారు. జాతీయ విరుద్ధమైన ప్రవృత్తులను భారతదేశంనించి నాశనం చెయ్యడానికి పూనుకున్నారు. వీరిలో కుమారిలభట్టు, శంకరాచార్యుల పేర్లు యావన్మందీ ఎరుగుదురు. అయితే, వీరేకాకుండా ఈ జాతీయ కార్యక్రమంలో చేతులు కలిపిన సాధువులూ, సన్యాసులూ, మునులూ, మహర్షులూ ఎంతోమంది పుట్టారు. వాళ్ళందరి పేర్లూ ఇవాళ మనకి తెలియకపోవచ్చు. వాళ్ళ సద్గ

ణాలను మనం కీర్తించకపోవచ్చు. కాని మనహృదయంలో జాతీయమైన భక్తిభావం మనకి తెలియకుండానే మౌనంగా వారికి శ్రద్ధాంజలి సమర్పిస్తుంది. జాతీయవిరుద్ధమైన ప్రవృత్తులు నాశనంచేసే ఈ ప్రయత్నాల్లో మానసికంగా సంకల్పించుకోవడమూ - ఇదే మన ప్రత్యేకత. మన మహాపురుషులు విరోధాత్మక మయినటువంటి దృష్టిపెట్టుకుని బౌద్ధధర్మం తొలగించలేదు. అలాఅయితే వాళ్ళప్రయత్నం సఫలమయ్యేదేకాదు. భారత దేశం వాంఛించిన జీవనమున్నూ తయారయేది కాదు. వినాశకరమైన భావనతో పనిచేస్తే ప్రవాహంలాంటి జాతీయ జీవనంలో స్తబ్ధత ఏర్పడుతుంది. అభావం సృష్టి అవుతుంది. జీవనంలో వొక శూన్యత్వం పుట్టుకువచ్చి, అదే మృత్యువుకి దారి తీస్తుంది. అంచేత వాళ్ళు తమ నిర్మాణాత్మక కార్యక్రమంవల్లే జాతీయవిరుద్ధమైన ప్రవృత్తులు స్థాపించారు. అందుకనే ఈ యుగంలో సంప్రదాయసిద్ధమూ, జాతీయమూ అయిన వైదిక ధర్మ వ్యాప్తికోసం, దాని పుష్టికోసం చేసిన ప్రయత్నాలు వ్యక్తమైనట్టు, బౌద్ధ ధర్మం వినాశనానికి జరిగిన ప్రయత్నాలు వ్యక్తంకావు. తీక్ష్ణమయిన జాతీయ ప్రకాశం నాలుగు దిక్కులా వ్యాపించడానికి గట్టి ప్రయత్నాలు జరిగాయి. అంతే. దాంతో జాతీయవిరుద్ధమైన ప్రవృత్తుల అంధకారం దానంతట అదే పటాపంచలైంది. ఈ జ్వాలయొక్క వెలుగు మరింత మహోజ్వలతమం చెయ్యడంకోసం సాధువులూ, సన్యాసులూ. కవులూ, కళాకారులూ, పౌరాణికులైన సూతులూ, స్మృతికర్తలైన మునులూ, ధర్మకర్తలైన ఋషులూ, భక్తిరసం ప్రవహింపచేసే యోగులూ; తిరిగి అశ్వమేధాలుచేసి, భారత దేశంలో సామ్రాజ్యాలు స్థాపించి దిగ్విజయం చేసిన సమ్రాట్టులూ; ఆధ్యాత్మికంగా, రాజకీయంగా, భారతసమైక్యతను రాజకీయాలతో వర్ధిల్ల చేసిన రాజనీతి విశారదులూ, శిల్పులూ, వర్తకులూ, యావన్మందీ పందేలు వేసుకున్నట్టు బయల్దేరారు. అందరూ మేమంటే మేమని ముందుకి వురికారు. జాతీయశక్తి వృద్ధిచేయడంకోసం ప్రాణాలర్పించడానికని ఉవ్విళ్ళూరారు.

ఈ జాతీయ భావన కేవలం తత్వజ్ఞులూ, బుద్ధిమంతులూ అయిన ఏ కొద్ది మంది ప్రజల్లోనో వుండిపోలేదు. ప్రజానీకం యావన్మందీ ఈ భావనలో ఉక్కిరి బిక్కిరవుతూ వుండేవాళ్ళు. అంచేతనే ఈ యుగంలో వొక అపూర్వమైన కర్మచైతన్యం మనకి గోచరిస్తుంది. సర్వవ్యాపకమైన ఈ కర్మచైతన్యం బుద్ధభగవానుడినుండిమొదలుకుని శంకరులవరకూ - మొత్తం యుగమంతటా కనిపిస్తుంది. ఒక్కపక్క బుద్ధభగవానుడు నిద్రపోతున్న జనాన్ని లేవగొట్టాడు. అసాధారణమైన భావవిప్లవం రెచ్చగొట్టాడు. దాని పరిణామం రెండోపక్క వైదికధర్మంలో సంఘర్షణా, సమన్వయమూ ఆరంభమయ్యాయి. దాంతో అద్వితీయమైన కార్య చైతన్యం ఉదయించింది. సర్వవ్యాపకమైన అలాంటి కార్య చైతన్యం జాతీయ జీవనంలో ఎప్పుడో వొకప్పుడు కాని లభించదు. ఈ యుగంలో జీవనం స్థిరమై కదలకుండా వుండిపోలేదు. అది నిరంతరం ప్రవహిస్తూనేవుంది. దానిలో జీవన ప్రేరక మయిన శక్తి పనిజేస్తూనే గోచరిస్తుంది. ఆ కాలంలో ప్రతి వొక్కరి కోసమూ తలుపులు తెరిచేవుండేవి. విస్తీర్ణమైన కార్యక్షేత్రం ఎదురుగుండా వుండేది. గట్టు తెగిపోగానే నీళ్ళు నాలుగు దిక్కులా వ్యాపించిపోతాయి. అదిగో, అలాగ భారతీయులు అన్ని దిశలా పురోగమించారు. ప్రతి క్షేత్రం లోనూ వికాస శిఖరాలు చేరుకోవాలన్న ఆకాంక్ష రేకెత్తింది. సంవత్సరాల తరబడి దాహంతోవున్న భూమి వాన కురిసేసరికి నాలుగు దిక్కులా ఎలా పచ్చగా అగుపిస్తుందో, అలాగే అంతవరకూ తృప్తి ఎరుగని ప్రజల ఆత్మ కూడా తృప్తిపడింది. జాతీయ జీవనం అనేక శాఖల్లో ప్రవాహ రూపంతో విజృంభించింది. ధార్మిక, రాజ, నైతిక, సాంఘిక, ఆర్థిక క్షేత్రాల్లో - అన్నిటిలోనూ మనం ముందుకి వెళ్ళాం. సాహిత్యమూ, కళ - ఈ రెంటి లోనూ కూడా ఆ ప్రవాహం పొంగులు వారింది. యావద్భారత దేశమూ ముంచెత్తింది. ఈ సమయంలోనే మానవులు దుఃఖాలనించి ముక్తి పొంద గల సత్య మార్గం బోధించడం కోసం ఉదమ్యమైన ఉత్సాహంతో మన ధర్మ

ప్రచారకులు దేశదేశాలు వ్యాపించారు. ప్రపంచం మూలమూలల భారతీయ విజయపతాకం ఎగరవేశారు. జావా, సుమత్రా, బాలీ, సయాం, ఇండో చైనా, చైనా, జపాన్, బలఖా, బుఖారా, ఈజిప్టు, గ్రీసు, రోము-అన్ని చోట్లకూ జ్ఞానదీపం పట్టుకువెళ్ళారు. అంధకారం పారదోలారు. మానవ హృదయంలో ఆశాజ్యోతి వెలిగించారు. అటు మన సాంస్కృతిక సామ్రాజ్యం విస్తీర్ణమవుతూ వుండేది ఇటు దిగ్విజయులైన మన సమ్రాట్టులు పెద్ద పెద్ద సామ్రాజ్యాలు నిర్మించారు. సముద్రాలు దాటి వలసలు స్థాపించారు. బృహత్తర భారతం యొక్క సాంస్కృతిక, ఆధ్యాత్మిక కల్పనలకి స్థూలమైన ఆదిభౌతిక స్వరూపం ప్రసాదించారు. మన వర్తకులు దూరదేశాల్లో వాణిజ్యం చేశారు. భారత భూమికి బంగారంతో తొడుగు చేశారు. భారతీయుల సిరిసంపదల యుగమది. సుఖశాంతుల యుగమది. చరిత్రకారులు ఈ యుగం భారత స్వర్ణయుగమన్నారు.

ఈ కాలం స్వర్ణయుగమని మనమంటున్నామంటే అపుడు పెద్ద పెద్ద సామ్రాజ్యాలు వుండటంచేత కాదు. అపారమైన ధనరాసులూ, అతులమైన వైభవమూ, కళా, ఉన్నతమైన సాహిత్యమూ వుండడం చేతకాదు. ఇవాళ అవేవీ మన దగ్గిర లేవు. పెద్ద పెద్ద సామ్రాజ్యాలు కూలిపోయాయి. అపారమైన ధనరాసులూ, వైభవమూ మాయమైపోయాయి. కళా, సాహిత్యమూ కొద్ది మంది విద్వాంసుల పరిశోధన సామాగ్రిగా మాత్రం మిగిలిపోయింది. మన జాతీయత యావత్తూ వొక్కటి కావాలన్న ఆవేదన ఆ యుగంలోని గొప్పతనం. భారత ఏకత్వమూ, అఖండత్వమూ ఏర్పడడం కోసం చేసిన ప్రయత్నమే ఆ యుగాన్ని స్వర్ణయుగంగా చేసింది. ఈ భావాలకు మూర్తిమంతమైన వొక స్వరూపమివ్వగలిగిన సంస్థలు స్థాపించడమూ, వాటిని శాశ్వతంగా వుంచే సంస్కార ప్రణాళిక లేర్పరచడమున్నూ ఆ యుగంలోని విశిష్టత.

జాతీయమైన ఇలాంటి మన ప్రయత్నం వైదిక కాలం నుంచీ వస్తూనే ఉంది. అంతఃప్రకృతితో బాహ్యప్రకృతిని జోడిస్తూ గానం చేస్తాడు ఋషి. తన హృదయంలోని భక్తి భావం వ్యక్తం చేస్తూ—

ఇమే మే గంగే యమునే సరస్వతి
శతద్రు స్తోమం సచతా పరుష్ణ్యా।
అసిక్న్యా మరుద్ వృధే వితస్త
యార్జీకీయే శ్రుణుహ్యాసుసోమయా॥

అని అతడు గానం చేసినప్పుడు ఆ దేశభక్తి కల్పనకు వొక స్థూల స్వరూపం లభిస్తుంది. దేశం, ఆత్మకి ఆధార స్వరూపమయిన మాతృభూమి చిత్రం కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. బౌద్ధధర్మం వ్యాపించడం వల్ల ఈ జాతీయ సంకల్పనకి దెబ్బ తగిలింది. హిందూ ధర్మమూ, హిందూ జాతీయతా నాశనమయిపోతుం దనిపించింది. కాని అక్షయవటం వేళ్ళు పాతాళం వరకూ పాతుకుపోయి వున్నాయి. నరుకుతూ వుంటే అది చిగురిస్తూనే వుంటుంది. అదిగో,అలాగే వైదిక ధర్మమనే వటవృక్షం ఎన్ని సార్లు నరికి పారేసినా మళ్ళీ చివుళ్ళతోనూ ఆకులతోనూ పచ్చగా తయారవుతూనేవుంది. ఎంచేత? దీనివేళ్ళు భారతభూమిలో లోతుగా నాటుకుపోయి వున్నాయి గనుక. ఎంత లోతుగా? అది ఇవాళదాకా ఎవడూ అంతు కాన లేదు. మధ్యగట్టు కట్టినంత మాత్రాన గంగా ప్రవాహం ఆగిపోదు. గంగోత్రినించి ఎడతెగని ప్రవాహం ప్రవహిస్తూనే ఉంటుంది. బ్రహ్మాండమైన గట్టువేసి గంగమ్మ తల్లిని నిలిపేశామనీ, ఇక సముద్రం దాకా ఆమె వెళ్ళలేదనీ మనమనుకోవచ్చు. కాని కొద్దిరోజుల్లో మన పొరపాటు మనకు తెలిసిపోతుంది. అనంత స్రోతస్విని గంగాభవాని గట్టు చిందరవందర చేసేసి ముందుకు సాగిపోతుంది. తన గమ్యస్థానం చేరుకుంటుంది. గంగా ప్రవాహం ఎక్కడ ఎంత వుందో ఇవాళదాకా ఎవ్వరికీ అంతు

చిక్కలేదు. అదిగో అలాగే హిందూ ధర్మమూ, హిందూ జాతీయతా ప్రగతి ఆపివెయ్యాలని ఎన్నోసార్లు ప్రయత్నాలు జరిగాయి. కాని అన్ని సార్లూ అలా ఆపబోయినవాళ్ళనికూడా తీసుకుని ముందుకు సాగిపోయిం దది. గంగానది గట్టు విరిచేసి, దానిని తన వొడిలో పెట్టుకుంటుంది. గట్టులోని రాళ్ళు గంగమ్మతల్లి పుణ్యజలాల తాకిడికి కొన్నాళ్ళయేసరికి తమ కరుకుదనం వొదిలి పెట్టేస్తాయి, సాలగ్రామాలయి పూజింపబడతాయి. అలాగే హిందూ ధర్మం కూడా తన నరికట్టజూచిన వాళ్ళని తన వొళ్ళోకి లాక్కుని ముందుకి సాగింది. ఆ కాలంలో దానికి అంత శక్తి ఉండేది. కనుకనే అలా చెయ్యగలిగింది. తాను ముందుకి నడవడమే కాక ఇతర్లని కూడా వెంటతీసుకుని పోగలిగింది. వెంటవెళ్ళిన వారున్నూ దాని శక్తి, దాని స్నేహమూ, దాని ఔదార్యమూ చూసి తమ మొండిపట్టు వొదులు కున్నారు. విరోధం విడిచిపెట్టేసి దానితో స్నేహంగా ఉండటమే తమకి మేలని భావించారు. హిందూ ధర్మమున్నూ వాళ్ళని గుండెల కద్దుకుంది. వాళ్ళని తనలో వొక భాగంగా చేసుకుంది. తన హృదయ సింహాసనం మీద వొకమూల స్థానమున్నూ ఇచ్చింది. హిందూధర్మం సమన్వయపరిచే ప్రవృత్తులకి ఉజ్జ్వలమైన ఉదాహరణమే శ్రీ శంకరులు. వెయ్యేళ్ళ క్రింద నరకబడినా, ఆ కాలంలో బాగా పెరిగిన వైదిక ధర్మమనే వటవృక్షం పుణ్యఫల మాయన.

బుద్ధ భగవానుడు వైదిక ధర్మం మీద దాడి చేసినప్పుడు, వైదిక ధర్మం ముక్కు మూసుకుని పూరికే కూచోలేదు. కాలగతి గమనించిందది. దానితోపాటు ఈ దాడి మూలంగా దేశానికి రానున్న హాని కూడా గమనిం చింది. అంచేత వైదిక ధర్మాన్ని బలపరచటం, యుగానుకూలంగా దానిని తయారు చేయడం తమ కర్తవ్యమని వైదిక విద్వాంసులు భావించారు. ఈ దండయాత్రకి కారణాలున్నూ వారు గ్రహించారు. అంతేకాదు, బౌద్ధ

ధర్మంలోని మంచినీ వారు స్వీకరించారు. అంతమాత్రంతోనే ఆగిపోలేదు. బుద్ధభగవానుడు విష్ణుమూర్తి అవతారమని శ్రీ శంకరుడు ప్రకటించాడు. హిందూ ధర్మం కర్మకాండ నాశ్రయించిన ఏ కొద్ది మంది పండితులదో అయివుండిపోలేదు. పైగా, అది అతి సాధారణ జనుల యావన్మందిదిన్నీ అయిపోయింది. ఈ ప్రవర్తనల మూలంగా బౌద్ధ ధర్మం భారత దేశంలో అవసరం లేకుండా పోయింది. బౌద్ధ ధర్మంలో లభించే భక్తి భావమూ నైతికతా ప్రజలకి హిందూ ధర్మంలో దొరుకుతూనేవుంది. ఇంకా చెప్పాలంటే, దానికంటే దీనిలోనే అధికంగా ఉంది. హిందూ ధర్మంలో పూర్వులమీద భక్తీ, మాతృ భూమి మీద మమతా, స్వాభిమానమూ, జాతీయ జీవనం నిలుపుకోవాలన్న ఆకాంక్షా- ఇన్నీ ఉన్నాయి. శ్రీ శంకరుల కాలానికి బౌద్ధధర్మమూ, హిందూధర్మమూ వొకదాని దగ్గిర వొకటి చేరిపోయాయి. బుద్ధభగవానుడు అవతారపురుషుడని శ్రీ శంకరు డంగీకరించాడు. అలాగే బౌద్ధుల శూన్యవాదంతో సమానమనిపించిన వేదాంత వాద మాయన స్థాపించాడు. దాంతో బౌద్ధ ధర్మం స్వతంత్రంగా ఉండవలసిన అవసరం లేకుండా పోయింది. అది హిందూ ధర్మంలో కలిసిపోయింది. ఈ కలయిక, దాని కారణమూ, అందుకు జరిగిన ప్రయత్నాల చరిత్రా - ఇవన్నీ మన జాతీయ జీవనం యొక్క ప్రత్యేకతని స్పష్టం చేస్తున్నాయి. జీవన తత్వం గురించి మన పట్టుదల ఎప్పుడూ వుండనే ఉంది. జీవనానికి నిండుతనం తెచ్చే సాధనాలు ఏ యుగానికి తగినట్టు ఆ యుగంలో సవరించుకోవడంలో మన మెన్నడూ వెనుకాడలేదు,

వైదిక ధర్మం మీద దాడి జరగగానే, మొట్టమొదట అస్త్రశస్త్రాలు సరిచేసుకుని నిభాయించుకోడం జరిగింది. నాలుగు దిక్కులా రక్షణ లేర్పాటయినాయి. తమ ధర్మం తర్కమనే పునాది మీద నిలబెట్టడం

కోసం షడ్దర్శనాలు తయారయ్యాయి. ప్రతి దర్శన శాస్త్రమూ తన స్వతంత్రమైన పద్ధతు లేర్పాటు చేసుకుంది. తర్కసిద్ధమయిన ప్రణాళికలతో వైదికాదర్శాలు ప్రతిపాదించింది. తరువాత, ఈ ఆరు దర్శనాల లోనూ ఒక అద్భుతమైన సమన్వయమూ, సామంజస్యమూ మనకి గోచరిస్తుంది. సాధారణ జనాన్ని ఆకర్షించడానికి పెద్ద పెద్ద దేవాలయాలూ, మఠాలూ స్థాపితమయ్యాయి. పురాణాలూ, ఆగమాలూ వ్రాయబడ్డాయి. కథలూ గాథల ద్వారా నిగూఢమైన ధర్మసిద్ధాంతాలు సాధారణ జనం ముందుకి వచ్చాయి. భక్తి తరంగాలూ లేచి ప్రజలు యావన్మందినీ వోలలాడించాయి. వేదాల్లోని పురాతనమైన ఆదర్శాలూ, ఉపదేశాలూ, చక్కని క్రొత్త పద్ధతులలో పెట్టడం కోసమే పురాణాలు తయారయ్యాయి. ప్రాచీనత నిలబెడుతూనే క్రొత్తదనమెలా గ్రహించిందీ ఈ పురాణాల్లో మనకు కనిపిస్తుంది. అలాగే ఇవి తిరుగుబాటు నణచివేస్తూనే జాతీయాత్మని సజీవంగా నిలబెట్టాయి. పురాతన గార్హస్థ్య సూత్రాల స్థానే స్మృతులు వచ్చాయి. యజ్ఞాలకి బదులు దేవాలయాలు, పూజలు అవీ బయలుదేరాయి. హిందూ ధర్మస్వరూపం మారింది. కాని, దాని ఆత్మ అలాగే వుంది. ఏమంటే, ఆనాటికి కూడా ప్రాచీనత మీద శ్రద్ధాభక్తులుండేవి. ప్రాచీనమైన ఆదర్శాలు, జీవన దృష్టి సంఘంలో ఉండేవి. అయితే వాటి సాధన మాత్రం మారిపోయింది.

జాతీయ జీవనంలో స్వదేశ మహత్వం అన్నిటికంటే అధికంగా వుంటుంది. అంచేత ఈ యుగంలో సహజంగానే సమగ్రమైన మాతృభూమి దర్శనం కోసం ప్రయత్నాలు జరిగాయి. ప్రతివాడి ఎదటా - అతడు ఏ మత సంప్రదాయానికి చెంది వాడైనాసరే, హిమాలయం నించి కన్యాకుమారి వరకూ. ఇవతల సముద్రం నించి అవతల సముద్రం వరకూ భారతమాత చిత్రం ప్రత్యక్షమయింది. రకరకాల సంప్రదాయాలకి చెందిన

ప్రతి ఆచార్యుడూ తన సంప్రదాయాల ప్రజలు యావన్మందీ సమగ్ర భారతదేశం పవిత్రమైందని భావించాలని యత్నించాడు. ఈ భారతీయైక్యత ప్రతివాడూ ప్రత్యక్షంగా తెలుసుకోవాలని కోరాడు. అందుకని ప్రతి సాంప్రదాయంలోనూ తీర్థయాత్రా పద్ధతి ప్రచారంలోకి వచ్చింది. ఈ తీర్థాలు భారతదేశం ఈ మూలనించీ ఆ మూలవరకూ వ్యాపించాయి. సూర్యమతస్థుల పన్నెండు దేవాలయాలూ, గాణాపత్యుల ద్వాదశగణపతులూ, శైవుల పద్దెనిమిది జ్యోతిర్లింగాలూ, శాక్తేయుల యాభై వొక్క శక్తి క్షేత్రాలూ, వైష్ణవుల లెక్కలేని తీర్థక్షేత్రాలూ భారతదేశమంతటా వ్యాపించి వున్నాయి. విస్తృతమైన పుణ్యక్షేత్రాల మూలంగా సంకుచితమైన ప్రాంతీయ భావాలు మొలకెత్తడానికి వీలు లేకపోయేది. పురుషోత్తముడైన రాముడి దక్షిణయాత్ర ఉత్తర దక్షిణాలని వొకటిగా బంధించింది. ప్రజల ఆచారాల్లోనూ ఊహలలోనూ ఐక్యత ఘటించింది. ఈ ఐక్యత ఎత్తిచూపడం కోసం మహాభారత రచయిత వొక్కసారి కాదు, రెండుసార్లు కాదు, మూడేసిమార్లు ఈ చివరినించి ఆ చివరివరకూ భారతదేశం భావభరితంగా వర్ణించాడు. భారతభూమి ప్రతి కణమూ పవిత్రమైందిగా పురాణాలు కీర్తించాయి.

ప్రతి మతం ముందూ ప్రతి సాంప్రదాయం ముందూ సమగ్రమైన భారత స్వరూపం ఉండనే ఉంది. వాటిలో ప్రతిదీ వైదిక ధర్మ సాంప్రదాయాలు నిలుపుతూనే భారత భూమి కీర్తి, ప్రతిష్ఠ వృద్ధి చేయడానికి ప్రయత్నిస్తూ ఉండేది. అయితే, ఇలా ఒకే ఆదర్శంతో పని చేసే వాళ్ళలో పరస్పర సహయోగమూ, ఐక్యమత్యమూ అవసరంగా వుండేవి. అంచేత జాతీయ భావం మరింత పెంచేసే భిన్న భిన్న మత సాంప్రదాయాల సమన్వయ ప్రవృత్తుల వికాసం కూడా ఈ యుగంలో జరిగింది. ఇలా సమన్వయం చేసిన కీర్తి అధికంగా శ్రీ శంకరులకు దక్కింది. ఈ

సమన్వయ కార్యంలోకూడా దేశంయొక్క ఐక్యతమీదా, అఖండత్వం మీదా దృష్టి నిలపడం జరిగింది. నల్దిశలా ఐక్యత కోసం ప్రచారం జరిగింది. పడుగూ పేకలా వొక భావనా సూత్రం మగ్గంపట్టి వస్త్రం నేసినట్టయింది. భిన్న భిన్న సంప్రదాయాలవారి తీర్థక్షేత్రాలు సమగ్ర భారతదేశంలో పడుగులా వ్యాపించాయి.అందులో నాలుగు క్షేత్రాలు పర్చి వాటిని సమస్త సంప్రదాయాల వాళ్ళకీ ధర్మ ప్రదేశాలుగా తయారుచేశారు. మంచుకప్పిన హిమాలయ పర్వతం శిఖరాల మీదవున్న బద్రీనాథ్ వెళ్ళ టానికి అన్ని సాంప్రదాయాలవాళ్ళూ, అన్ని ప్రాంతాలవాళ్ళూ కాంక్షిస్తారు. మహోదధీ, రత్నాకరమూ తల్లి పాదాలు కడుగుతున్న చోటు రామేశ్వరం దర్శించడానికి శైవులెంత భక్తితో వెళతారో అంతకంటే అధికమైన భక్తితోనే వైష్ణవులు గంగోత్రి జలం పట్టుకువచ్చి శివలింగానికి అభిషేకి స్తారు. 'జై జగన్నాథం', 'సర్వం జగన్నాథం' అంటూ భక్తితో శ్రీ జగన్నాథం వెళ్ళి ప్రసాదం పుచ్చుకోవడం జాతీయ సంఘటనలో సంజీవినిలా పనిచేస్తుంది. గొప్ప గొప్ప శాస్త్రేయులు కూడా ద్వారకా నగరం వెళ్ళి భక్తితో వాసుదేవుడైన శ్రీ కృష్ణభగవానుడి పాదాలు పూజిస్తారు; ధన్యులమని భావిస్తారు. ఇలాగే పురాణ రచయితలు-

> అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా।
> పురీ ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయికాః॥

అని చెప్పినపుడు సంప్రదాయక భావం నుంచి ఎంతో పైకిలేచి జాతీయ భూభాగం మీద నుంచుని, వాళ్ళు ఆలోచించారన్నమాట. ఏడు పట్టణాలూ భారత జాతీయతకి ఏడు కీలకస్థానాలు. భారతీయ సభ్యతకీ,సంస్కృతికీ కేంద్రాలు. ఇందులో ప్రతి పట్టణానికీ పురాతన చరిత్రతో సంబంధం ఉంది. వీటి పేర్లు తలుచుకుంటే చాలు- గత చరిత్ర యావత్తు చలన చిత్రంలా కళ్ళముందు ప్రత్యక్షమవుతుంది. అంతే కాదు, భారతభూమిలో

ఎక్కడైనా, ఏ ప్రదేశమైనా సరే, దాని ప్రకృతి సౌందర్యం మన హృదయతంత్రులను కదిలిస్తుంది. అంతఃకరణంలో కోమలమైన ఉన్నత భావాలు కలిగిస్తే చాలు- అది తీర్థక్షేత్రమయి పోతుంది. మన పూర్వ ఋషులతోనూ; మన ఆదర్శనీయులూ, ఆరాధ్యులూ అయినరాముడితోనూ, కృష్ణుడితోనూ- లేదా ఏ మహాపురుషుడితోనో జాతీయమైన చరిత్రకు సంబంధమున్న స్థల మేదయినా సరే, అది తీర్థక్షేత్రమే. అక్కడ యాత్ర లారంభ మవుతాయి. "తిరునాళ్ళు" జరుగుతాయి. ఈ తిరునాళ్ళు, యాత్రలు మన జీవనంలో ఒక భాగమయిపోతాయి. నేటికీ లక్షల కొలది, కోట్లకొలది యాత్రికులు అన్నివిధాల కష్టములు సహించి మాఘమాసంలో గజగజలాడించే చలిలో కుంభమేలా స్నానం చేస్తున్నారంటే వాళ్ళను ప్రేరేపించిన విశ్వాసం ఎంతో భార మయిందన్న మాట. ఈ విశ్వాసం కలిగించే సంస్కారాలు పునాది వేసిన మహాత్ముడికి దేశం ఎంత కృతజ్ఞతగా ఉండాలి? ఈ కుంభమేలా ఏమిటి? సంచారం చేసే జాతీయ విద్యాలయమన్న మాట! హరిద్వారమూ, ప్రయాగా, ఉజ్జయినీ, నాసికా- భారతదేశంలోని నాలుగు ప్రముఖ స్థానాల్లోనూ, మూడేళ్ళకోమారు సమావేశమయ్యే జాతీయ సమ్మేళనమన్న మాట! లక్షలాది సాధువులూ సన్యాసులు అక్కడికి వస్తారు. కోట్లాది జనం సమావేశమై వాళ్ళని దర్శిస్తారు. వాళ్ళ ఉపదేశం వింటారు. తమ హృదయాలలోని కల్మషం కడిగేసుకుంటారు. జీవితం పవిత్రం చేసుకుంటారు. అన్ని సంప్రదాయాల జనమూ ఇలా మూడేళ్ళకోమారు ఒక్కచోట సమావేశమైనప్పుడు భారత దేశ సమన్వయ వాతావరణంలో ఒకే ఆత్మగా తయారు కాకుండా ఎలా ఉండగలరు?

మన దైనందిన వ్యవహారాల్లోకూడా ఈ జాతీయభావన పెరుగుతూ వచ్చింది. అంచేత ప్రతి రోజూ మనం చేసే పనుల్లోకూడా ఈ జాతీయ

భావన వృద్ధి చేసే సంస్కారాలు సమన్వయమైనాయి. హిందువుడన్న వాడు ఉదయాన్నే లేవగానే భూమిమీద అడుగు పెడుతూ సవినయంగా తల్లికి నమస్కారం చేసి అంటాడు:

సముద్రవసనే దేవి, పర్వత స్తన మండలే,
విష్ణుపత్ని నమస్తుభ్యం, పాదస్పర్శమ్ క్షమస్వమే.

అదే సమగ్రమైన భారత స్వరూపమై, దాని ముందు హృదయం లోని భక్తి భావం బైటికి వచ్చేస్తున్నట్టు భావిస్తాడు. తరువాత చేసే ప్రాతఃస్మరణలో కూడా క్రమంగా తన పూర్వుల్ని స్మరిస్తూ తాను కూడా వాళ్ళంతవాడు కావాలని అభిలషిస్తాడు. ఆ ప్రాతఃస్మరణలో ప్రాంతమూ, సంప్రదాయమూ అనే సంకుచిత భావానికి స్థానమే లేదు. నూటికి నూరు పాళ్ళూ పరిశుద్ధమైన జాతీయ భావన అది - స్నానం చేసేటప్పుడు లేదా సంకల్పం చేసేటప్పుడు—

గంగేచ యమునేచైవ, గోదావరి సరస్వతి,
నర్మదే సింధు కావేరీ, జలే స్మిన్ సన్నిధిం కురు.

అన్నప్పుడు భారత దేశంలోని సమస్త పవిత్ర నదుల్ని ఆవాహన చేస్తాము. ఈ నదులతో సమానమైనవే ఏడు వనాలూ, ఏడు పర్వతాలూ, నాలుగు సరోవరాలూ భారతదేశ మంతటా వ్యాపించి వున్నాయి. వీటన్నింటికీ మన జీవనంలో మహత్వమైన స్థానమిచ్చాము.

అన్ని సంప్రదాయాల వాళ్ళలోనూ ఐక్యత స్థాపించడం కోసమే మనలో త్రిమూర్తి కల్పన జరిగింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లేర్పడ్డారు. ఒక్క పరబ్రహ్మం భిన్నస్వరూపాలే ఈ మూడు మూర్తులు. శివకేశవుల్లో ఏ విధమైన విరోధమూ వుండకూడదు. అందుకని పురాణాలు శివుణ్ణి, కేశవుణ్ణి పరస్పర భక్తుల్ని చేశాయి. శివుడు విష్ణుభక్తుడు. విష్ణుమూర్తి

పాదాల్లో పుట్టిన గంగాదేవిని తన శిరస్సుమీద పెట్టుకున్నాడు. విష్ణుమూర్తి అవతారమైన శ్రీ రాముడు శివుణ్ణి ఆరాధించికాని తన జైత్రయాత్రలో ముందుకి సాగలేదు. తానిచ్చిన వరాలవల్ల శివుడు భస్మాసురుడు, రావణాసురుడు వంటి రాక్షసులికి భయపడితే, విష్ణుభగవాను దతని సహాయం కోసం పరుగెత్తాడు. గణపతి, శక్తి, శివుడు- వీళ్ళు వొక కుటుంబంలోనే చేర్చబడ్డారు. ఇలా మన పురాణాలు అన్ని సంప్రదాయాల ఆరాధ్యదేవతల్ని ఒకరితో నొకరికి పరస్పర సంబంధాలు ముడిపెట్టారు. పరస్పరం ప్రేమ, సౌజన్యము నాటుకొనేట్టు చేశారు. శ్రీ శంకరుడు పంచాయతన పద్ధతి ప్రవేశపెట్టి ఈ సంబంధం మరింత ధృఢపరిచాడు. దీని ప్రకారం ప్రతివాడూ విష్ణువు, శివుడు, శక్తి, గణపతి, సూర్యుడు— అయిదుగురు దేవతల్ని పూజించవచ్చు. ఈ యుగంలో సమన్వయము, ఓర్పు వంటి పరిణామమే భారతీయులు ఎల్లకాలము ప్రేమతోను, సౌహార్ద్రంతోను వుండడానికి కారణమయింది.

కర్మ, భక్తి, జ్ఞానము- ఈ మూడింటి సమన్వయం ఈ యుగంలో లభిస్తుంది మనకు. కృష్ణభగవానుడు స్వయముగా భగవద్గీతలో ఈ మూడూ చక్కగా సమన్వయ పరిచాడు. ఈ యుగంలో భగద్గీతకి మహత్తరమైన స్థానం లభించింది స్వయంగా శ్రీ శంకరుడు తన జీవితంలో జ్ఞానము, కర్మ, భక్తి- ఈ మూడింటిని చక్కగా సమన్వయించాడు. ఆయన ప్రయత్నం వల్లనే ప్రస్థాన త్రయానికి గౌరవం లభించింది. ప్రస్థాన త్రయానికి మహత్వం కలిగించి, వేద విరోధులయిన బౌద్ధుల దురాగ్రహం నుండి బైటపడ్డా డాయన. ఈ ప్రస్థాన త్రయమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత- వీటి జ్ఞానంతో వేదాత్మ చైతన్యవంతం చేశాడాయన. భూమి నాలుగు చెరగులా ఏకఛత్రమైన సామ్రాజ్యాలు స్థాపించిన సమ్రాట్టులు భారతదేశంలో ఈ ఐక్యతకు ఒక

స్థూల స్వరూపం చేకూర్చడానికి ఒకరి తరువాత నొకరు పూనుకొన్నారు. చంద్రగుప్త చక్రవర్తి మొదలుకొని హర్ష, పులకేశుల వరకూ ఎంతో మంది సమ్రాట్టులు ఒకరి తరువాత నొకరు భరతదేశాన్ని ఒక్క త్రాటితో కట్టివుంచడానికే ప్రయత్నించారు. భారతీయైక్య జీవనానికి ఉత్తరాదిని విదేశీయుల వల్ల దెబ్బ తగిలింది. అది ఉత్తరాదినే కాక దక్షిణాదిని కూడ బాధపెట్టింది. తనమీద దెబ్బతగలడంతోనే శరీరం యావత్తూ దాని ప్రతిక్రియ కోసం ప్రయత్నిస్తుంది. అలాగ ఉత్తరాదిని శకులు, హూణులు ఆక్రమించగానే దక్షిణాది నించి శకకారుడైన విక్రమాదిత్యుడు, యశోవర్ధనుడు ఎదిరించారు. ఇలా సుఖదుఃఖాలు, జయ పరాజయాలు మానావమానాలు—అన్నిటిలోనూ ఈ ఐక్యత వ్యక్తమవుతూ వచ్చింది. ఈ ఐక్యత మన జాతీయ జీవనాన్ని ఒక్క త్రాటితో బంధించింది.

మన సాహిత్యకారులు కూడా జాతియొక్క ఈ ఐక్యత భాషలో పొదిగి ప్రజల ఎదుట పెట్టారు. రామాయణమూ, భారతమూ మన జాతీయ సాహిత్యంలో అమూల్యమైన రత్నాలుగా తయారయ్యాయి. రామకథా, కృష్ణ చరిత్రా జాతికి ఆదర్శాలయినాయి. వీరి జీవనాల్లో హిందూ సంఘానికి తన హృదయ భావనల వ్యక్తీకరణమే లభించింది. జనసాధారణంలో జాతీయమైన శ్రద్ధాభక్తులు శాశ్వతమై నిలవడానికి మన సాహిత్యకారులు శాయశక్తులా ప్రయత్నించారు. ఈ యుగం కవుల్లో రాముడిమీదా కృష్ణుడిమీదా కావ్యాలు వ్రాయని వాళ్ళు, రామాయణ భారతాల్లోంచి కావ్యవస్తువు స్వీకరించని వాళ్ళు లేరనే చెప్పాలి. అంతే కాదు, ఈ సాహిత్యకారులే ఈ యుగ జీవనంతో ప్రాచీనతని ముడి పెట్టారు. తన కాలంనాటి సంఘానికి సాహిత్యం అద్దం వంటి దన్నారు. అందులో సంఘం మనోభావం ప్రతిబింబిస్తుంది. సాహిత్యకారులు తమ కావ్యపాత్రలు తమ యుగంలోంచి ఎంచుకోకుండా ప్రాచీనయుగం నుంచి

ఎంచుకున్నారు. అప్పుడు క్రొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్ముతుంది. తమ ఊహలతో ప్రాచీన మహాపురుషుల ఊహలు కలబోసుకుని సుఖమూ, సమాధానమూ, శక్తి సంపాదిస్తారు ప్రజలు. సముద్రగుప్తుడి దిగ్విజయ వర్ణన, రఘుమహారాజు దిగ్విజయ రూపంలో కవి వర్ణించినప్పుడు, భారతదేశాన్ని తెగని సూత్రంతో ముడిపెట్టే ఉద్యమానికి ఎంత శక్తి లభిస్తుంది! ఈ సాహిత్యకారుల ప్రయత్నం వల్లే దేశమంతటా దేవవాణి సంస్కృతం సరస్వతీదేవితో సమానమయిన ఆదర సత్కారాలు పొందింది. భారతదేశం ప్రాంతీయ భాషలు ప్రాకృత మయినా కూడా సంస్కృతం మన జాతీయ భాష అయిపోయింది. మన భావాలు వ్యక్తం చేసుకోవడానికీ, ఆలోచనలు తెలుపుకోడానికీ అదే సాధన మయింది. పవిత్రమైన సంస్కారానికీ జ్ఞాన విజ్ఞానానికీ అదే ఉపకరణ మయింది. యావన్మందీ ఒకే విధంగా దానిని అభివృద్ధి చేశారు.

మన నీతిశాస్త్రకారులు, స్మృతికారులు కూడా మన ఈ ఐక్య భావానికి తోడ్పడ్డారు. మహర్షి చాణక్యుడు 'పృథివ్యై సముద్ర పర్యంతాయా ఏకరాట్ "అన్న ప్రాచీనాదర్శం నిజమని నిరూపించడానికి చంద్రగుప్తుణ్ణి ప్రేరేపించాడు. రాజనీతి అర్థశాస్త్రాల నిగూఢ నియమాలు రచించాడు. దేశంలో ఐక్యత ఏర్పరిచాడు. జాతీయ భావనకై తనవాడెవడో పరాయివాడెవడో కూడ తెలిసిరావడం అవసరం. అలాగే ఇతరుల చేత ఓటమి పొందరాదనే భావము, తమ జాతీయ జీవనాన్ని నిలబెట్టుకోవాలనే పట్టుదల కలిగి ఉండడము, జాతీయ భావాలను బలపరుస్తుంటాయి కూడా. మన నీతిశాస్త్రాల్లో సర్వత్రా ఈ భావన దొరుకుతుంది. చాణక్య మహర్షి 'నత్వే వార్యస్యదాస్యభావః' అని ఘోషించాడు. స్వాభిమానమే అలా ప్రతిధ్వనించింది. హానిస భావాన్ని సరిగా గ్రహించడంలోనే జాతీయభావం వున్నది. అలాగే హానిసత్వాన్ని అసహ్యించుకోవడంలో

జాతి స్వాభిమానం ఉన్నది. మనకి మనమే ప్రభుత్వం కావాలని, ఈశ్వరుడు ప్రసాదించిన ఆర్యావర్తంలో మనం స్వతంత్రులమై ఉండాలనీ గాఢమైన కోరిక మనలో ఎప్పుడూ వుంటుంది. ఇది రాజకీయ భావన మాత్రమే కాక, భౌగోళికమైన భావన కూడా. దీని ప్రకారం మొదటినించీ ఆర్యావర్తంలో హిందువుల రాజ్యం వుండాలనుకుంటూ వచ్చారు జనం. ఇది మానవ ధర్మ శాస్త్రంలో [2-22-23] కూడా చెప్పబడింది. అంతేకాదు, ఈ భావన పతంజలి నాటి నించి మేదాతిథీ [అక్రమ్యాక్రమ్య నచిరం తత్రమ్లేఛా స్థాతారో భవన్తి] పీసల దేవుడిదాకా ప్రజల హృదయాల్లో సజీవంగా వుంది. [ఆర్యావర్తం యథార్థం పునరపి కృతవాన్ మ్లేచ్ఛ విచ్ఛేదనాభిః] * ఈ యుగంలోని తత్వజ్ఞులు ఈ భావన మరింత పెంపు చేశారు. మనుస్మృతి సమగ్ర భారతదేశం వర్ణిస్తూ దీనిని పుణ్యభూమి అని పేర్కొన్నది, తక్కిన దేశాలు మేచ్ఛ దేశాలని నిర్ణయించింది "భారత నామతద్వర్షం, భారతీయత్ర సంతతిః" - ఈవాక్యం భారత దేశాన్నీ, దాని ప్రజల్ని ఎత్తిచూపుతుంది. భారత సంతతిని వర్ణిస్తూ మనువు అంటాడు—

ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మనః
స్వం స్వం చరిత్ర శిక్షేరన్, పృథ్వివ్యాం సర్వమానవాః

ఈ గురుస్థానానికి తగిన శీల యోగ్యత పొందడం కోసం అతడు నియమాలు రచించాడు. సమగ్ర భారతదేశం వెంటనే వాటిని శిరసా వహించింది. భారత ప్రజలు తమ ఆచారాలు, విచారాలు స్మృతికారుల కొలబద్దతో కొలిచి చూచుకున్నారు. ఒకే అచ్చులో పోతపోసినవి. దాంతో వెంటనే వాటిని తమ జీవనంలో చేర్చుకున్నారు. దాని పరిణామం భారత

---

* కాశీప్రసాద్ జాయసవాల్ - అంధయుగ. పు. 104.

దేశమంతటా ఒకే రీతి, ఒకే నీతి, ఒకే నియమము, ఒకే వ్యవహారమూ ఏర్పడ్డాయి. ఈ నీతి శాస్త్రకారులే మన గ్రామ పంచాయితీలు సృష్టించారు. దేశమంతటా వీటి స్వరూపం ఒక్క మాదిరిగానే ఉండేది. మీద శాసనంలో పరివర్తన జరిగినా భారతీయాత్మను స్వతంత్రంగానూ, ఒకటిగాను వుంచాయవి. ఇలా ప్రతి కంఠంలోనూ జాతి, ఆత్మ సర్వతోముఖ వికాసం పొందించి. మిక్కిలి బలిష్టము అయింది. భారతదేశంలో ఈ చివర నుంచి ఆ చివరివరకు వ్యాపించివున్న హిందూ సంఘం యావత్తు ఒకే విధమయిన ఆలోచన, ఒకే విధమయిన కర్తృత్వము అవలంబించింది. జీవనంలో సమరస తత్వము నిండించుకుంది. ఒకే సంస్కృతి మీద ఆధార పడింది. అఖండమైన జాతీయత సాధించింది. ఈ యుగంలో జరిగిన ప్రయత్నాల పరిణామంగా దేశంలో ఒకే జాతీయత పరిపక్వమయింది. తరువాత కలిగిన రాజనైతిక పరాజయ కాలంలో కూడా అది చెక్కు చెదరలేదు. క్రీస్తుశకం ఎనిమిదో శతాబ్ద ఆరంభంలో అరేబియా నుంచి తుఫాను రేగింది. అది యూనాను, ఈజిప్టు, స్పెయిను, పర్షియావంటి పెద్ద పెద్ద దేశాలను శాశ్వతంగా తుడిచి పెట్టేసింది కాని, భారత దేశానికి మాత్రం వచ్చి సముద్రపొడ్డుని దెబ్బతిని తిరిగి పోయింది. దీని తరువాత కూడా ఎందరో ఆక్రమణ జరిపారు. వాళ్ళందరినీ సంఘం శత్రువులుగానే ముక్త కంఠంతో నిర్ణయించింది. వాళ్ళ కబంధ హస్తం నుండి దేశాన్ని విడిపించటం కోసం కొన్నిచోట్ల ప్రయత్నాలు జరిగాయి. అంతే కాదు, ఇవాళ కూడా అదే సంస్కృతి మన హృదయాల్లో మేలుకుని వుంది. 'హిందువు' అన్న మాట ఉచ్చరించే సరికి ప్రతి హిందువుడి రక్తమూ బిందుబిందువు పులకరిస్తుంది.

అఖండమైన ఈ జాతీయతనే ఇవాళ మనం తిరిగి ఆహ్వానించాలి. సింధు దేశం నుంచి బ్రహ్మపుత్ర వరకూ సేతువు నుంచి శీతాచలం వరకూ విస్తృతమైన మన మాతృభూమిలో గౌరవమూ, స్వాభిమానమూ రేకెత్తించాలి. దీనికి అవసరమైన త్యాగం కోసం సిద్ధపడాలి. మన పూర్వుల ప్రయత్నాలే మన మనుసరించాలి.

౨

శివగురువు కలిమికి నోచుకున్నాడేగాని సుఖానికి నోచుకోలేదు. ఆయన భార్య ఆర్యాంబ గుణవతి, విదుషీమణి. సంతానం మాత్రం లేదు. అందుకని శివగురువుకు తన జీవనంలో ఎప్పుడూ లోటు కన్పించేది. తమ ఇరుగు పొరుగువాళ్ళ పిల్లలు కాని, బంధువుల పిల్లలు కాని తమ ఇంటికి వచ్చేవాళ్ళు. ఆర్యాంబ ప్రేమతో వాళ్ళని వొళ్ళోకి తీసుకునేది. ఎంతో సేపు వాళ్ళతో ఆడుకునేది. వాళ్ళకు నీళ్ళు పోసేది, శుభ్రం చేసేది, తల దువ్వేది, అలంకరించేది, వాళ్ళతో ఇంత శ్రమపడేది. వాళ్ళు తమ ఇళ్ళకు వెళ్ళిపోయాక ఆమె హృదయం క్రుంగిపోయేది. బయటచూస్తూ ఎంతో సేపు గుమ్మంలో నుంచుండిపోయేది. శివగురువు ఆమె అవస్థ చూచేవాడు. "శివుడు మేలుచేసి వొక కుమారుడు కలిగితే ఎంత బావుండును!" అనుకునే వాడు. పండుగలు పబ్బాలూ వచ్చేవి, వూరికే వెళ్ళిపోయేవి. బజారుకి వెళ్ళి ఏదైనా వొక కొత్తవస్తువు తేవాలని ఆయనకు ఎన్నడూ బుద్ధిపుట్టేది కాదు. వరసలకీ, వేడుకలకీ ఎన్నడూ వెళ్ళేవాడుకాడు. ఏటికి స్నానానికి వెళ్ళేవాడు. దార్లో పిల్లాళ్ళు తమ తండ్రుల చేతివేళ్ళు పట్టుకు నడవడము చూచేవాడు. తానుకూడా నాలుగు వేళ్ళు ముడివేసుకొని చూపుడు వేలు

చాచేవాడు. కాని ఉత్తరక్షణంలో సిగ్గుపడి పోయేవాడు. ఊరికే, చాచిన వేలు జారిపడిపోతుందా అన్నట్టు చప్పున ఉత్తరీయంలో దాచేసుకునేవాడు. వయస్సు మించిపోతున్నకొద్దీ సంతానంలేనిలోటు ఆ బ్రాహ్మణ దంపతుల్ని బాధిస్తూ వుండేది. సంతానంకోసం ఏం చెయ్యడానికైనా సిద్ధపడ్డారు వాళ్ళు.

ఇన్నాళ్ళకంటే కూడా ఇవాళ ఆర్యాంబ విచారంగా వుంది. ఇవాళ పొరుగింటి సోమదేవుని కుమారుడు హరిదేవుడు గురుకులం వెళుతున్నాడు. నేటిదాకా అతడు ఆమెదగ్గరకు వస్తూండేవాడు. ఆమె అతడితో కాల క్షేపం చేస్తూ మనస్సు కుదుటబెట్టుకునేది. కొద్దిసేపు అయితేనేమిగాక రవంత మాతృత్వ మనుభవించేది తన్ను తాను మరచిపోయేది. హరి దేవు డప్పుడే గురుకులం వెళ్ళకపోతే బాగుండేదని భావించిందామె. అందు చేత తుదకామె సోమదేవునితో అంది-"అన్నా, హరి ఇంకా పిల్లవాడుకదా! మరో సంవత్సరమో, ఆరు మాసములో ఆడుకోనివ్వండి. తరువాత గురు కులం పంపుదురుగాని." "ఆప్తులకు కుర్రవాళ్ళెప్పుడు చిన్నవాళ్ళుగా అవుపిస్తారమ్మా!" అన్నాడు సోమదేవుడు. "ఈ రోజుల్లో ఎంత చిన్న వయస్సులో వీలయితే అంత చిన్న వయస్సులో కుర్రాళ్ళను గురువు దగ్గరకు పంపివేయుట మంచిది. ఎక్కడ చూచినా నాస్తికవాదులయిన బౌద్ధుల ప్రభావం మించిపోతూవుంది. వామపంథీయుల రాజరికం హెచ్చి పోతూవుంది. చిన్నవయసులోనే వైదిక ధర్మ సంస్కారం జరుగక పోతే చెడ్డదారిన పడిపోతాడని భయంగా వుంది. ఈ వేద విరోధులు ఎప్పుడు నాశనమవుతారో తెలియదు!"

సోమదేవుడు పెద్ద నిట్టూర్పు విడిచి వెళ్ళాడు. హరిదేవుడు ఆర్యాంబ పాదాలు తాకి నమస్కరించాడు. ఆర్యాంబ ఆశీర్వదించింది. కాని ఆమె మనస్సు మనస్సులో లేదు. చిన్నపోయింది. రెండు కన్నీటి చుక్కలు కిందరాలిపడ్డాయి. కొడుకులేనిలోపం బాధించింది. హృదయ భారంతోనూ, గద్గద కంఠంతోను భగవంతుణ్ణి ప్రార్థించిందామె. ఒక్క కుమారుణ్ణి

కోరుకుంది. తనకోసంకాదు తన ధర్మంకోసం; తన దేశంకోసం కోరుకుంది. శంకర భగవానుణ్ణి ఆరాధించడానికి నిశ్చయించుకుందామె. ధర్మవిచారంతో కూడిన తన కోరిక భగవంతుడు తప్పక పూర్తిచేస్తాడని ఆమెకు నమ్మకం కుదిరింది.

ఈ కఠిన తపశ్చర్యలో శివగురువుకూడా ఆమెతో చేతులుకలిపాడు. వాళ్ళ ఆరాధన నిరంతరమూ సాగుతూ వచ్చింది. అలా తమ్ము తాము మరచిపోయినారు. రాత్రిళ్ళు భగవద్భజన చేస్తూనే వుండేవాళ్ళు. నిద్రాదేవి ఎప్పుడు వొడిలోకి లాక్కునేదో తెలిసేదికాదు. అలాగే బుద్ధభగవానుడు ఇల్లు వదలివెళ్ళినట్లు, తిరిగి మెల్లిమెల్లిగా ఎప్పుడు వొదిలేసి పోయేదో తెలిసేదికాదు. ప్రాతఃకాలం ఉషాదేవితో కలిసి సూర్య భగవానుడు జగత్తును మేలుకొలుపుతూ తన కిరణహస్తాలతో వాళ్ళతలుపులు తట్టేవాడు. అయితే, అంతకిముందే ఆ దంపతులు తపస్సులో నిమగ్నులై వుండేవాళ్ళు. ఉషాదేవి సూర్యభగవానుణ్ణి వొదిలేసి ఈ దంపతులకు సేవ చెయ్యడమే తన భాగ్యమని భావించేది. వాళ్ళ మొహాలు తేజస్సుతో తళతళ మెరిసేవి. మధ్యాహ్నం సూర్యుడు వాళ్ళతో తపస్సుకని పందెం వేసేవాడు. కాని, శివగురువు ఆర్యాంబల తపస్సుముందు తన తపస్సు వెలవెల పోయేది. పీగిపోయేవాడు. సిగ్గుపడి పోయేవాడు. ఎర్రగా కందిపోయిన మొహంతో ఆకాశం చాటుకి పారిపోయేవాడు. రాత్రిళ్ళు చంద్రోదయమయ్యేది. చంద్రమౌళి అయిన ఈశ్వరుడే నల్లటి పులితోలు కప్పుకుని తన భక్తుల్ని రక్షించడానికి వచ్చినట్టుండేది. రాత్రంతా భగవతి పార్వతీదేవితో కలిసి తన భక్తుల్ని రక్షించేవా డాయన. వాళ్ళ తపశ్చర్యచూసి పార్వతి కన్నీళ్ళు కార్చేది. భగవంతుడైన శివుడు అట్టహాసం చేసేవాడు. ఉమాదేవి కన్నీళ్ళు మంచుబిందువులయి రాలిపడేవి. భగవంతుడి అట్టహాసం పూర్వాకాశం మీద అందంగా అలుముకునేది. ఇలా ఎన్నో దినములు గడిచాయి. చంద్రమౌళి అయిన భగవంతుడి చంద్రకళలు తగ్గిపోతూ వచ్చాయి. 'కళలు లేని కళా

నాథుడు (చంద్రుడు)'—ఈ భావనే తనని కలిచివేసింది. ఆ బ్రాహ్మణ దంపతుల తపస్సు ముందు ఆయన లొంగిపోక తీరింది కాదు.

తన కోరిక నెరవేరిందని హటాత్తుగా శివగురువుకి తట్టింది. 'మరి తపస్సు చెయ్యనక్కరలేదు. రత్నంలాంటి కుమారుడు కలుగుతాడు' అంటూ ఆర్యాంబ అంతరాత్మ గొంతెత్తి చాటింది. అంతరాత్మ కంఠమే పరమాత్ముడి వాక్యం. ఈ సంగతి ఆమెకు బాగా తెలుసు. భగవంతుని ఇంగితం ప్రకారం నడుచుకోవడమే తనకి క్షేమమని భావించిందామె.

శివగురువు, ఆర్యాంబ ఇంటికి వచ్చేశారు. వారి జీవన మిప్పుడు నీరసంగా లేదు. పనిపాటూలేని తిరుగుబోతు జీవనం కాదు.హిందూధర్మం గొప్పతనం బాగా తెలిసినవాడు శివగురువు. తన కుమారుడు పుట్టక ముందు జరిగించవలసిన సంస్కారాలు యావత్తూ యథావిధిగా నెరవేర్చా డాయన. మనిషి జీవనానికి సంస్కారాలే అలంబనాలని ఆయనకు తెలుసు. తన జీవన వాంఛలన్నీ పూర్తి కావచ్చాయి. కనుక అశ్రద్ధ ఎలా చెయ్యగల డాయన? అదీకాక దేశంకోసం, సంఘంకోసం సర్వజ్ఞు డయిన కుమారుడు కావాలని కోరుకున్నాడు తాను. కుమారుణ్ణి సర్వజ్ఞుడుగా చెయ్యడంలో లోపం రానిస్తాడా మరి!

నవమాసాలు నిండాయి. ఆర్యాంబ జీవిత వాంఛ పూర్తయింది. దేశం తాలూకు యుగయుగాల కోర్కె సిద్ధించింది. వైశాఖ శుక్ల పంచమి నాడు ఆర్యాంబ గర్భంలో రత్నంలాంటి కుమారుడు ఉదయించాడు. శంకర భగవానుని వరప్రసాదమని భావించి కుమారునకు శంకరుడని నామకరణం చేశాడు శివగురువు. శంకర భగవానుని కోసం తపస్సు చేసి ఒకనాడు భగీరథుడు భారత భూమికి గంగమ్మ తల్లిని తీసుకువచ్చాడు. తన పూర్వుల్ని ఉద్ధరించాడు. ఈవేళ కూడా భరతదేశం సుఖ సంపదలకి ఆలవాలంగా వుంది. అదిగో' అలాగే శివగురువు తన తపశ్చర్యవల్ల ఉదయించిన గంగతో హిందూధర్మం ఉద్ధరించాడు. మన సంస్కృతీ, సభ్యత, జాతీయత సర్వ సంపన్నం చేశాడు.

శిశువయిన శంకరుడి లాలనపాలనలో మునిగి ఆర్యాంబ తన్నుతాను మరచిపోయింది. ప్రాతఃకాలంనుంచి సాయంకాలందాకా రోజంతా అతణ్ణి చూసుకుంటూనే వుండేదామె. ఎప్పుడు ప్రొద్దుపోయేదో, ఎప్పుడు రాత్రయ్యేదో కూడా తెలిసేది కాదామెకి. ఇలా చూస్తుండగానే ఏడాది గడిచిపోయింది. తల్లిదండ్రులకు నిన్నగాక మొన్ననే శంకరుడు పుట్టాడనిపించేది.

శంకరుణ్ణి చూసి ఇరుగు పొరుగువాళ్ళూ బంధువులు, స్నేహితులు ఎంతో ముచ్చట పడేవాళ్ళు. సాధారణంగా పిల్లలంటే అందరికీ ప్రేమగానే వుంటుంది. కాని, శంకరుణ్ణి చూస్తే మాత్రం ఎల్లప్పుడు గుండెలకద్దుకుందామనే అనిపించేది. ప్రతివాళ్ళ మనస్సు అతణ్ణి ఆడించాలనే వుండేది. శంకరుణ్ణి జనం ప్రేమగా చూసేవాళ్ళు. చప్పున వచ్చి ఎత్తుకునేవాళ్ళు. ఆర్యాంబ హృదయం సంతోషంతో ఉప్పొంగిపోయేది. తనకంటే భాగ్యవంతులు లోకంలో లేరని భావించేది.

ఏడాది నిండింది. శంకరుడి జన్మదినోత్సవం జరిగింది. అంతటా ఆనందమే ఆనందం. యావన్మందీ తమ శుభాకాంక్ష లందించారు. వృద్ధజనం చిరంజీవి కావాలని ఆశీర్వదించారు. నిజానికి శంకరు డిప్పుడు

చిరంజీవే. భౌతికంగా ఎవ్వడూ లోకంలో చిరంజీవి కాడు. ఎవడి కీర్తి జగత్తులో నిలిచి వుంటుందో అతడే చిరంజీవి. ప్రపంచంలో హిందూ జాతి బ్రతికి వున్నంతకాలమూ శంకరుడి పేరు జీవించి వుంటుంది. పైగా సమన్వయమనే సంజీవిని తాగించి శంకరుడు హిందూ జాతిని చిరంజీవి చేసి వొదిలిపెట్టాడు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. బాలుడైన శంకరుణ్ణి చూసీ చూడడంతోనే అతడు ముందు ఒక మహాపురుషు డవుతాడని భావించేవాళ్ళు లోకులు.

శంకరుడి ప్రతిభ మెల్లిమెల్లిగా వెల్లడి కావడం మొదలయింది. అతడి బుద్ధి విశేషం ఆర్యాంబ వినేది. ఒక పక్క ఆమె హృదయం సంతోషంతో ఉప్పొంగేది. ఒకపక్క ఎన్నో చెడ్డ ఆలోచనలున్నూ అల్లుకునేవి. చిన్నతనంలోనే బుద్ధి వైభవం ప్రకటించే వ్యక్తి అల్పాయువు కలవాడవుతారంటారు లోకులు. ఇది తలచుకుని ఆమె ఒక్కసారి వణికి పోయేది తన శంకరుడు చిరంజీవి కావాలనీ ఎన్నో అన్ని మొక్కులు మొక్కేది.

శంకరుని అసాధారణమైన బుద్ధి చూశాడు శివగురువు. మూడేళ్ళకే అతడికి అక్షరాభ్యాసం చేశాడు. శంకరుడు ఓనమాలు ప్రారంభించాడు. ఒక్కసారి చెబితేచాలు అతడికి వచ్చేసేది పాఠం. అదిచూసి ఆశ్చర్య పోయేవాడు శివగురువు. శంకరుడు ఏకసంథాగ్రాహి. ఒకసారి వింటేచాలు అతడు తిరిగి అప్పజెప్పేసేవాడు. అయిదేళ్ళు వచ్చేసరికి లౌకిక విద్యలు యావత్తూ పూర్తిచేశాడు. వేదం చదవటానికి తయారయిపోయాడు. అద్వితీయమైన అతడి యోగ్యత చూసి గురువుకి బ్రహ్మానందంగా వుండేది. లోకులు శంకరుడి చదువు మెచ్చుకొనేవాళ్ళు. వాళ్ళు తననీ మెచ్చుకున్నట్టే భావించేవాడు గురువు. సంతోషం పట్టలేకపోయేవాడు. తాను శంకరుడికి ఎలా వ్యాకరణం బోధించిందీ, ఛందశ్శాస్త్ర మెలా

చదివిందీ చెప్పడం శంకరుడు రెండేళ్ళలోన ఎలా అన్నీ నేర్చుకున్నాడో వర్ణించేవాడు. అతడి గురువు కాగలిగినందుకు ధన్యత ఆపాదించుకునే వాడు. నిజమే, యోగ్యత కలవాడు తన కీర్తి మాత్రమే కాదు. తనతో సంబంధం కలవాళ్ళ యావన్మంది కీర్తి విస్తరింపజేస్తాడు. అందుకనే అందరూ అతడితో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం పెట్టుకోవాలని చూస్తారు. ఎంత మంది శిష్యుల్నో చదివించా డతడు. కాని శంకరుణ్ణి తప్ప మరెవరినీ చదివించినట్లు వాళ్ళెవళ్ళ పేరు ఎత్తనే ఎత్తడు.

శంకరుడి విద్యాబుద్ధులే కాదు, అతడి స్వభావమున్నూ ఎంతో మధురమైంది. ఎవరైనా ఒక్కసారి అతణ్ణి కలుసుకుంటే చాలు, వాళ్లు అతడివాళ్ళే అయిపోయేవారు. అతడి హృదయం విశాలమైంది, ఉదారమైంది. ప్రతివాళ్ళకీ అందులో స్థానముండేది. అతడి నడవడి ప్రేమ పూర్వకంగా వుండేది. అంచేత చుట్టుపట్ల ప్రజల శ్రద్ధా, విశ్వాసమూ సంపాదించా డతడు. తాను తన ఉద్యమంలో సఫలత పొందాడంటే- ఇదే దానిలోని రహస్యం. విద్యాబుద్ధులవల్ల మనిషి విశేషత్వం ప్రకట మవుతుంది. అతడి విషయంలో ప్రజలకి కుతూహలమున్నూ కలుగుతుంది. కాని అతడిమీద భక్తి, మమతా మాత్రం కలగదు. అది బుద్ధుల వల్ల జరుగదు, హృదయంవల్ల జరుగుతుంది. అదృష్టవశాత్తూ శంకరుడికి బుద్ధీ, హృదయమూ రెంతూ వున్నాయి. రెండింటిలోనూ అతడు అగ్రగణ్యుడే అయ్యాడు. అందుకనే కాలడీ నగరంలోనూ, దాని చుట్టుపట్లా చిన్నా పెద్దా యావన్మందీ అతణ్ణి ప్రేమించేవాళ్ళు ఈ ప్రేమచేతనే అతణ్ణి గురించి అందరూ అనుకునేవాళ్ళు. ఈ లోపున అతనికి స్నేహితులున్నూ ఏర్పడ్డారు. అలా ఏర్పడ్డ స్నేహితులు బ్రతికివున్నంత కాలమూ అతణ్ణి ఒదిలిపెట్టలేదు. వాళ్ళలో చిత్సుఖుడు సుప్రసిద్ధుడు.

అయిదోయేట శంకరుడికి ఉపనయనం జరిగింది. దాంతో అతడు వేదాధ్యయనం కోసం గురుకులం వెళ్ళాడు. ఆర్యాంబ కళ్ళముందు ఆరేళ్ళ క్రిందటి దృశ్యం మెదిలింది; ఇవాళ మళ్ళీ ఆమె భగవంతుణ్ణి ప్రార్థించింది: 'శంకరుడు వేదాలు చదివి వైదిక ధర్మం పునరుద్ధరించడానికి సమర్థుడు కావాలి.' శంకరుడు గురుకులం వెళ్ళిపోవడంవల్ల ఇల్లు వుత్తిదయిపోయినట్టుండేది. అయినా ఆర్యాంబకు విచారం కలగలేదు. ఇల్లంతా చిన్నబోయినట్లుండేది కాని ఆమెకు తెలుసు, తన కుమారుడు జ్ఞానార్జన కోసం గురుకులం వెళ్ళాడు. తన కుమారుడి దివ్యమైన భవిష్యత్తు తలుచుకుంటేనే ఆర్యాంబ, శివగురువుల కాలం గడిచిపోయేది.

ఎంత వేగంగా శంకరుడు లౌకిక విద్యలు నేర్చుకున్నాడో, అంత శీఘ్రంగా తాను వేదాలు, వేదాంగాలు కూడా అధ్యయనం చేశాడు. ఇప్పుడతడు చదవటమే కాదు, తనతోటి విద్యార్థుల్ని కూడా చదివించేవాడు. ఈ సమయంలోనే అతడు బాలబోధ సంగ్రహమని వొక గ్రంథం కూడా వ్రాశాడు. అంత చిన్నతనంలోనే అతడిలో ఎంత బుద్ధి విశేషం వుండేదో ఇవాళ కూడా ఈ బాలబోధ సంగ్రహం లోకం ముందు సాక్ష్యమిస్తుంది. అందులోని విషయం ఎంతో సరళమైన భాషలో వుంది. బాలబోధ నిజంగా బాలబోధే!

ఉగ్గు పాలతోనే సమస్త విద్యలూ నేర్చినట్టు వేదమంత్రాల అర్థాలు వాటంతట అవే శంకరుడికి స్ఫురించేవి. అతడు తరువాత చెప్పాడు: జ్ఞానం యావత్తూ ముందే తన మస్తిష్కంలో దాచిపెట్టి ఉండేది. ఆ జ్ఞానమనే ఆవరణ దానంతట అదే దూరమయి పోయేది. అంత చిన్న వయస్సులోనే, తన విద్యార్థి దశలోనే శంకరుడు నాలుగు దిక్కులా అవుపిస్తూ వున్న అనేకత్వంలో వాస్తవమయిన ఏకత్వం చూడగలిగాడు. ఈ భేదం పైపైదే అనీ, అసత్యమైనదనీ తెలుసుకున్నాడు. నిజంగా

మనమందరమూ ఒక్కటే అనీ, అదే సత్యమనీ - ఈ సత్యమే వేదాలు గొంతెత్తి చాటుతున్నాయనీ గ్రహించాడు తానీ సత్యం తెలుసుకున్నాడు. గురుకులానికి వచ్చిన ఎంతో మంది నాస్తిక వాదులయిన బౌద్ధులూ మొదలయిన వాళ్ళతో ఈ సత్యమే ఆధారం చేసుకుని శాస్త్ర చర్చలున్నూ సాగించాడు. శాస్త్ర చర్చల్లో సాటిలేని సామర్థ్యం చూపెట్టేవాడతడు. ప్రతిపక్షుల్ని తన దిక్కు తిప్పుకునేవాడు. "శంకరుడు తప్పకుండా భారత దేశంలో వైదిక ధర్మాల ప్రచారం చేస్తాడు. ప్రతిచోట శాస్త్ర చర్చల్లో నెగ్గుకు వస్తాడు" అని అతణ్ణి చూసి గురువు లనుకొనేవారు.

గురుకులాల శిక్షాపద్ధతి ఇప్పటిలా వుండేది కాదు. దేశం స్వతంత్ర మైనప్పుడు విద్య దాని నిజమైన ఉద్దేశాల ప్రకారం విద్యార్థులలో సుప్తమై వున్న శక్తులు వికసింపజేసి సంఘంలో చైతన్యం గల పౌరులుగా తయారు చేస్తుంది. ఆ విద్యలో సంఘంనించి దూరంగా వుండమంటూ వుండదు. సంఘానికి మనమెంత ఋణపడి వున్నామో హెచ్చరిస్తుందది. దాని కోసం మన కర్తవ్యమేమిటో క్షణక్షణమూ తెలుపుతూనే వుంటుంది. మనలో వొక పద్ధతి ఉండేది. గురుకులంలో వుండే ప్రతి విద్యార్థీ-అతడు రాచబిడ్డడైనా సరే - లేదా పేద కుర్రాడైనా సరే, ఊళ్ళోకి వెళ్ళి బిక్ష మడిగి తెచ్చేవారు. ఈ పద్ధతివల్ల బ్రహ్మచారికి వూళ్ళోవాళ్ళ మీద ఎంతో ఆదరభావమూ, వినయమూ, శ్రద్ధా, తన వాళ్ళనే అభిప్రాయమూ-ఇవన్నీ ఏర్పడేవి. బ్రహ్మచారి "భిక్షాం దేహి" అన్న కేక వినగానే ఇంటామె బిక్షం పట్టుకుని పరుగెత్తుకు వచ్చినప్పుడు అతడి శిరస్సు కృతజ్ఞతతో వంగిపోయేది. తన జీవన విషయం విచారించేవాళ్ళని సుఖపెట్టాలని అతడు బతికి వున్నంత కాలమూ ప్రయత్నించేవాడు. సంఘం వేరూ, తను వేరూ అన్న భావం అతడి మనస్సులో పుట్టనే పుట్టేది కాదు. బానిస దేశం విద్యార్థులవలె సమాజంతో సంబంధం లేని విద్యార్థులానాడు లేరు. సంఘ

సుంటే శ్రద్ధ లేనివాళ్ళూ, పరాయి భావాలతో తొణికిసలాడుతున్నవాళ్ళూ, పరాయి భావాలతో, మానసిక బానిసత్వంతో మగ్గుతున్న వాళ్ళూ ఆనాటి విద్యార్థుల్లో మచ్చుకయినా వుండేవాళ్ళు కాదు. తమ మెదడు విదేశీయుల దగ్గర తాకట్టు పెట్టడంచేత భావనాశక్తి దివాలా తీసినవాళ్ళూ, స్వార్థం వల్లా, ఆదర్శమంటూ లేకపోవడం వల్లా హృదయం నీరసించిన వాళ్ళూ ఆనాటి విద్యార్థుల్లో లేరు. భావనా శక్తి మోడువారినవాళ్ళూ, బద్ధకం బలిసిపోయిన వాళ్ళూ, పురుషార్థమూ, కార్యశక్తి నశించిన వాళ్ళూ, విచార శూన్యులూ, కర్మరహితులూ ఆనాటి విద్యార్థుల్లో కలికానికయినా కనపడేవారు కారు.

గురుకులంలో వుంటూనే, అంత చిన్నప్రాయంలో శంకరుడు తన చుట్టుపట్ల జనంమీద ఎంతశ్రద్ధ చూపేవాడో వొక చిన్న సంఘటన వల్ల వ్యక్తమవుతుంది: శంకరుడు భిక్షమడుగుతూ ఒకనాడు వొక పేద బ్రాహ్మణుడి గుమ్మానికి వెళ్ళాడు. ''భిక్షాం దేహి'' అంటూ కేకవేశాడు. ఇంట్లో ఇంటామె మాత్రముంది పెద్దచిక్కే వచ్చిపడిందామెకి. బ్రహ్మచారికేమిటి భిక్షం పెట్టడం? ఇంట్లో ఏమీలేదు. బ్రహ్మచారిని వూరికే పంపెయ్యడం మహాపాపం! చివరికామె చూసింది - ఇంట్లో వదిపన్నెండు ఉసిరికాయలు మాత్రం పడివున్నాయి. అందులో ఒకటి శంకరుడి భిక్షం కోసం పట్టుకువచ్చిందామె. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. తన విచారం కనపడకుండా దాచుకోవాలని ఎంతో ప్రయత్నించిందామె. కాని శంకరుడు కనిపెట్టేశాడు. ఆమె హృదయంలో ఏదో దుఃఖంతో కుములు తోంచి. తన స్వార్థం వదులుకున్నవాడికి హృదయంలో నిజమైన సహానుభూతీ సంవేదనా కలవాడికి, తన ఆత్మా ఇతరుల ఆత్మా అన్న భేదమే లేనివాడికి - ఆ పేదరాలి వేదన తెలియకుండా ఎలా వుంటుంది? శంకరుడి హృదయమున్నూ ఇల్లాలి హృదయంతోపాటు దుఃఖపడింది. ఆతడడిగాడు - ''అమ్మా! దుఃఖిస్తున్నావెందుకూ?''

"ఏమీలేదు నాయనా, దుఃఖమెందుకూ? ఇవాళ భిక్షకోసం ఉసిరి కాయ మాత్రమేవుంది'' అందామె ఆమె కన్నీళ్ళు ప్రవహించాయి. తన్ను తాను ఆపుకోలేకపోయింది.

''ఏం తల్లీ, తనవాళ్ళ దగ్గిరకూడా దుఃఖం మరుగుపరచవచ్చా?'' అన్నాడు శంకరుడు. ఎంతో ఆదరణా, ఎంతో స్నేహమూ, ఎంతో శ్రద్ధా చూపిస్తూ తన కన్నతల్లిలా చూశాడామెని. చివరికామె చెప్పింది - 'బ్రాహ్మణుడు (ఇంటాయన) అల్పసంతోషి. ఒక రోజుకి సరిపోయిన భోజన సామగ్రి మాత్రం గడిస్తాడు. అంతకుమించి ఇంట్లో ఉంచుకోవడం దొంగతనమంటాడు. అంచేత భిక్షం పెట్టడానికి ఇంట్లో ఉసిరికాయ తప్పించి మరేమిలేకపోయింది. అందుకని తాను దుఃఖించింది." బ్రాహ్మణ కుటుంబ దారిద్ర్యం శంకరుడికెంతో విచారం కలిగించింది. ఆమె దుఃఖం తొలగించకుండా ఊరికే సానుభూతి చూపించడంవల్లా, ఓదార్చడంవల్లా లాభం లేదని భావించాడతడు. పనిచేసే శక్తిలేకుండా ఉత్తి సానుభూతి ప్రకటించడమంటే, అది మానసిక దౌర్బల్యం మాత్రమే అవుతుంది. లేదా శక్తివుండిన్నీ పని చెయ్యకపోతే అది శక్తి ప్రసాదించిన భగవంతుడి మీద కృతఘ్నత చూపడన్న మాట.

ఆ బ్రాహ్మణ కుటుంబం దారిద్ర్యం తొలగించాలని నిశ్చయించు కున్నాడు శంకరుడు. అయితే, అతడేమో బ్రహ్మచారి. భిక్షమెత్తుకు జీవి స్తున్నాడు. కాని అతడికి తెలుసు, తన మనస్సు మాత్రం బికారికాదు. దానికి పేదరికం లేదు. తన కర్తృత్వం మీద తనకి నమ్మకముంది. దాంతో అతడు అక్కడినించి కదిలాడు. పక్కయింటికి వెళ్ళాడు. అదొక ధన వంతుడి ఇల్లు. శంకరుడు సాధారణంగా ధనవంతుల గుమ్మానికి వెళ్ళేవాడు కాదు. శంకరుడు తనవాకిట నుంచోవడం చూశాడు ధనవంతుడు. "ఎంత

ఫ్యమో ఇవాళ, ఒక బ్రహ్మచారి అందులోనూ బుద్ధిమంతుడూ, మృదుభాషి అయిన శంకరుడు నా గుమ్మానికి భిక్షం కోసం వచ్చాడు" అంటూ భావించాడతడు. ఆ దినాల్లో ఇప్పటిలాగ కాదు. యోగ్యపాత్రుడు తన ఇంటికి ఎప్పుడు వస్తాడా అని వెయ్యికళ్ళతో కనిపెట్టుకు కూచునేవాళ్ళు ధనవంతులు. శంకరుడు "భిక్షాం దేహి" అని అనకుండానే ధనవంతుడు భిక్షం పట్టుకుని హాజరయ్యాడు. శంకరుడు భిక్షంకోసం చేతులుచాచడానికి బదులు వెనక్కిలాక్కున్నాడు. చిరునవ్వు నవ్వుతూ మృదువుగా అన్నాడతడు: "తమ సమాజంలోని వ్యక్తులను ఆప్తులుగా తమ సొంతమని ఎవరు భావించరో, తమవాళ్ళ మీద ఎవరి హృదయంలో ప్రేమా, మమత్వము లేదో అలాంటివాళ్ళ అన్నం తించే ధర్మభావం కలుగుతుందా?"

ధనవంతుడయిన ఆ షాహుకారికి శంకరుడి మాటలు అర్థంకాలేదు. ధనమెంత అధికంగా ఉందో, తన బుద్ధిచుట్టూ వున్న ఆవరణ కూడా అంత అధికంగానే వుందతడికి. అతడి శరీరమొక్కటే కాదు, బుద్ధికూడా స్థూలమైంది.

"నేను సంఘంలో ఒక సామాన్యమైన సేవకుణ్ణే అనుకుంటున్నాను" అన్నాడు షావుకారు.

"పొరుగునే ఇంత నిరుపేద కుటుంబముంది. స్వయంగా వైభవ సౌఖ్యాల్లో ఓలలాడుతూ సంఘసేవకుణ్ణని చెప్పడం, ధర్మం రక్షించాలనడం - ఏమిటీ ఎగతాళి?" కొంచెం విచారిస్తూ అన్నాడు శంకరుడు.

ఆ ధనికుడు గుండెలు దూసుకుపోయినట్టయింది. తనస్థితి తనకి తెలిసివచ్చింది. నిద్రనించి మేలుకున్నట్టయింది. శంకరుణ్ణి క్షమాపణ కోరుకున్నాడతడు. బంగారం ఉసిరికాయలతో ఆ పేద బ్రాహ్మడి ఇల్లు

నింపేశాడు "ముందుముందుకూడా ధనమొక సాధనం మాత్రమని భావిస్తాను. ఉపయోగకరమైన కార్యాల్లో దానిని వినియోగిస్తాను. సంఘానికీ, ధర్మానికీ సేవ చేస్తాను" అంటూ నిశ్చయించుకున్నాడతడు. నిజమైన సానుభూతితోనూ, ఆవేదనతోనూ వెలువడ్డ వాక్యాలకు అంత ప్రభావముంటుంది.

ఎనిమిదేళ్ళ ప్రాయంవరకూ శంకరుడు గురుకులంలో వున్నాడు. వేదశాస్త్రాలన్నింటిలోనూ పారంగతుడయ్యాడు. అంచేత అతడికి ఆచార్యుడని బిరుదిచ్చారు. శివగురువు పెట్టిన శంకరుడన్న పేరు శంకరాచార్యులయ్యింది. కాని ఈ ఆనందం అనుభవించే భాగ్యం శివగురువుకి లేకపోయింది. "తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు."

# 3

శంకరుడు గురుకులం నించి రాకముందే శివగురువు ఈ లోకాన్ని విడిచిపెట్టాడు. తండ్రి అంటే ఎంతో ప్రేమ శంకరునికి. తండ్రి కాలం చెయ్యడం విని ఎంతో బాధపడ్డాడు. కాని వెంటనే "భగవంతుడు మెల్లిమెల్లిగా వొక్కొక్క బంధనం తెంచేస్తున్నాడు" అని అనుకున్నాడు. ఇంటి ఆవరణలోంచి బైటపడి. దేశం యావత్తూ తన ఇల్లే అని భావించి పాటుపడాలనుకునే వాడాయన. తండ్రి మరణంతో ఆ నిశ్చయం మరింత బలపడింది. తండ్రి శవ సంస్కారం జరుగుతున్నప్పుడు, ఈ శరీరం నిత్యం కాదన్న విషయ మాలోచిస్తుండే వాడాయన. "మనిషి వొకనాడు మరణించటం తప్పనప్పుడు పురుగుల్లాగా స్వార్థమయిన నీచబ్రతుకు బ్రతికి చావడమెందుకు? ఈ బ్రతుకు చిన్న చిన్న సుఖాలూ- ఇవే సర్వస్వమూ, నిజమూ అనుకుని మనిషి వెనుకపడిపోతాడు. తుదకు ఈ నశ్వరమైన శరీరం వదిలిపెట్టవలసి వచ్చినప్పుడు దుఃఖపడతాడు. ఇంతకంటే ఒక ఉత్తమమైన లక్ష్యం పెట్టుకొని, యావజ్జీవనం సత్యం మీదే నడుచుకు పోవడం మంచిది. ఆ లక్ష్యం కోసం అవసరమైతే పాము కుబుసము విడిచినట్టు- శాంతచిత్తంతో, సంతోషంతో ఈ శరీరం విడిచి పెట్టడానికి

సిద్ధంగా ఉండాలి. పాము తన రక్షణకోసం కుబుసం ధరిస్తుంది. తిరిగి అందుకోసమే విడిచిపెట్టేస్తుంది. దానికోసమది దుఃఖపడదు. ఏమంటే, కుబుసముమీద దానికి ప్రేమ ఉండదు" అని భావించేవాడాయన.

శంకరుని విచారం శ్మశాన వైరాగ్యం కాదు. ఈ పునాదిమీదే తన భవిష్యజ్జీవనభవనం నిర్మించడానికి నిశ్చయించుకున్నాడాయన.

తల్లిమీద ప్రేమవల్లా, తండ్రి సంవత్సరికం కోసమూ శంకరుడు వొక సంవత్సరం ఇంటిపట్టునే వున్నాడు. తనకు అనుకూలంగా తల్లి భావాలు మార్చడానికి ఈ ఏడాదిపాటూ శాయశక్తులా ప్రయత్నించా డాయన. ఆర్యాంబ సహజంగానే విదుషీమణి. తన దేశమన్నా, తన ధర్మమన్నా అమితమైన ప్రేమ ఆమెకి. శంకరుడు వైదికధర్మం ఉద్ధరించాలని ఆమె అభిలాష. అయితే తన ముద్దుపట్టి ఇల్లూ వాకిలి వొదిలేసి, బైటికిపోయి పనిచేయడమంటే మాత్రం నచ్చలేదామెకి. శంకరుడు వివాహం చేసుకోవాలనే ఆమె కోరిక. అతడు గృహస్థుడుగా వుండి చేతనయినంతవరకూ వైదిక ధర్మాభివృద్ధికి పాటుపడాలని ఆమె ఉద్దేశం. ఇలా ఆమె భావించడంలో ఆమె దోషమున్నా లేదు. తల్లి తండ్రులకి కుమాళ్ళ మీద ప్రేమ సహజమే కదా! ఆర్యాంబ మాత్రం దానికి వ్యతిరేకంగా ఎలా వుంటుంది? అదీకాక, ఆ కాలంలో హిందువులు సన్యసించి దేశకార్యం చేసే పురాత నాదర్శం మరచిపోవడమే కాదు, అది చెడ్డపని అని కూడా బావించేవారు. ఏమంటే, బౌద్ధులు తమ ధర్మంలో సన్యాసానికి ప్రాముఖ్యం యిచ్చారు. అంచేత సాధారణంగా, ప్రచారంలో లేని సన్యాస ధర్మం శంకరు డవలంబిస్తానంటే ఆర్యాంబ ఇష్టపడలేదు.

శంకరుని ఈ ప్రవృత్తిచూసి తల్లి ఆర్యాంబ, తక్కిన బంధువులూ విచారం పెట్టుకున్నారు. ఆర్యాంబ సోదరుడు జయదేవు దొకనాడు వాళ్ళ యింటికి వచ్చాడు. శంకరుడు ఇంటిదగ్గిర లేకపోవడం చూసి అతడడిగాడు_ "చెల్లీ, శంకరుడేడి?''

"ఎక్కడున్నాడో ఏం చెప్పమన్నావు?'' పెద్ద నిట్టూర్పు విడుస్తూ అంది ఆర్యాంబ - "వాడు ఇంటిపట్టున ఎప్పుడున్నాడు గనక ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో, ఏమో!''

అది విని జయదేవు డన్నాడు: "ఇటూ అటూ తిరగడం మంచిది కాదమ్మా చెల్లీ! ఈ దినాల్లో నాస్తిక వాదులైన బౌద్ధులూ, వామ పంథీయులూ ఎక్కడబడితే అక్కడ తిరుగుతున్నారు. ఎవరి వలలో అయినా పడిపోయాడో, కొంప ములుగుతుంది. వేదవేదాంగాల్లో శంకరుడు పారంగతుడయ్యాడని వింటున్నామే?"

"ఆఁ - అదేమో జరిగింది. వేదశాస్త్రాల్లో వాడు ఆచార్యుడే అయిపోయాడు. కాని వాడు ఆచార్యుడయితే మాత్రం నాకేమి లాభం? వాడు ఇంట్లో ఉండడానికే ఇష్టపడకుండా ఉన్నాడు. దేశంలో మతాలూ, మతాంతరాలూ ప్రబలి పోయాయంటాడు. ప్రజలు నిజమైన వైదికధర్మం మరచి పోయారనీ, ఒకప్రక్క సత్య ధర్మం ఆశ్రయించక పోవడంవల్ల పరస్పరం కుమ్ములాడుకుంటూ సంఘం దుర్బలమై పోయిందంటాడు. అంచేత ఇల్లు వదిలిపెట్టేసి నిజమయిన హిందూ ధర్మం ప్రచారం చేస్తాడట! మరి నేను ఏంచేసేది?"

జయదేవుడు కొంచెంసేపు ఆలోచించాడు. "అరే, ఇంకా వాడు కుర్రవాడు. అంచేత దేశమూ. ధర్మమూ అంటూ కబుర్లు చెబుతున్నాడు.

వాడికి పెళ్ళి చెయ్యి ఇల్లూ, ఇల్లాలు- ఈ బెడదలో పడిపోతే అన్నీ వాడే మరచిపోతాడు."

ఆర్యాంబ కూడా అదే నిశ్చయించుకున్నది. వీలయినంత త్వరగా శంకరుడికి పెళ్ళి చెయ్యాలి. అతడు సన్యాసం పుచ్చుకోకుండా చెయ్యడానికి ఇదొక్కటే మంచి ఉపాయమని తోచిందామెకి. అటు శంకరుని మనసులో సన్యాసం పుచ్చుకోవాలన్న కోరిక రోజురోజూ ఉరక లెత్తుతూ వచ్చింది. కేవలం తల్లి అనుమతి వొక్కటే తరువాయిగా వుంది.

ఒకనాడు శంకరుడు తల్లితో నదికి స్నానానికి వెళుతున్నాడు. తాను సన్యాసం పుచ్చుకుంటా నంటూ తన అభిలాష తల్లితో చెప్పాడాయన. అతడన్నాడు- "అమ్మా, నేను వైదికధర్మం ఉద్ధరించాలని నీవు ఎప్పుడూ కోరుతున్నావు గదా, నువ్వు నాకు ఈ రోజే అనుమతి ప్రసాదించు, సన్యాసం పుచ్చుకుని నేనాపని ప్రారంభిస్తాను."

ఆర్యాంబకి మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. తన్ను తాను సంబాళించుకుంటూ అంది: "బాబూ! ఇదేమిటి నాయనా? నీ ముసలి తల్లిని వొదిలేసి వెళ్ళిపోతావా తండ్రీ? పితౄణమంటూ లేనేలేదా?"

"లేకేమమ్మా, పితౄణం తీర్చడానికే నేను సన్యాసం పుచ్చుకోవా లనుకుంటున్నాను. నాన్నగారు తమ జీవన కాలమంతా నిర్వహించిన ధర్మం నష్టమైపోతే, ఆయనకి దుఃఖం కలుగుతుందా లేదా? ఆ ధర్మం రక్షిస్తేనే ఆయన ఆత్మకు శాంతి కలుగుతుంది. తండ్రినీ, తాతముత్తాతలనీ తలుచుకో; వెయ్యి సంవత్సరాల చిత్రం కళ్ళముందు కనిపిస్తుంది. కృష్ణ పరమాత్మ ఈ ధర్మం రక్షించడం కోసమే తన జీవిత కాలమంతా పాటు పడ్డాడు. కౌరవులకీ, పాండవులకీ యుద్ధం కూడా చేయించాడు. తన

జీవితంలో ఆయన ధర్మ స్థాపన చేసివెళ్ళాడు. కాని లోకులు మెల్లిమెల్లిగా మరిచిపోయారు. శాక్యముని కాలానికి తిరిగి ధర్మంలో చెడుగు ప్రవేశించింది. ఆయనకూడా ఆ చెడుగు తొలగించడానికి ప్రయత్నించాడు. కాని ఇవాళ ఆయన ఉన్నతాభిప్రాయాలు జనం మరచిపోయారు. ఊరికే నాస్తికవాదం చెయ్యడం మొదలు పెట్టారు. ఈ పూర్వుల యావన్మంది ఋణమూ మనమీద వుందంటావా లేదా?"

"ఈ విద్వత్తు విషయాలు నాకేమిటి తెలుస్తాయి నాయనా? అదంతా కాదు, వొకటి మాత్రం చెప్పు - నన్ను పిడికెడు బుగ్గి ఎవరు చేస్తారు? నీ పితరులకి పుడిసెడు నీళ్ళెవరిస్తారు?" అంది ఆర్యాంబ.

"నేను చేస్తానమ్మా; నేను చేస్తాను. నా పితరులకు కూడా నేనే నీళ్ళిస్తాను."

"మరి నీ తరువాత?"

"నా తరువాత హిందూ సంఘం యావత్తూ వుంది. అదే నీ కీర్తి చాటుతుంది. నీ సద్గుణాలు వర్ణిస్తుంది. అదే అసలయిన శ్రాద్ధం. హిందూ సంఘం నాశనమై పోయినవాడు ఎవడో ఒకడు రెండు కాళ్లూ రెండు చేతులతో నీ వంశంలో పుట్టినప్పటికి నీకిన్ని నీళ్ళు పోస్తాడా? నీ పేరన్నా తలుస్తాడా?"

తల్లి ఆర్యాంబ మాటాడలేదు. తర్కమూ, భావనా - ఈ రెండూ ఎప్పుడూ కలిసి సాగవు. మనిషి భావసమూహాల వెనక నడుస్తాడు. తాను భావాల బానిస కాడని లోకులకు చూపెట్టడం కోసం, అలాగే తన అహంకారం శాంతింపజేయడం కోసం - తన భావాలకు సరిపోయే తర్కం

వినియోగిస్తాడు. అంతే కాని, తర్కంతో పని చెయ్యడు. తర్కం గొప్పదే, అయినా దాంతో హృదయం కలిసే వరకూ అది కుంటిదే అవుతుంది. ఆర్యాంబ బుద్ధికి శంకరాచార్యుల మాటలు మన్నించతగ్గవే అనిపిస్తున్నాయి కాని, ఆమె హృదయం మాత్రం అవన్నీ వ్యర్థమైనవే అని చెపుతోంది. పుత్ర వ్యామోహం గొప్పది. శంకరాచార్యులకిదంతా తెలుసు. అంచేత ఆయన మరో ఉపాయ మాలోచించాడు.

తల్లీ కొడుకూ ఇలా మాట్లాడుకుంటూ నది దగ్గరికి వచ్చేశారు.

శంకరాచార్యులు స్నానం కోసం నదిలోకి దిగిపోయాడు. కొద్ది సేపయింది; అదేదో పెద్ద కేక వేశాడాయన. "అమ్మయ్యో, మొసలి! నా కాలు పట్టుకుంది. అమ్మా, నా పనయిపోయింది. ఇక నీకెలాగూ దక్కను. సన్యాసం పుచ్చుకుందుకి నువ్వు అనుమతిస్తే ఒకవేళ దేశం కోసమని, జాతికోసమని భగవంతుడు నన్ను బతికిస్తాడేమో? చెప్పు, అమ్మా, వేగం చెప్పు."

ఆర్యాంబ గాబరాపడుతూ నుంచుంది. ఏమనాలో ఆమెకు తోచలేదు. శంకరాచార్యులు మళ్ళీ అన్నాడు - "అమ్మా, అమ్మా, చెప్పు. ఆలోచనకి అవకాశం లేదు. వొక్క క్షణం ఆలస్యమైతే మొసలి మింగేస్తుంది. బతికున్నంత కాలమూ విచారిస్తావు."

ఆర్యాంబకి మరోదారి లేకపోయింది. కొడుకు చచ్చిపోవడంకంటే సన్యాసం పుచ్చుకొనయినా బతికివుంటే నయం. కొడుకు సన్యాసి కావడానికి అంగీకరించిదామె. ఐతే, ప్రతిజ్ఞ మాత్రం చేయించింది. ఆమె కాలం చేసిన సమయానికి ఆయన తన దగ్గరికి వచ్చెయ్యాలి. ఆమెని పిడికెడు బుగ్గి చెయ్యాలి. తల్లి కోరిన ప్రకారం ప్రతిజ్ఞ చేశాడు

శంకరుడు. మొసలి కాలు వొదిలేసింది. శంకరాచార్యులు సన్యాసం, నదిలోంచి బైటకు వచ్చారు.

ఈ కథ ఎంతవరకూ నిజమో చెప్పడం కష్టం. మొసలి పట్టు కోవడం, మింగెయ్యకుండా వూరుకోడం, సన్యాసానికి తల్లి అనుమతించ గానే వొదిలెయ్యడం - ఆశ్చర్యకరమైన విషయం. అయితే మహత్తరమైన ఒక లక్ష్యం కోసం శంకరాచార్యుల వంటి జాతినిర్మాత, దార్శనికుడు ఇలా నడిచాడంటే మాత్రం ఆశ్చర్యం లేదు. ఏమయినాసరే, పారివారిక స్నేహమనే నదిలో వ్యక్తిగతమనే మొసలి శంకరాచార్యుల్ని మింగ బోయింది. నిజమైనా, అబద్ధమైనా ఈ సంఘటనే హిందూ సమాజ చరిత్రను సంపూర్ణంగా మార్చివేసింది.

శంకరాచార్యు లిప్పుడు సన్యాసి. అతని విశాల హృదయంలో వ్యాపించిన దాహం, సమస్త దేశంతో తల్లీనమైన అతని ఆత్మాదర్శమూ, సంకీర్ణమైన కుటుంబ వర్తులంలో ఎలా శాంతిస్తుంది?

'త్యజే దేకం కులస్యార్థే, గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్.'

అను తన ప్రాచీన ఆదర్శాన్ని గుర్తించి, ఆత్మకోసమని అన్నీ వొదిలేసి, సన్యాసం పుచ్చుకున్నా డాయన. ఆయన ఆత్మ చేస్తున్న ఆక్రందన మేమిటి? అదెలా శాంతించింది? ఈ ప్రశ్నలకి ముందుముందు ఆయన కర్మమయ జీవనమే జవాబు చెబుతుంది.

శంకరాచార్యులు సన్యాసం పుచ్చుకున్నాడు. తల్లికి నమస్కరించాడు గురువుని వెదుకుతూ బయలుదేరి పోయాడు. అంతఃకరణమే ఆయన ధనం, మహత్తరమైన ఆత్మ విశ్వాసమే ఆయన శక్తి. బుద్ధి ప్రాబల్యమే మార్గదర్శి. కార్యతత్పరతా, భగవంతుని శరణ ... రెండే ఆయన బలం .... శాంతీ, తనలోని ఆత్మచైతన్యమూ ఆయనకి బ్రహ్మాండమైన ఉత్సాహం కలిగించాయి. స్వయం భగవంతుడే తన అంతరాత్మకు సాక్షాత్కరించా డనిపించిం దాయనకు అప్పుడే. భక్తి రసంతో తొణికిస

లాడే అచ్యుతాష్టకాన్ని రచించా డాయన, తర్వాత తన ఆత్మప్రేరణను విని గోవిందభగవత్పాదుల ఆశ్రమంలో యథావిధిగా సన్యాసాశ్రమాన్ని గ్రహించటానికి బయలుదేరాడు.

మార్గాయాసం లెక్కించకుండా, ఆకలి దప్పులు గణించకుండా, తన లక్ష్యం దారిని నడుస్తున్నాడా బాల సన్యాసి. ఆయన తత్పరత చూసి ముక్కుమీద వేలు వేసుకున్నారు లోకులు. ఆయన తేజస్సు చూసి సాక్షాత్తు నరనారాయణులలో ఒకరు ఇలా అవతరించారనుకున్నారు జనం. అలా ఉత్తర దిక్కు వెళ్ళి గోకర్ణ తీర్థాన్ని సేవించాడు. పట్టణ వీధుల్లోంచి నడచిపోతున్నాడు. వెనకనించి ఎవరో పిలచారు. ''శంకరా, శంకరా! ఎక్కడికి వెళుతున్నావు?'' శంకరుడు ఆగేలోగా ఆ పిలిచిన వ్యక్తే దగ్గరికి వచ్చాడు. అతడు శంకరాచార్యుల సహాధ్యాయి, కాలడీలోని విష్ణుశర్మ. విష్ణుశర్మ శంకరాచార్యుల్ని ఆపాదమస్తకం చూశాడు. "ఇదేమిటీ వేషం శంకరా?"

శంకరాచార్యులు విష్ణుశర్మని చూశాడు. చిరునవ్వు నవ్వాడు.

"ఇక్కడ తిరుగుతున్నావేమిటి తమ్ముడూ?" విష్ణుశర్మ అడిగాడు. వ్యాకులపడి పోతున్నాడు. అతడి యొక్క ప్రశ్నకి శంకరాచార్యులు జవాబు చెప్పలేదు. ఆ రహస్యమేమిటో తెలుసుకోవాలని సతమతమైపోతున్నాడు విష్ణుశర్మ.

"నేను సన్యసించానయ్యా!" శాంతచిత్తంతో జవాబు చెప్పాడు శంకరాచార్యులు.

విష్ణుశర్మ త్రుళ్ళిపడ్డాడు - "ఏమిటి ? సన్యాసమా ? పరిహాసం కాదుకదా?"

''పరిహాసం కాదు విష్ణుశర్మా! నిజమే చెబుతున్నాను, అమ్మ అనుమతించింది." గంభీరంగా అన్నాడు శంకరాచార్యులు.

"అయితే ధృవుడిలాగ అడవిలో తపస్సు చేస్తావా?'' అన్నాడు విష్ణుశర్మ.

"అడవికెందుకూ? సన్యాసమంటే ప్రపంచాన్ని విడిచి అడవుల్లో తపస్సుచెయ్యడం కాదు. నేను కర్మసన్యాసాన్ని స్వీకరించాను. అంటే కర్మం వదిలి పెట్టడం కాదు. కర్మను చెయ్యడం. - దేశంకోసం, ధర్మం కోసం కర్మ చెయ్యడం. అదే నిజమైన కర్మ. అది మానవుణ్ణి కర్మఫల బంధనలతో బంధించదు."

"అయినా, సన్యాసానికి తగిన వయస్సేనా ఇది?" అన్నాడు విష్ణుశర్మ.

"మంచిపనికి వయస్సుతో పనేమిటి శర్మా? ప్రేరణ ఎప్పుడు బలీయమవుతుందో, భావాలూ, విచారాలూ, ఎప్పుడు పవిత్రంగా ఉంటాయో అప్పుడు, ఆ ఉత్తర క్షణంలో మంచి పనులు ప్రారంభించాలి."

మాటకి అడ్డం వస్తూ అందుకున్నాడు విష్ణుశర్మ: "నాఅభిప్రాయం గృహస్థాశ్రమం స్వీకరించాలని. సన్యాసం తరువాత పుచ్చుకోవచ్చు."

"నిజమే; సాధారణంగా వున్న వ్యవస్థ కూడా అదే. బ్రహ్మచర్యం, గార్హస్త్యం, వానప్రస్థం, సన్యాసం- ఈ నాలుగాశ్రమాలూ క్రమంగా పాలించాల్సిందే అయితే వర్ణాశ్రమ వ్యవస్థ సమాజము మేలుకై సమాజమే నిర్మించుకొన్న వ్యవస్థ. మన మేర్పరచిన నియమాలకి మనం ప్రభువులంకాని బానిసలం కాదు" అన్నాడు శంకరాచార్యులు.

"వ్యవస్థలు పాలించడం వల్లనే కదా, సంఘం నిలబడుతుంది?" అన్నాడు విష్ణుశర్మ- "మనం చేసిన నియమాలు ...మే పాడు చేస్తే, మరి ఆ నియమాలవల్ల ప్రయోజన మేమిటి?"

శంకరాచార్యు లన్నాడు: "వ్యవస్థా, నియమాలూ సమాజంకోసమే. వ్యవస్థలోనూ, నియమాల్లోనూ మహత్వం లేదు- సంఘటనలోనూ, దాని జీవనంలోనూ మాత్ర ముంటుంది. సంఘం కోసం హద్దు లేర్పరచడం

అవసరమయిందనుకో, అప్పుడు శ్రీరాముడిలా ప్రతిజ్ఞపూనాలి. నియమాలు ఉల్లంఘించడం అవసరమయిందనుకో, అప్పుడు శ్రీకృష్ణుడిలా వ్యవహరించాలి. ఉల్లంఘించడమూ, పాలించడమూ,— ఈ రెండింటి మాటునా సమాజాన్ని సంఘటిత పరచాలన్న భావనే వుంది. దాని మనుగడ నిలపాలన్న అభిలాషే వుంది. వ్యవస్థా నియమాలూ—ఇవి సాధనాలుమాత్రమే కాని సాధ్యాలు కావు. సాధ్యాన్ని పొందడానికి సహాయపడినంతవరకే సాధనాల ప్రయోజనం. ఊరికే మూఢంగా అనుసరించడంవల్ల లాభమేమిటి?"

"ఐతే, నీవు గృహస్థాశ్రమంలో ప్రవేశించవన్న మాట?" అని విష్ణుశర్మ అడిగాడు.

"ఉఁహూఁ, గృహస్థునై జంజాటంలో పడేందుకు అవకాశం లేదిప్పుడు. అన్ని శక్తులూ సమాజం మేలు కోసమే వినియోగించవలసిన కాలమిది. గార్హస్థ్యమూ, సన్యాసమూ- ఈ రెండూ సాధనాలే. కానైతే రెండోదే ఇప్పుడవసరం. కార్యం బ్రహ్మాండమైంది. సమయం స్వల్పం. ఇంకో మార్గమున్నూ లేదు. అదీగాక బౌద్ధులు తమ సన్యాసం గురించి చాటుతున్నారు. వైదిక ధర్మంలోనూ సన్యాసులున్నారనీ, పైగా వాళ్ళకంటే గొప్పవాళ్ళే వున్నారనీ చూపించాలి. వాళ్ళకు కృతకంగా తయారైన సన్యాసాన్ని పరిష్కరించాలి."

"ఐతే, బౌద్ధ సన్యాసులమల్లే ఏదో ఒక మఠానికి మహంతువై కూచుంటావన్నమాట!" పెదవి విరుస్తూ అన్నాడు విష్ణుశర్మ.

"ఉఁహూఁ" దృఢంగా అన్నాడు శంకరాచార్యులు- "మఠంలో కూచుని, సంఘానికి గుదిబండగా తయారు కావడమూ, ఆనంద మనుభవించడమూ, సౌఖ్యంలో తేలి యాడడమూ సన్యాసం కాదు. ఎల్లప్పుడూ కర్మ చేయడమూ, కష్ట మనుభవించడమూ, దుఃఖం సహించడమూ.

ఇదీ సన్యాసమంటే. సన్యాసి చెయ్యవలసిన పని లోకం బరువు పెంచడం కాదు, దాని బరువు తగ్గించడం. నాకు తెలుసు, ఎంతోమంది హిందువు లిప్పుడు గుడ్డిగా బౌద్ధసన్యాసుల్ని అనుకరిస్తున్నారు. వాళ్ళ ఎదుట ప్రత్యక్షంగా నిజమైన ఆదర్శం చూపించాలి."

"ఐతే నువ్వు గొప్ప పనే తలపెట్టావన్న మాట! శంకరా, మరిచి పోయాను, నిన్ను శంకరుడని కాదు, శంకరాచార్యులు అనాలి కామోసు!" ఎత్తిపొడుస్తూ అన్నాడు విష్ణుశర్మ.

"అవమానపరుస్తున్నావా శర్మా!" రవంత నొచ్చుకుంటూ అన్నాడు శంకరాచార్యులు— "నీ శంకరుణ్ణి ఇలా కించపరచి, నీ నుంచి వేరు చెయ్యాలనా నీ అభిప్రాయం?"

"నువ్వు వేరే అయిపోయావిప్పుడు. నీ వాడూ, పరాయివాడూ అని ఏముంది నీకు?" గద్గద కంఠంతో అన్నాడు విష్ణుశర్మ.

"నేను వేరుకాలేదోయ్ శర్మా!" అన్నాడు శంకరాచార్యులు— "ఈ సన్యాసంలో ఉన్నది విడిపోవడం కాదు, కలుపుగోలుతనం. విరక్తి కాదు, ప్రేమ. ఐతే ఈ ప్రేమలో ఆసక్తిమాత్రం లేదు. బంధనం లేదు. మోహం లేదు. ఇందులో సంకుచితత్వము లేదు, విశాలత్వముంది. దుర్బలత్వం లేదు. శక్తిమాత్రముంది. వ్యక్తికోసం సమాజాన్ని త్యజించడం లేదు. సమాజం కోసం వ్యక్తికి ఆసక్తి మాత్రముంది."

శాంత చిత్తంతో విన్నాడు విష్ణుశర్మ. అతడి తలలో వొక్కసారి ఎన్నో ఆలోచనలు కెరటాలయి పరిగెత్తాయి. భూత భవిష్యద్వర్తమానాలు మూడు కాలాలూ అతడి కళ్ళముందు కట్టినట్టయ్యాయి. అతడిభావభంగిమ వల్లా చేతుల ముద్రలవల్లా అతడేదో గట్టి నిశ్చయానికి వచ్చినట్లు బోధ పడుతోంది.

వయస్సులో శంకరాచార్యుల కంటే పెద్దవాడు విష్ణుశర్మ కాలడీలో శంకరాచార్యులతో కలిసి గురుకులంలో చదివిన నాటినుంచీ అతనికి శంకరుడంటే పరమమైత్రి శంకరుణ్ణతడు ప్రేమించేవాడు. అతణ్ణి గౌరవించేవాడు. శంకరుడి ప్రేమపూర్వకమైన మాటలు విని అతడి హృదయం కరిగిపోయింది. శంకరుడు ఒంటరిగా తిరగడం సహించలేక పోయాడతడు. తాను కూడా ఆయన వెంట బయలు దేరడానికి నిశ్చయించుకున్నాడు.

"శంకరా, నేను కూడా నీతో వస్తానోయి" అన్నాడు విష్ణుశర్మ.

"నువ్వెందుకూ?" శాంతస్వరంతో అడిగాడు శంకరాచార్యులు.

"నేనెందుకా? సమాజం నీ ఒక్కడిదా? నాది కాదా? దానికోసం నీకేనా వుంది బాధ్యత? నాకేమీ లేదా?" ఆవేశంతో అన్నాడు విష్ణుశర్మ. శంకరాచార్యులు మాటాడలేదు. విష్ణుశర్మ ఆయన వెంట నడిచాడు

విష్ణుశర్మా, శంకరుడూ- ఇద్దరూ గురువును వెదుకుతూ నాలుగు దిక్కులా తిరిగారు. చివరికి నర్మద వొడ్డున అమరకాంతంలో వాళ్ళకు యోగి గోవింద పాదుల దర్శనమయింది. చూసీచూడడంతోనే గోవింద పాదుల మనస్సును శంకరుడు ఆకర్షించాడు. భగవంతుడి ప్రేరణ వల్ల ఎంత కాలం నించో ఆయన శంకరాచార్యుల కోసం ఎదురు చూస్తున్నా డంటారు. శంకరాచార్యుల్ని చూడగానే ఆయన ముఖం వికసించింది. గురువు ఆత్మకు శిష్యుడు మూర్తిరూపుడు కదా! అతని మనఃప్రవృత్తికి సంపూర్ణతను ఆపాదించేవాడు కదా! మరి ఒకరినొకరు పోల్చుకోవడంలో ఆశ్చర్యమేముంది? వాళ్ళ ఆత్మసూత్రాలు మొదటే కలిసిపోయివుంటాయి. అంచేత మరొకళ్ళు వచ్చి కలపవలసిన అవసరమే వుండదు. శంకరా చార్యుల్ని చూసి గోవిందపాదులు శాంతిపూర్ణమైన నిట్టూర్పు విడిచాడు. ఆయనని సన్యాసం స్వీకరింపజేసే ఏర్పాట్లకు పూనుకున్నాడు.

శంకరాచార్యుల వంటి ప్రతిభాసంపన్నుడూ, హిందూ ధర్మ పునరుద్ధారకుడూ అయిన మహాపురుషుడు గురువుగా చేసుకున్న ఈ గోవింద భగవత్పాదు లెవరు? ఈ ప్రశ్న మనకు కలగడం సహజం. ఈ ప్రశ్నకి జవాబు కావాలంటే ఈ గురుపరంపర చరిత్ర తెలుసుకోవాలి. శంకరాచార్యుల పేరుతో అద్వైతానికీ, వేదాంతానికీ ఎంత అవినాభావ సంబంధముందంటే, వేదాంత తత్వజ్ఞానం జన్మదాత శంకరాచార్యులే అనుకుంటాం మనం. కాని అది నిజం కాదు. అన్ని తత్వాలకుమల్లే వేదాంత తత్వానికి కూడా ఉద్గమధార వేద మంత్రమే. అయితే, దీనిని ప్రకటించిన మూల పురుషుడు బాదరాయణ మహర్షి. బాదరాయణుడి కాలంలో వైదిక ధర్మావలంబుల మధ్య ముఖ్యంగా మూడు తత్వాలు ప్రచారంలో వుండేవి. అవి కణాదుడి వైశేషిక దర్శనమూ, గౌతముడి న్యాయదర్శనమూ, కపిలుడి సాంఖ్య దర్శనమున్నూ. ఇవికాక వైదికేతర మతావలంబులు కూడా తమ తమ దర్శనాలు ప్రతిపాదించారు. అందులో మూడు- చార్వాకుల లోకాయత దర్శనమూ, జైనుల అర్హత దర్శనమూ, బౌద్ధుల తథాగత దర్శనమూ మిక్కిలి ప్రసిద్ధమైనవి. ఈ చివరి మూడు దర్శనాలూ ఈశ్వరుణ్ణి కాని, వేదాలను కానీ ఒప్పుకోవు. వైదిక సంప్రదాయం ప్రకారం ఏర్పడ్డ సాంఘిక నియమాలను యావత్తూ అవి వ్యతిరేకిస్తాయి. చార్వాక మతస్థులు నీతి నియమాలు కూడా గణించరు. సుఖమూ, విశ్రాంతీ- ఈ రెండే వాళ్ళ లక్ష్యం. తమ సౌఖ్యం తప్ప ప్రపంచం ఊసే వాళ్ళ కక్కరలేదు.

యావజ్జీవేత్ సుఖంజీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్,
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః.
ఇదే వాళ్ళ సిద్ధాంతం.

తక్కిన వైదికేతర దర్శనాల్లో నైతిక స్థానమేమో గొప్పగానే వుంటుంది, కాని తమ పరంపర మీద మాత్రం గురిలేదు వాళ్ళకి. వైదిక దర్శనాల్లో కణాదుడు భౌతిక వాదాన్ని, కపిలుడు ద్వైతవాదాన్ని, గౌతముడు నీరసమైన తర్కాన్ని ఊతగా తీసికొని ప్రపంచంలో దైవీభావాన్ని అనాస్థనూ, అవిశ్వాసాన్నీ ప్రచారం చేశాడు. కృష్ణభగవానుడి భగవద్గీతా, వేదవ్యాస మహర్షి బోధించిన మార్గమూ లోకులు మరచిపోతూ వచ్చారు. పద్దెనిమిది అక్షౌహిణీల సైన్యాన్ని ఆహూతిచేసి ఎంతో పరిశ్రమా, త్యాగమూ చేసి శ్రీకృష్ణుడు స్థాపించిన ధర్మం ఎన్నో దినాలు నిలవలేక పోయింది. దేశమంతటా జాతీయ విరుద్ధమైన ప్రవృత్తులు నిండిపోయాయి. దేశం సర్వనాశనం దిక్కు పయన మారంభించింది. ఇలాంటి స్థితిలో దేశంలోని చెడు యావత్తు నిర్మూలించడం కోసమూ వేదాలలోని అంతరార్థ సత్యాన్ని ప్రకటించడం కోసమూ మూడు కొత్త దర్శనాలు తయారయాయి. అవి పతంజలి యోగదర్శనమూ, జైమిని మీమాంసాదర్శనమూ, బాదరాయణుని వేదాంత దర్శనమున్నూ.

వీటన్నిటిలోకి వేదాంత దర్శనస్థానం గొప్పది. యుగయుగాల నుంచీ హిందూ దేశంలోని మహాపురుషులు దీని మూలంగానే శాంతి పొందారు. వేదాంత మాశ్రయంగా చేసుకునే లోక కళ్యాణం కోసం పని చేశారు; నైష్కర్మ్య సిద్ధాంతం ప్రతిపాదించారు. బాదరాయణ మహర్షి దేశంలోవున్న మతాలు ఏవీకూడా శ్రుతి సమ్మతాలు కావని గుర్తించారు. స్మృతులున్నూ వాటిని వేటినీ సమర్థించడం లేదు. హిమాలయం లోయలో వున్న బదరికాశ్రమంలో బాదరాయణుడు తన తండ్రి బాదరికుడి

ఆధ్వర్యం క్రింద సమస్త వేదాలూ, ఉపనిషత్తులూ, సంహితలూ, బ్రాహ్మణాలూ, స్మృతులూ అధ్యయనం చేశాడు. వేదాల్లో కర్మకాండ ప్రధానంగా వున్న భాగాలూ, జ్ఞానకాండ ప్రధానంగా వున్న భాగాలూ విడమర్చి, జ్ఞాన కాండను ప్రతిపాదించాడు. కర్మకాండ ప్రబలమైపోయి, దాని వాస్తవిక రహస్యం తెలుసుకోకుండా ఊరికే యజ్ఞయాగాది కర్మ కాండతోనే తృప్తి పడేవాళ్ళనూ, దయా, ప్రేమా, సానుభూతీ లేకుండా ప్రవర్తించే కపటు లనూ చూసి బుద్ధభగవానుడికి వైదికధర్మం మీద అసహ్యం వేసింది. దానితో ఆయన అహింసా ప్రధానమైన ధర్మం ఉపదేశించాడు కాని బుద్ధ భగవానుడి అనుయాయులు మాత్రం వేదాలు పూర్తిగా బహిష్కరించారు. శూన్యవాదంవంటి అసత్యమైన తత్వాన్ని ఆశ్రయించారు. బాదరాయణ మహర్షి ప్రతిపాదించిన తత్వంలో ఈ దోషాలు లేవు. ఒక్క కర్మకాండ వల్ల ప్రయోజనం లేదని నిరూపిస్తూ ఆయన పరమ జ్ఞానోద్భవమైన అద్వైతం ప్రతిపాదించాడు.

భగవద్గీత కృష్ణభగవానుడి నోట వెలువడింది. ఆయన జీవనంలోని నిజమైన తాత్పర్యం వ్యక్తం చేస్తుందది. దానిని బాదరాయణ మహర్షే మహాభారతం నుంచి వేరు చేశాడు. దానికొక స్వతంత్రమైన సత్తాకూడా కలిగించాడు. శ్రుతులూ, స్మృతులూ, ఉపనిషత్తులూ, భగవద్గీతా - వీటి అర్థం స్పష్టీకరించడం కోసమూ, పైపైని చూచి ఈ గ్రంథాలు వొకదాని కొకటి విరుద్ధంగా వున్నాయని చెప్పేవాళ్ళ విరోధాభాసం తొలగించడం కోసమూ ఆయన బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. ఈ గ్రంథంతో తర్కాధారంగా వేదాంగ సూత్రాలు విశదీకరించాడు. ఉపనిషత్తులూ, వేదాంత సూత్రాలూ, భగవద్గీతా - ఈ మూడు ప్రస్థానత్రయమని ప్రసిద్ధిచెందాయి. ధర్మాచార్యులు ప్రతి ఒక్కరూ వీటిసహాయంతోనే తమతమ మతాలు ప్రతిపాదించారు. ఉపనిషత్తులు శ్రుతి ప్రస్థానమనీ, భగవద్గీత స్మృతి ప్రస్థానమనీ, వేదాంత సూత్రాలు న్యాయ ప్రస్థానమనీ చెప్పబడ్డాయి,

బాదరాయణ మహర్షి ఈ ధర్మానికి సర్వవిధాలా ప్రాణప్రతిష్ట చేసి, తన కుమారుడయిన శుకమునికి బోధపరిచాడు. శుకదేవుడు కూడా శంకరాచార్యులవలెనే బాల్యంలోనే సన్యాసం పుచ్చుకున్నాడు. అతడు తన జీవితకాలమంతా వేదాంత ప్రధానమైన ఈ వైదిక ధర్మ ప్రచారం చేశాడు. బదరికాశ్రమంలో ఆయన అనేకమంది శిష్యుల్ని తయారు చేశాడు. బాదరాయణుల వేదాంత సూత్రాలను విపులీకరించి పరిష్కరించి ప్రకటించాడు. శుకదేవుడికి ఉపవీర్యుడనీ, గౌడపాదుడనీ ఇద్దరు శిష్యు లుండేవాళ్ళు. వీరిలో గౌడపాదుడి విషయం అధికంగా మనం తెలుసుకో వాలి. ఏమంటే, ఈయన సంప్రదాయాలే శంకరాచార్యులు పెంపొం దించాడు.

గౌడపాదుడు దక్షిణ భారతంలో ఉండేవాడు. తన జీవితంలో ఏదో ఒక గొప్పపని చేయాలన్న ఆకాంక్ష బాల్యం నుండి ఉండే దాయనకి. అందుచేత విద్యాభ్యాసం కోసం పతంజలి మహర్షి దగ్గరికి వెళ్ళాడు. పతంజలి మహర్షి వ్యాకరణంలో ఉద్దండుడైన పండితుడు. పాణిని వ్యాకరణం మీద మహాభాష్యం వ్రాశా డాయన. అంచేత అతడి విఖ్యాతి దేశమంతటా వ్యాపించింది. దూరదూరాలనుంచి విద్యార్థులు విద్యాభ్యాసం కోసం ఆయన దగ్గరికి వచ్చేవాళ్ళు. రానురాను ఈ విద్యార్థుల సంఖ్య వెయ్యిదాకా పెరిగిపోయింది. అంతమంది విద్యార్థుల్ని ఒక్కదగ్గిర చదివించడం అసాధ్యమైపోయింది. అంచేత ఒక యంత్రం కనిపెట్టా డాయన. దాని సహాయంతో అంతమందినీ ఒక్కసారి చదివించడం సాధ్యమయింది. ఆ యంత్రం చేత్తో తాకవద్దని తన శిష్యు లందరికీ ఆదేశించాడాయన. ఆయన లేని సమయంలో ఒకనాడు చంచలస్వభావు డైన ఒక విద్యార్థి ఆ యంత్రం మీద చెయ్యి వేశాడు. దాని విషయమేమీ ఎరగ డతడు. తెలియక ఎక్కడో ఒక దగ్గిర చెయ్యి పెట్టాడు. ఉత్తర క్షణంలో పెద్ద ధ్వనయింది. వెయ్యిమంది విద్యార్థులూ క్షణంలో బుగ్గయ్యి

పోయారు. పతంజలి వచ్చి చూశాడు. ఎంతో విచారించాడు. వెయ్యి మంది విద్యార్థులూ నాశనమైపోయారు. తన పరిశ్రమ యావత్తూ వ్యర్థమై పోయింది. దుఃఖిస్తూ నుంచున్నా డతడు ఎదురుగుండా శిష్యుడు గౌడపాదుడు రావడం చూశాడు. మహర్షి మొహం మీద దుఃఖమూ, సంతోషమూ-రెండు రకాల రేఖలూ తాండవించాయి. తనతోడి విద్యార్థులు భస్మమైపోవడం చూసి గౌడపాదుడు ఏడవడం మొదలు పెట్టాడు. దుఃఖంతోపాటు అతడి హృదయం భయంతో వణికిపోయింది. ఏమంటే, గురువుగారి అనుమతి లేకుండా తోడి విద్యార్థుల్ని వొదిలి బైటికి వెళ్ళా డతడు. దాంతో హటాత్తుగా ఈ ప్రమాదం జరిగిపోయింది. సహాధ్యాయులు హతమైపోయారు క్రమశిక్షణ ఉల్లంఘించిన నేరానికి మనసా దుఃఖిస్తున్నా డతడు. కళ్ళెత్తి మహర్షి కేసి చూసేందుకు సాహసించలేక పోతున్నాడు. తల వొంచుకుని మౌనంగా నుంచున్నాడు. పతంజలి మహర్షి ధీరగంభీర స్వరంతో "గౌడపాదా!" అన్నాడు గజగజలాడ పోయాడు గౌడపాదుడు. ఉత్తర క్షణంలో తన నెత్తిన పడనున్న ఉపద్రవ మతడు పసికట్టేశాడు. "గౌడపాదా! నా ఆజ్ఞ ఉల్లఘించి పాపం చేశావు. దీని ప్రాయశ్చిత్త మనుభవించాలి నువ్వు. సరే, చెడ్డ మాటున మంచికూడా దాగిపుంటుంది. వెళ్ళు; మంచి శిష్యుణ్ణి వెదికి మహాభాష్యం చదివించు. ఒకరికి చదివించే వరకూ అది నీకు జ్ఞాపకముంటుంది. నేనిక ఎవ్వరినీ మహాభాష్యం చదివించను అంతే. వెళ్లు."

దుఃఖంతో హృదయం పగిలిపోతూవుంది గౌడపాదుడికి. గురువు గారికి ప్రమాణం చేశా డతడు. తలవొంచుకొని అక్కడినించి వెళ్ళిపో యాడు. అతడి అవస్థ దీనాతదీనమైపోయింది. మహాభాష్యం నేర్పవలసిన భార మతడి నెత్తిన పడింది. మహాభాష్య మెవ్వరికీ నేర్పకుండా ఉంటే బతికున్నంతవరకూ తన కది జ్ఞాపకముంటుంది- నిజమే కాని, ఇవాళ మన మతణ్ణి ఏమనేవాళ్ళం? మహాభాష్యం దేశం తాలూకు సంపద. రాజ్యోయ్యే

తరాలవాళ్ళకోసం దాన్ని భద్రపరచడమూ, వాళ్ళ కది అందించడమూ గౌడపాదుడి కర్తవ్యం. తన జ్ఞానం కోసమని దేశానికి అమూల్యరత్నం దొరకకుండా చేసేటంత స్వార్థపరుడు కాడతడు. అంచేత తగిన శిష్యుడి కోసమని దేశం నాలుగు మూలలా వెదుకుతూ తిరిగాడు. కాని మహాభాష్య మొకసారి చదివి, అర్థంచేసుకొని, ఇతర్లను చదివించగల యోగ్యుడు ఎక్కడా లభించలే దతడికి. తన మనస్సు విప్పి ఎవరితో చెప్పడమో బోధపడలేదు. తిరగ్గాతిరగ్గా చివరికి ఉజ్జయిని దగ్గిర ఒక వ్యక్తి దొరికాడు. అతణ్ణి చూసీచూడడంతోనే గౌడపాదుడి మనస్సు పరుగులు వారింది. ఇన్నాళ్ళూ వెదుకుతూన్న వ్యక్తి అతడే అని తట్టింది అతడి పేరు చంద్ర శర్మ. అతడు పూర్వభారతంలో వుండేవాడు. వ్యాకరణం చదవటానికి గాఢమైన కోర్కెతో ఉండేవాడతడు. పతంజలి మహర్షి పేరు విన్నాడు. ఆయన దగ్గరికి పయనమవుతున్నాడు గౌడపాదు డతడిని వ్యాకరణం చదివించాడు. తన తలమీదనించి కొండంత బరువు దించుకున్నట్టయిం దతడికి.

తరువాత గౌడపాదుడు హిమాలయం వెళ్ళాడు. బదరికాశ్రమంలో చేరి శుకదేవుడి దగ్గర వేదాంతం నేర్చుకున్నాడు. ఆచార్యు డయ్యాడు. ఎన్నో గ్రంథాలకి భాష్యాలు వ్రాశాడు. సాంఖ్య శాస్త్రాన్ని, యోగ శాస్త్రాన్ని వేదాంత శాస్త్రంతో సమన్వయపరుస్తూ ఎన్నో గ్రంథాలు వ్రాశాడు.

ఈ గౌడపాదాచార్యుల శిష్యుడే మన శంకరాచార్యుల గురువు గోవిందపాదులు. గౌడపాదాచార్యులు మహాభాష్యం నేర్పిన చంద్రశర్మే ఈ గోవిందపాదుడని ప్రాచీనగ్రంథాలవల్ల వ్యక్తమవుతుంది. చంద్రశర్మ మహాభాష్యం లిపిబద్ధం చేశాడు. అయితే వ్యాకరణ విద్య శుష్కమైంది. దానివల్ల చంద్రశర్మ ఆత్మకి శాంతి లభించలేదు. అంచేత అతడున్నూ బదరికాశ్రమం వెళ్ళాడు. అక్కడ గౌడపాదాచార్యుల దగ్గిర వేదాంతం

నేర్చుకున్నాడు. ఈ గోవిందపాదాచార్యులే నర్మద ఒడ్డుని అమరకాంతంలో తన ఆశ్రమం స్థాపించాడు. ఆయన కొన్నాళ్ళు బదరికాశ్రములో వుండేవాడు. కొన్నాళ్ళు అమరకాంతంలో వుండి తన శిష్యులకి ధర్మమూ, శాస్త్రాలూ నేర్పేవాడు.

శంకరు డీమహాపరంపరలో ప్రవేశించాడు. గోవింద భగవత్పాదుల దగ్గిర వేదాంతం నేర్చుకున్నాడు. శంకరాచార్యులు వేదాంతం నేర్చుకుని కేవలం తన శిష్యులకి బోధించడంతో తృప్తిపడలేదు. తన యావజ్జీవమూ దానిని ఆచరణలో పెట్టాడు. దేశమంతటినీ ఈ మంత్రంతో అభిమంత్రించాడు. జ్ఞానదీపం వెలిగించి దిగ్దిగంతాలు వెలుగుతో ముంచెత్తాడు. ఎలా చేశాడిది? తన భావి జీవితమే దీనికి జవాబు చెబుతుంది.

గోవిందపాదులు శంకరాచార్యులకి విధిపూర్వకంగా సన్యాసధర్మముపదేశించాడు. శంకరాచార్యులు కర్మసన్యాసం పుచ్చుకున్నాడు. గోవిందపాదుల ఆశ్రమంలో నివసించాడు. శంకరాచార్యునివంటి తీవ్రమయిన బుద్ధిమంతుణ్ణి చదివించడం దుష్కరమైన పని. కాని గోవిందపాదులు సమస్త శాస్త్రాలూ దక్షతతో చదివించా డాయనను. తన ప్రియ శిష్యుడు తప్పకుండా ధర్మం ఉద్ధరిస్తాడన్న నమ్మకముండే దాయనకు. అంచేత శిష్యుడిలో లోపాలు విడిచి పెట్టడమంటే, భావి జాతీయజీవనంలో లోపాలు విడిచిపెట్టడమే అన్నమాట! కనుక ఎంతో జాగ్రత్త తీసుకున్నాడు గోవిందపాదులు. వేదాంత ధర్మంలోని ప్రతిభాగమూ విడమర్చి శంకరాచార్యునికి నూరిపోశాడాయన. ప్రతిమాటలో ప్రతిచేతలో ప్రతి వ్యవహారంలోనూ శంకరాచార్యుల్ని తీర్చిదిద్ది వొదిలిపెట్టాడు. ధర్మప్రచార కార్యంలో ముక్కాకలు తీరిన వ్యక్తిగా తయారయాడు శంకర్యాచార్యులు. సూత్రాలకి అర్థాలు చెప్పేటప్పుడు తన్మయుడై చెప్పేవాడు గోవిందపాదుడు. తన ఆత్మ వెలికి తీసి శంకరాచార్యులముందు పెట్టేస్తున్నాడా

అనిపించే దప్పుడు. శంకరాచార్యులంటే గోవిందపాదులకి పక్షపాతమనీ నిందింఛారు తక్కినవాళ్ళు. ఆ నింద సహించి కూడా శంకరాచార్యులకి విద్య నేర్పాడాయన. ఏమంటే, తన యొక్కా, తన జాతియొక్కా భావి ఆశలన్నీ శంకరాచార్యులమీదే కేంద్రీకృతమై వున్నాయి.

సన్యాస ధర్మమంటే ఏమిటో, శంకరాచార్య్ లేమిటి నేర్చు కున్నాడో అదంతా శంకరాచార్యుల జీవనమే వ్యక్తం చేస్తుంది. అమర కాంతంలో జరిగిన వొక సంఘటనవల్ల మరింత బాగా బోధపడుతుందది. గోవిందపాదులు ఆశ్రమంలో లేడు అప్పుడు. బదరికాశ్రమం వెళ్ళాడు. ఆశ్రమం మంచీ చెడ్డా శంకరాచార్యులు చూస్తున్నాడు. వర్షాకాలం. ఆ యేడు మేఘాలు ప్రబలంగా వున్నాయి. అహంకారంతో కిందా మీదా ఎరగని మనిషిలా తమ్ముతాము సంబాళించుకోలేకుండా, వెనకాముందూ ఆలోచన లేకుండా, ధారాపాతంగా కురవడంమొదలు పెట్టాయి. పెద్ద పెద్ద ఉరుములకు చెవులు చిల్లులు పడిపోతున్నాయి. మెరుపులవల్ల కళ్ళు మిరు మిట్లు గొలుపుతున్నాయి. హోరుమని వర్షం. శరీరం జడ్డిబారి పోతూ వుంది. నెమ్మది నెమ్మదిగా లభించిన జ్ఞానంలాగ నెమ్మదిగా కురిసిన వర్షంతో భూమి తెప్పిరిల్లుతుంది. దాని ఉత్పాదన శక్తి పెరుగుతుంది. వ్యవసాయం వృద్ధవుతుంది. ప్రజ లానందిస్తారు. కాని పుచ్చుకునేవాడి శక్తి విచారించకుండా దానమిస్తే దుఃఖానికి కారణమైనట్టు అంతూ పంతూ లేని వాన నీరు వరిసర ప్రాంతాలు భరించలేకపోయాయి. అదంతా పట్టుకు పోయి నర్మదలో పారేశాయి. గాంభీర్యంలేని మనిషి లాగ ఉప్పొంగి పోయింది నర్మద. ఒడ్లొరుసుకుంటూ వెర్రి పరుగులు ప్రారంభించింది. దాని రెండుపక్కలా నివసిస్తూ వున్న మానవుల్ని సర్వనాశనం చేసింది. అలా ఎంతో దూరం వ్యాపించి పోయింది. నర్మదలో వరద క్షణక్షణమూ పెరిగింది. ఒడ్డున ఉన్న ప్రజల జీవితాశ క్షణక్షణమూ తరుగుతూ వచ్చింది. ప్రళయం వచ్చి పడ్డట్టున్నాయి మేఘాలు. తరుగూ విరుగూ

లేకుండా వుంది వాటికి. శాంతంగా వున్నప్పుడు జీవనం పోసేది నర్మద. ఆ నర్మదే ఇప్పుడు ప్రళయ రుద్రుడిలాగ విలయ తాండవ మాడుతోంది. చుట్టుపట్ల గ్రామాలు కొట్టుకు పోయాయి. వేలాది ప్రజలు ఇళ్ళూ వాకిళ్ళూ లేక అల్లాడిపోయారు. నిరాధారులై పోయారు. ఏళ్ళ తరబడి కూడ బెట్టుకున్న సంపద ఒక్క ఆవేశంలో దోచుకుపోయింది నర్మద. స్త్రీలూ పురుషులూ కొట్టుకుపోతున్నారు. ఈ మృత్యు తాండవంలో కూడా ధనం మీద మోహం వదలక వెంటాడుతున్నట్టు సంపదతో కూడా కొట్టుకు పోతున్నారు జనం. ఎన్నో ఆవులు ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి. ప్రయత్నించిన్నీ ప్రాణాలు దక్కించుకోలేక పోతున్నాయి. కెరటాల్లో మునిగి ప్రాణాలు వదిలేస్తున్నాయి. ఆకాశం చిల్లులుపడిపోయినట్టు అరుస్తున్నా వినపడనివ్వడంలేదు నర్మద. వాటిని మించిపోయినట్టు గర్జి స్తోంది. కాని చెవులున్నవాళ్ళు వింటూనేవున్నారు మిన్ను విరిగి మీదపడి పోతున్నట్టుంది. కాళ్ళావేళ్ళాపడినకొద్దీ, ఏడుపులూ మొఱలూ పెట్టినకొద్దీ, దుష్టుడైన మానవుడిలాగ మరింత మండిపడుతూవుంది మేఘం. మృత్యు వర్షం కురుస్తోంది. ప్రజల మొఱ విన్నాడు శంకరాచార్యులు. ఆయన హృదయం పగిలిపోయినట్టయింది. ముక్కుమూసుకుని ఆశ్రమంలో కూచోలేకపోయా డాయన.

సంసారమే మాయగా భావించే శంకరాచార్యులు వరదలవల్ల బాధ పడ్డ ప్రజల సేవలో ఎన్నాళ్ళు గడిపాడో చెప్పడం కష్టం. "ఈ బాదర బందివల్ల ప్రయోజన మేమిటి మనకి?" అనేవాళ్ళు ఆశ్రమ వాసులు. "పరమ సత్యం తెలుసుకోవడం కోసమూ, పరబ్రహ్మ సాక్షాత్కారం కోసమూ మాత్రమే మన కాలం వెళ్ళబుచ్చాలి" అనేవాళ్ళు. కాని శంకరా చార్యులకు తెలుసు, పరమ సత్యమంటే ఏమిటో. ఆకాశం మీద పువ్వులు పూస్తే పూస్తాయేమో కాని అక్కడ భగవంతుడు మాత్రం కనిపించడు. దానికోసం భూమి మీదే చుట్టుపట్ల ప్రజల హృదయాలే తడవాలి. ఆర్తుల

ఆక్రందనంలో దేవుడి గొంతుక వినపడనివాళ్ళ చెవులకి భగవంతుడి శాంతస్వరం అసలే వినపడదు. దీనజనుల ఆత్మ గుర్తించనివాడు సర్వాత్మనెలా గుర్తిస్తాడు?

"ఆకాశం మీదా, అడవిలోనూ నిన్ను వెదుకుతున్నాను నేను. ఏ దీనుడి పేద గుడిసెలోనో నువ్వు వెదుకుతున్నావు నన్ను!"

ఈ సిద్ధాంతం శంకరాచార్యులు తన జీవనంలో సాధించాడు. ఆశ్రమవాసులతో కలిసి వరదవల్ల బాధపడ్డవాళ్ళ సేవలో నిమగ్నుడయ్యాడాయన. మహాపురుషుడొక పనికి పూనుకున్నప్పుడు, భయంకరమైన ప్రకృతి శక్తులు కూడా అతడి ముందు తలవంచుతాయి. శంకరాచార్యులు నర్మదాష్టకం వ్రాశాడు. నర్మదని స్తుతించాడు. నర్మద శాంతించిదట! ఇదిగో ఆ నర్మదాష్టకం.

సబిందు సంధురస్ఖల త్తరంగభంగరంజితం,
ద్విషస్తు దాపజాతజాతకారి వారిసంయుతమ్
కృతాంతదూత కాలభూత భీతిహారి వర్మదే
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౧

త్వదంబులీన దీనమీన దివ్యసంప్రదాయకం
కలౌ మలౌఘభారహారి సర్వతీర్థనాయకం
సుమత్స్య కచ్ఛ నక్ర చక్ర చక్రవాక శర్మదే
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౨

మహాగభీరనీరపూరపాపభూతభూతలమ్,
ధ్వనత్సమస్త పాతకావిదారితాపదాజలమ్
జగల్లయే మహాభయే మృకుండుసూనూహర్మ్యదే,
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౩

గతం తదైవ మే భయం త్వదంబు వీక్షితం యదా
మృకండుసూను శౌనకాసురారిసేవి సర్వదా
పునర్భవాబ్ధిజన్మజం భవాబ్ధిదుఃఖవర్మదే,
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౪

అలక్షలక్షకిన్న రామరాసురాదిపూజితం,
సులక్షనీరతీరపధీరక్షిలక్షకూజితమ్
వశిష్ఠశిష్టపిప్పలాదికర్దమాదిశర్మదే
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౫

సనత్కుమార నాచికేత కశ్యపాది షట్పదైః
ధృతం స్వకీయమానసేషు నారదాది షట్పదైః
రవీందు రంతిదేవ దేవరాజ కర్మశర్మదే,
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౬

అలక్షలక్షలక్షపాపలక్షసారసాయుధం
తతస్తు జీవజంతుతంతు భుక్తిముక్తిదాయకమ్,
విరించి విష్ణు శంకర స్వకీయధామవర్మదే
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౭

అహోమృతం స్వనం శ్రుతం మహేశకేశజాతటే
కిరాతసూతబాడబేషు పండితే శఠే నటే
దురంతపాప తాపహారి సర్వజంతుశర్మదే,
త్వదీయ పాదపంకజం నమామి దేవి నర్మదే. ౮

ఇదంతు నర్మదాష్టకం త్రికాలమేవ యే సదా
పఠంతి తే నిరంతరం నయాంతి దుర్గతిం కదా
సులభ్యదేహదుర్లభం మహేశధామగౌరవం,
పునర్భవా నరా నవై విలోకయంతి రౌరవం. ౯

గోవిందపాదులు బదరికాశ్రమం నించి వచ్చాడు. శంకరాచార్యుల సౌహార్ద్రం విని ఎంతో సంతోషించాడు. శంకరాచార్యులు ఆత్మలన్నీ ఒకటే అన్న స్థితికి వచ్చాడన్న నమ్మక మాయనకి కుదిరింది. ఇక ధర్మంకోసం దేశ సంచారం చెయ్యమనాలి. ఈ మహాకార్యానికి శంకరాచార్యులు బయలుదేరే ముందు ఆయనకి తన గురుదేవుడు గౌడపాదుల దర్శనం చేయించడం మంచిదని భావించాడు గోవిందపాదుడు. వెంటనే తన అభిప్రాయం శంకరాచార్యులకు వినిపించాడు. వినడమే తడవు ఆనందంతో గెంతువేశాడు శంకరాచార్యులు. తన పరమ గురువు దర్శనం! ఎంత భాగ్యం! ఆయన కాళ్ళు కింద్కనిలవడం లేదు. జన్మజన్మాల పుణ్యం ఫలించిం దివాళ. ధన్యుడయాడు తాను!

గోవిందపాదుడూ, శంకరాచార్యులూ బదరికాశ్రమం బయలుదేరారు. అమరకాంతం నుంచి హిమాలయమెంతోదూరం. ఇంతదూరమూ పువ్వులమీద నడిచినట్టు నడిచి వెళ్ళాడు శంకరాచార్యులు. దారిమీద ధ్యానమే లేదాయనకి. తన పరమగురువుమీద ధ్యానం పెట్టుకుని నడిచాడు. ఎప్పుడూ తన లక్ష్యంమీదే దృష్టి పెట్టుకున్నవాడికి మార్గాయాస మెలా వుంటుంది? తన కాళ్ళమీద తలంపే లేదాయనకు, అసలు తలంపే లేని వాడివి సుఖం కాని, దుఃఖం కాని ఎలా బాధిస్తుంది?

బదరికాశ్రమంలో భగవాన్ గౌడపాదాచార్యులు బ్రహ్మనిష్ఠలో లీనమై వున్నాడు. గోవిందపాదుడు శంకరాచార్యుల్ని పరిచయం చేశాడు. తన పరమ గురువుకు శంకరాచార్యులు సాష్టాంగ నమస్కారం చేశాడు. గోవిందగురువు మళ్లేనే శంకరాచార్యుల్ని చూసి గౌడపాదాచార్యునికి నమ్మకం కలిగింది. 'శంకరాచార్యులు తప్పకుండా వైదిధర్మ ముద్ధరిస్తాడు!' ఆయనలో అలౌకికమైన ప్రతిభా, అసాధారణమైన బుద్ధీ ప్రకాశిస్తున్నాయి. అంతకంటే అధికంగా ఆయన దగ్గిర తన దేశమూ, తన

ధర్మమూ దుర్దశలో వుండడం చూసి వ్యాకులపడుతున్న హృదయ మున్నూ వుండడం గమనించా డాయన. అంతేకాదు, ఆ హృదయంలో ఈ దుర్దశ తొలగించాలన్న దృఢనిశ్చయమూ, ఆకాంక్షా కూడా అవుపిస్తు న్నాయి. ఇన్నీ వుండినా కూడా శంకరాచార్యులలో ఏమాత్రమూ లోటు లేకుండా చెయ్యాలనే నిశ్చయించాడు గౌడపాదుడు. ఏమంటే, కార్యకర్త యోగ్యుడైతే సమాజం అవనతి కూపంలోంచి లేచి హిమాలయ శిఖరం మీద కూచోగలుగుతుంది. అలాగే కార్యకర్త అయోగ్యుడైతే సమాజ మార్గంలో అడ్డంకులున్నూ సృష్టించగలుగుతాడు. అంతేకాదు, ఎప్పుడో ఒకప్పుడు తన వ్యక్తిగత స్వార్థంలో పడిపోయి, పేరుప్రఖ్యాతులూ మంటగలిపేస్తాడు. అహంకారమన్నది ప్రతివాణ్ణి అధోగతిలోపడదోస్తుంది. ఇక సమాజంకోసం పనిచేసేవాడి అహంకారమైతే మరి చెప్పే అక్కర లేదు. అది అతడితో ఆగిపోదు. సమాజ మంతటా వ్యాపిస్తుంది. చుట్టుపట్ల వాతావరణం యావత్తూ విష కలుషితం చేస్తుంది. శంకరాచార్యులలో అహంకారం మచ్చుకైనా లేదని గౌడపాదునికి తెలుసు; అయినా ఆయనను నాలుగేళ్ళపాటు తనదగ్గిర అట్టే పెట్టుకున్నా డాయన. స్వయంగా ఆయనకు శిక్షణ జరిపాడు. దోషమన్నది లేకుండా చేసి వదిలిపెట్టాడు.

శంకరాచార్యుల జీవనంలో ఈ నాలుగేళ్లూ ఎంతో మహత్వ సిద్ధి కలిగించాయి. ఇక్కడి శిక్షణ తన జీవనంలో అమూల్యంగా వుండేది. భారతీయ సంస్కృతికీ, జీవనానికీ హిమాలయం ఒడిలో కూచుని విశాల త్వమూ, దృఢత్వమూ నేర్చుకున్నాడు శంకరాచార్యులు. మంచు చరియల ప్రకాశంలో తన ధర్మప్రకాశం చూసుకున్నాడు. తన జీవనం మంచులా స్వచ్ఛంగా ఉంచుకునేందుకు ప్రయత్నించాడు. వేసవిలో ఆయనతో సరితూగలేకపోయేది మంచు. ఉజ్జ్వలమైన ఆయన జీవనం చూసి సిగ్గుతో అది కరిగిపోయేది. ప్రవహించి, ప్రవహించి ఎదటినుంచి పారిపోయేది. ఏదో లోతయిన గోతిలో తన మొహం దాచేసుకోవాలని ప్రయత్నించేది.

భగవతి భాగీరథి కలకలస్వనం దూరంనించీ ఆయనకు వినిపించేది. పెద్ద పెద్ద తుఫానుల్లో హిమాలయం తలయెత్తుకు నుంచోవడం చూశాడాయన. ఆ హిమాలయమే లెక్కలేని భారతీయులకి జీవనమూ పుణ్యమూ లభించడం కోసం వేసంగిలో నిలువునా కరిగి గంగానదికి జీవన దానం చెయ్యడమూ చూశాడు. హిమాలయం తాలూకు ఈ మూక దేశభక్తి చూసి శంకరాచార్యులు దాని ఎదుట భక్తితో తలవంచాడు. తానుకూడా ఆపదలూ కష్టాలూ గణించకుండా, అణువణువూ కరిగిపోతూ దేశసేవ చెయ్యడానికి వ్రతం పట్టాడు.

బదరికాశ్రమంలోనే శంకరాచార్యులు తన పరమగురు వాజ్ఞాపించిన ప్రకారం, ఆయన ఆధ్వర్యంకింద ఎన్నో గ్రంథాలు వ్రాశాడు. ఒకనాడు ముండకోపనిషత్తు కారికమీద భాష్యం వ్రాయడానికి పరమగురువు అనుమతి కోరాడాయన. అనుమతి లభించింది. తత్పరతతోనూ దక్షతతోనూ రసవంతమైన భాషలో సరళమైన భాష్యం వ్రాశాడు శంకరాచార్యులు. చూశాడు గౌడపాదాచార్యులు. మిక్కిలి ప్రసన్నుడయాడు. వెంటనే వేదాంత ప్రస్థానత్రయి మీద భాష్యం వ్రాయమన్నాడు. దాంతో జగత్ప్రసిద్ధమైన షోడశభాష్యాలూ రచించాడు శంకరాచార్యులు. నాలుగేళ్ళ స్వల్ప వ్యవధిలో ఒకతట్టు అధ్యయనం సాగిస్తూ ఇన్ని గ్రంథాలు వ్రాయడమంటే ఆశ్చర్యకరమైన విషయం. పైగా, భాష్యాల భాషా, శబ్దాల మహత్వమూ, భావాల గంభీరతా చూస్తే అది మానవ మాత్రుడు చేసిన పని కాదనిపిస్తుంది. ఇవాళకూడా పెద్దపెద్ద రచయితలు వాటినిచూసి ముక్కుమీద వేలు పెట్టుకుంటారు. వేదాంత సూత్రాల మీద ఆయన భాష్యం అద్వితీయమైంది. నేటిదాకా ఎందరో ఆచార్యులు భాష్యాలు వ్రాశారు. కాని భావాల మౌలికతలోనూ, గంభీరతలోనూ, దృఢత్వంలోనూ, సరసతలోనూ శంకరాచార్యులతో ఒక్కరూ సాటి రాలేదు. శంకరభాష్యాలు ఎంత ప్రాచీనమైనవో అంత అధికృతమైనవి.

భగవద్గౌడ పాదాచార్యులు శంకరాచార్యుల భాష్యాలు చూసి, ప్రసన్నుడై తన గురువైన శుకదేవుడి దర్శనమూ, పరమ గురువైన బాదరాయణుడి దర్శనమూ చేయించడం కోసం ఆయనని కైలాస పర్వతం తీసుకు వెళ్ళాడంటారు. వేదాంతానికి ఆద్యప్రణేత అయిన బాదరాయణ మహర్షిని దర్శించి శంకరాచార్యులు ధన్యుడయాడు. అప్పుడే ఆయన ధన్యాష్టకం రచించాడట! ఈ కింవదంతిలో నిజముండినాలేకపోయినా, శంకరాచార్యులు బాదరాయణుల రచనల ద్వారా ఆయన దర్శనం పొందిన మాట మాత్రం నిజం.

ఈ పని పూర్తి చేశాక, దేశ సంచారంకోసం శంకరాచార్యులు గురువుగారి ఆజ్ఞ పొందాడు. గురుదేవుడు ఆశీర్వదించాడు. సాఫల్యం పొందుమని శుభాకాంక్షలు వెల్లడించాడు. భగవానుడి ఆశీర్వాదమూ, పూర్వుల పుణ్యఫలమూ శంకరాచార్యులకి తోడయాయి. గురుదేవుడి ఆశీర్వాదం పొంది మరొకసారి తలవంచి నమస్కరించా డాయన. గురుదేవుడి ఆశీస్సు లందుకున్నాడు. చేత్తో ధర్మ ధ్వజమూ, దండ కమండలాలూ పట్టుకున్నాడు. ధర్మయాత్ర ప్రారంభించాడు.

గురువుగారి ఆజ్ఞ తీసుకుని, శంకరాచార్యులు ప్రయాణానికి సిద్ధ పడుతున్నాడు. ఇంతలో తన బంధువు అగ్నిశర్మ రావడం చూశా డాయన. ఏదో పెద్ద వచ్చిపడిందని గతుక్కు మన్నాడు. సందేహంతో హృదయం దడదడా కొట్టుకుంది. తనకి తెలుసు, పెద్ద తప్ప అగ్నిశర్మ రావడానికి మరో కారణముండదు. కాలడి దృశ్యాలు వొకటి తరువాత ఒకటి తన కళ్ళముందు కట్టినట్టయాయి. అగ్నిశర్మకి అభివాదం చేశా డాయన. కుశల వార్త లడిగాడు. అగ్నిశర్మ మాటాడలేదు. నిశ్చలంగా నుంచున్నాడు.

"అన్నా! అంతా క్షేమమే కదా? మాట్లాడకుండా నుంచున్నావు?" ఆతురతతో అడిగాడు శంకరాచార్యులు.

అగ్నిశర్మ పెద్ద ధనం మూట తీసి శంకరాచార్యుల ముందు పెట్టాడు. "ఈ ధనం మీతల్లి ఆర్యాంబ నీకిమ్మని పంపింది. ఆమె చివరి ఘడియలు లెక్క పెడుతూ కూచుంది" అన్నాడు.

శంకరాచార్యులమీద పిడుగు పడ్డట్టయింది. నిశ్చేష్టుడై నుంచుండి పోయా డాయన. తల్లిమీద చెప్పలేనంత ప్రేమ తనకు, నిజమే, కాని ఆమె కాలం చేస్తుందని కాదు. తన ధర్మ యాత్ర ఆగిపోయిందనే బాధ పడుతున్నా డాయన. శాంత చిత్తంతో తన్నుతాను భగవంతుడికి సమర్పించుకున్నాడు. ఆమె కాలం చేసినప్పుడు దగ్గిర ఉంటానని సన్యాసం పుచ్చుకున్నప్పుడు తల్లికి మాట ఇచ్చాడు. ఆ ప్రతిజ్ఞ ప్రకారం వెంటనే కాలడి బయల్దేరాడు.

తల్లి ధనం పంపింది. ఆయితే శంకరాచార్యులేం చేసుకుంటా డది! ఆయన సర్వమూ వదులుకున్న సన్యాసి! అంచేత ఆ ధనం పెట్టి బదరికాశ్రమంలో దేవాలయం కట్టించా డాయన. 23000 అడుగుల ఎత్తు బద్రీనాథ దేవాలయం నేటికి కూడా హిమాలయం లోయలో నిలబడివుంది. దాని పునాదులతోపాటు హిందూ జాతీయతకు కూడా పునాదులు వేశా డాయన. అదిన్నీ ఆ మందిరంలాగే తలెత్తుకు నిలబడివుంది. మన తీర్థ క్షేత్రాల్లో బద్రీనాథం కూడా వొక ముఖ్యమైన క్షేత్రం. భారతదేశం మూలమూలనించీ, చలియనక మంచనక వేలకొద్దీ హిందువులు బద్రీనాథ దర్శనానికి యాత్ర వెళతారు. భక్తి శ్రద్ధలతో బద్రీనాథుడి దర్శనం చేసినప్పుడు తెలియకుండానే శంకరాచార్యునికీ, తల్లి ఆర్యాంబకీ శ్రద్ధాంజలి సమర్పిస్తారు. అక్కడ భగవంతుడికి భోగం సమర్పిస్తున్న బంగారం గిన్నె శంకరాచార్యు లిచ్చిందే. ఈ నాటికీ కూడా అగ్నిశర్మ వంశస్థులే బద్రీనాథంలో పూజారులై వున్నారు.

బదరీనారాయణ మందిరం మొదలు పెట్టించి శంకరాచార్యులు తన స్నేహితుడు విష్ణుశర్మతో కలిసి కాలడి బయలుదేరాడు. విష్ణుశర్మ

కూడా సన్యాసే. ఇప్పుడు అతడి పేరు చిత్సుఖాచార్యులు. శంకరా చార్యులు తల్లిని చూడడానికి తహతహలాడి పోతున్నాడు. దారి ఒక్కొక్క అడుగూ ఒక్కొక్క కోసులా వుందాయనకు. తరగనంత దూరంగా వుంది దారి. అలా అని తక్కువదూరం కాదది. బదరికాశ్రమం నుంచి కాలడి రమారమీ 1800 మైళ్ళ దూరం. ఆ కాలంలో రైళ్ళు లేవు. విమానాలు లేవు. నడవవలసిందే పూర్తిగా. అంతదూరం నడిచినడిచి ఎన్ని దినాలు పట్టిందో? అన్నాళ్ళూ ఆయన మనస్సెలా వుందో? ఏమో? తల్లి చివరి ఘడియలు లెక్కపెడుతోందన్నాడు అగ్నిశర్మ. తాను కూడా ఇక్కడ దారిలో అడుగులు లెక్కపెడుతున్నాడు! ఆయన పాదాలు నేల తాకడం లేదు. నేల తాకడంలో కూడా కాలాతీతమై పోతుంది! ఎగురుతూ వచ్చేస్తున్నా డాయన. విశ్రాంతి అన్నమాటే లేదు. దప్పికా, ఆకలీ అన్నీ చచ్చిపోయాయి.

పడుతూ లేస్తూ ఎలాగో కాలడి చేరుకున్నాడు శంకరాచార్యులు. దేవుడి దయవల్ల తల్లి దర్శనం లభించింది. ఇల్లు చేరీ చేరడంతోనే అమాంతంగా పరుగెత్తుకువెళ్ళి తల్లి పాదాలమీద వ్రాలా డాయన. తాను సన్యాసి నన్నమాటే మరచిపోయాడు. తాను సర్వ వంద్యుడన్న మాటే గుర్తు లేదాయనకి. కాదు; గుర్తులేక కాదు. తానెంత గొప్ప వాడయినా, తన తల్లికి మాత్రం తాను శంకరుడే. తల్లి తల్లే. తల్లి ఎప్పుడూ ఆదరించ తగ్గదే. పూజ్యురాలే. ఆర్యాంబ కుమారుణ్ణి గుండెల కద్దుకుంది. ఆమె నేత్రాల నించి ఆనందాశ్రువులు రాలాయి. తల్లికి ఎంతో సేవ చేశాడు శంకరాచార్యులు. అహర్నిశలూ తల్లి మంచం దగ్గిరే కూచునేవా డాయన. ఆమె కాళ్ళు పట్టేవాడు. ఆమెకి పథ్యం పెట్టేవాడు. ఉక్కపోస్తే విసిరే వాడు. ఆర్యాంబకు ఒక్క వ్రత ముండేది. ఆమె ప్రతిదినమూ పూర్ణా నదిలో స్నానం చేసి వచ్చేది. ఇప్పు డామెకు శక్తిలేదు. శరీరం దుర్బ లంగా వుంది. నది వరకూ నడవడం కష్టం. నది దూరం కూడా. ఆమెకి

విచారం పట్టుకుంది. తుది దినాల్లో తన వ్రతం మానుకోవాలి, ఇదే ఆమె బాధ. తల్లి ఇలా విచారిస్తూ వుండడం చూసి శంకరాచార్యులన్నాడు: "అమ్మా, ఎందుకలా విచారిస్తావు? ఇవాళదాకా నువ్వు నది దగ్గిరకి వెళ్ళావు. ఇప్పుడు నది నీ దగ్గిరికి వస్తుంది." ఆర్యాంబకి అర్థంకాలేదు. కాని శంకరాచార్యుల దగ్గిర అలౌకికమైన శక్తి వుందని మాత్రం ఆమెకి తెలుసు. అంచేత కొడుకు మాట నమ్మిందామె.

మర్నాడు ప్రాతఃకాలం భుజంమీద కడవ పెట్టుకుని బయలుదేరాడు శంకరాచార్యులు, ఆర్యాంబ అడిగింది- "ఎక్కడికి వెళుతున్నావు శంకరా?"

"నది తేవడానికి వెళుతున్నా నమ్మా?" అన్నాడు శంకరాచార్యులు.

"వద్దు నాన్నా, వద్దు. నదికి వెళ్ళవద్దు. నదిలో మొసలి వుంది." ఆర్యాంబ తడబడుతూ అంది.

శంకరాచార్యులు నవ్వుతూ అన్నాడు, "అది చచ్చిపోయిందమ్మా, నేను మరి సన్యాసం పుచ్చుకోనక్కరలేదు కదా!''

శంకరాచార్యులు నదికి వెళ్ళాడు. కడవతో నీళ్ళు ముంచాడు. తరువాత పడవలూ పడవ తెడ్లూ కట్టలా కట్టి నదీ ప్రవాహం తిప్పేసి వచ్చాడు. ఆర్యాంబ అవాళ కడవనీళ్ళే స్నానం చేసింది. మిగిలిన నీళ్ళు గుమ్మంలో పారబోసింది. మర్నాడు జనంచూసి నివ్వెరపోయారు. పూర్ణానది శంకరాచార్యుల గుమ్మం తాకుతూ ప్రవహిస్తోంది. నదిలో తెడ్లతో కట్ట కట్టడంవల్ల అలా అయింది. రహస్యం అర్థంకాక శంకరాచార్యుల అమానుషశక్తి గురించి రకరకాల చెప్పుకున్నారు ప్రజలు.

ఆర్యాంబ ఒకనాడు శంకరాచార్యులతో అంది: "శంకరా! ధర్మం తెలిసినవాడివి నువ్వు, దేశమంతటా ధర్మం ప్రచారం చెయ్యాలని చూస్తు

న్నావు. రవ్వంత నాకున్నూ ఏదో ధర్మం బోధించకూడదూ? చచ్చే ముందు కాస్త శాంతయినా లభిస్తుంది!"

తల్లి ఆదేశం శిరసావహించాడు శంకరాచార్యులు. ఆమెకి అద్వైతం బోధించడం ప్రారంభించాడు. స్పష్టంగా సరళమైన మాటలతో బోధించా డాయన. ఆమెకోసం తేలికయిన భాషలో తత్వబోధ అని ఒక గ్రంథమున్నూ చేశాడు. అన్నీ వింది ఆర్యాంబ. చివరికంది- "ఇవి పెద్ద పెద్ద విషయాలోయి! దేశంలో యావన్మందీ ఎలా గ్రహిస్తా రివి? ఏదో నాకు కృష్ణపరమాత్మ విషయం చెపుదూ!''

శంకరాచార్యులు కృష్ణాష్టకం వ్రాసి తల్లికి వినిపించాడు. అప్పుడే ఆయన గ్రహించాడు, వేదాంత తత్వజ్ఞానంలో భక్తికూడా కలపకపోతే జనసాధారణాని కది పనికిరాకుండా పోతుందని. భక్తుల వేరు వేరు ఇష్ట దైవాల మరుగున ఒకే పరబ్రహ్మం ప్రతిష్ఠించాలని కూడా అప్పుడే నిశ్చయించుకున్నాడాయన. కృష్ణాష్టకం వింటూ ఆర్యాంబ భక్తిభావంతో తన్మయురాలయిపోయింది. భగవంతుణ్ణి ధ్యానిస్తూనే ఆమె ఆత్మ భగవంతుడిలో లీనమైపోయింది. కృష్ణాష్టకం ముగించాడు శంకరాచార్యులు. తల ఎత్తి చూశాడు. జీవంలేని తల్లి శరీరం తనముందు పడి వుంది. తల్లి మరణించింది. ఆమె అంతిమ సంస్కారం చెయ్యాల మాయన విధి. తల్లికి మాట ఇచ్చాడాయన. అయితే, ఆయన సన్యాసి. దాహకర్మ చెయ్యడానికి సన్యాసికి అనుమతి లేదు. ఆయన కది తెలుసు. ఆమెను పిడికెడు బుగ్గి చేస్తానని తనచేత తల్లి ప్రతిన పట్టించినప్పుడే ఈ సమస్య తన ముందుకు వచ్చింది. సన్యాసమూ, అంత్య సంస్కారమూ - ఈ రెండూ పొసగవు. అంచేత కుమారుడు సన్యాసం వొదిలేస్తాడని ఆర్యాంబ భావించింది. ఐతే, జాతికీ, ధర్మానికీ అధికంగా సేవ చెయ్యడానికే సన్యాసం పుచ్చుకున్నా డాయన. అంతేకాని, ఆడంబరం కోసం కాదు.

తల్లి అపరక్రియలు జరిపి శంకరాచార్యులు సన్యాసధర్మం భగ్నం చేశాడే ననండి, ఐతే ఆయనతో ఏ నైష్టిక సన్యాసి సాటివస్తాడు? శంకరాచార్యుల మల్లే ఏ సన్యాసి దేశసేవ చేశాడు? మానసికంగా, తాత్వికంగా కూడా నిజమైన సన్యాసి శంకరాచార్యులు. ఊరికే జేగురు గుడ్డలు వేసుకునే సన్యాసి కాడాయన. అంచేతే ఇప్పటికి కూడా సన్యాసులు యావన్మందికీ శంకరాచార్యులే ఆదర్శం.

సన్యాసం పుచ్చుకొని శవ దహనానికి పూనుకున్నాడు శంకరాచార్యులు. అంచేత ఆయన కులస్థులూ. కుటుంబంవాళ్లూ తిరగబడ్డారు. ఆర్యాంబ శవం మోయడానికి కూడా ఒక్కడూ రాలేదు. అయితే, శంకరాచార్యులు భయపడే ఘటం కాదు. ఆయన నిశ్చయానికి చలన మంటూ లేదు. ఆయన ప్రతిజ్ఞ దృఢమైంది. తిరుగులేదు దానికి. తన హృదయంలో ప్రతిష్ఠించుకున్న సత్యం ముందు లోకం లెక్కలేదాయనకు. స్వయంగా తాను ఒక్కడే విధిపూర్వకంగా తల్లి అపర క్రియలు నెరవేర్చాడాయన. తన వాకిట్లోనే చితి పేర్చాడు. బలిష్ఠమయిన తన భుజాలమీద తల్లి శవం మోసుకువచ్చాడు. చితిమీద పెట్టాడు. ముఖాగ్ని పెట్టాడు. వేదమంత్రాలు చదువుతూ అగ్ని సంస్కారం చేశాడు. అప్పుడే ఆయన మాతృస్తుతి అనే శ్లోకాలు వ్రాశాడు. ఆయన హృదయంలో తల్లిమీద ప్రేమా, భక్తి ఎంత వున్నదీ మాతృస్తుతిలో ప్రతి అక్షరమూ గొంతెత్తి చాటుతుంది.

తల్లి అంత్య సంస్కారం పూర్తయిందో లేదో, అమరకాంతం నించి కబురు వచ్చింది. సహజానందుడని ఒక వ్యక్తి అక్కడి నుంచి వచ్చాడు. భగవద్గోవిందపాదుడు రోగశయ్య మీద ఉన్నాడని కబురు చెప్పాడు. కాలంచేసేముందు శంకరాచార్యుల్ని చూడాలని అభిలషిస్తున్నాడాయన. అంచేత నుంచున్నపాటున రమ్మని సదానందుడిచేత కబురు చేశాడు. కబురు వినడమే తడవు; అమరకాంతం పరుగెత్తాడు శంకరా

చార్యులు. ఎంతో కష్టం మీద ఒక నెలలో అమరేశ్వరం (అమరకాంత) చేరుకున్నాడాయన. ఆయన వెళ్ళేసరికి భగవద్గోవిందపాదులు తెలివి లేకుండా పడివున్నాడు. ప్రియశిష్యుడి మాట వినగానే కళ్ళు విప్పాడు. లేని బలం తెచ్చుకుని, బాగా ఆరోగ్యంగా ఉన్నవాడిలా లేచి నుంచు న్నాడు. శంకరాచార్యుల్ని గుండెలకద్దుకున్నాడు. ఆయనకి తన అంతిమ సందేశం వినిపించాడు దిగ్విజయం ప్రారంభించమని ఆదేశించాడు. ఓంకారం ఉచ్చరిస్తూ మహాప్రయాణం సాగించాడు. గోవిందపాదుల స్థానే శిష్యకోటికి శంకరాచార్యులే గురువయ్యాడు.

ఇన్నాళ్ళూ శంకరాచార్యులు దేశపరిస్థితి పూర్తిగా అవగతం చేసుకున్నాడు. ఇంచుమించుగా భారతదేశమంతా ఆయన సంచారం చేయనే చేశాడు. వేదాలూ, వేదాంగాలూ సమస్త శాస్త్రాలూ పూర్తిగా అధ్యయనం చేశాడు. ఈ మూలనించి ఆ మూలవరకూ ప్రజల విచారాలూ, భావనలు, వాళ్ళ కోరికలు అవగాహన చేసుకున్నాడు. కొడుకు కాయిలాపడితే తల్లి హృదయం విలవిలలాడిపోతుంది. ఆమెకి బాధగా ఉంటుంది. నిజమే, కాని కొడుకు రోగమేమిటో, దానికి మందేమిటో ఆమెకి తెలియదు. రోగమేమిటో వైద్యుడికి తెలుస్తుంది. దానికెలా చికిత్స చెయ్యాలో తెలుస్తుంది. కాని రోగిమీద అతడికి ప్రేమ ఉండదు. హృదయంలో వేదన ఉండదు. తటస్థుడుగా ఉంటాడతడు. ప్రసక్తి పెట్టుకోకుండా చికిత్స చేస్తాడు. శంకరాచార్యులకు దేశంమీదా, సంఘంమీదా తల్లి ప్రేమవంటి ప్రేమ వుండేది. వైద్యుడిలాంటి శాస్త్రజ్ఞానమూ ఉండేది. దేశ దుర్దశచూసి తన హృదయం బాధపడినప్పుడు, హృదయశాంతికోసం ఏదిపడితే అది చేసెయ్యడానికి సిద్ధపడలేదాయన. ఒక తత్త్వవేత్తలాగా ఈ దుస్థితికి కారణాలేమిటో పరిశీలించాడు. విషయ వివేచన చేశాడు. రోగనిదానం చేశాడు. అప్పుడు దానికి తగిన చికిత్స ఆరంభించాడు. మాతృస్నేహంవల్ల కలిగిన తన్మయతా, మంచి వైద్యుడికున్న చికిత్సాజ్ఞానమూ-రెండూ జోడించాడు.

ఆత్మ విశ్వాసంతో సమాజానికి సేవా, చికిత్సా చెయ్యడానికి పూనుకున్నాడు. ఆయన చూశాడు, దేశమంతటా రెండు రకాల మతాలూ మతాంతరాలూ వ్యాపించి వున్నాయి. మొదటిది వైదికవిరుద్ధమైనది, పురాతన సంప్రదాయాలు నాశనం చేసే బౌద్ధధర్మమూ మొదలైనవి. రెండోది పై ధర్మాలకి ప్రతిక్రియచేయడం కోసమూ, వైదిక ధర్మం రక్షించడం కోసమూ ఏర్పడినది. మొదటి రకం మతాలలోని జాతీయ విరుద్ధ ప్రవృత్తులు శంకరాచార్యుల్ని బాధపరుచుతూనే వుండేవి. వాటితోపాటు రెండో వాటిలోని లోపాలు ఆయనకి వేదన కలిగించేవి. ఈ మతాల్లోని జాతీయ ప్రవృత్తి కలవాళ్ళు కూడా ఉత్తమ మార్గం వొదిలిపెట్టేసి ఏదో ఒకటి చేసుకు కూచునేవాళ్ళు. ఎవరికివారే యమునాతీరే అన్నట్టుండేది. ఎవరి డోళ్లు వాళ్లు వాయించుకునేవాళ్లు. తాముపట్టిన కుందేటికి మూడేకాళ్ళనేవాళ్లు. ఎదుటివాళ్ళ నోళ్లు మూయించడమే పరమావధి వాళ్ళకి. దానికోసమే తమ శక్తి సామర్థ్యాలు తగలబెట్టేవాళ్లు. బుద్ధ భగవానుడి నుంచీ ఆనాటివరకూ వెయ్యేళ్లు సమాజం మీదపడిన సంస్కారాలు తృణీకరించి కొందరు ఒక్కసారి గంగానదిని తిరుగుమొహం పట్టిద్దామని ప్రయత్నించేవాళ్లు. తిరిగి వైదికయుగం పట్టుకురావాలని బంగారం కలలుకంటూ కూచునేవాళ్ళు. ఉన్న సంస్కారాలే ఘనమనుకునేవారు కొందరు. గంగలో కలిసే కుళ్ళు కాలవలే గంగ అనుకునేవాళ్ళు. వాటిలోనే మునకలు పెట్టి పుణ్యం పోసుకుందామని భావించేవాళ్ళు. భ్రమలో పడి ఆత్మవంచన చేసుకునేవాళ్ళు. ఇదంతా చూసి ఒక నిశ్చయానికి వచ్చాడు శంకరాచార్యులు. మొదట, ఈ రెండో రకం వాళ్ళలో దేశ కల్యాణం కోరేవాళ్ళనీ, ఋషు లేర్పరిచిన వైదిక ధర్మం పునరుద్ధరించాలనే వాళ్ళనీ ఒక్క తాటిమీదికి తేవాలని పూనుకున్నాడాయన. వీళ్ళని ఒక్కటిగా సంఘటితపరిచాక, భ్రమవశాత్తూ ప్రాచీన సంప్రదాయానికి దూరమైపోయినవాళ్ళనీ, జాతీయ విరుద్ధమైన ప్రవృత్తులకు బలి అయిపోయిన వాళ్ళనీ, వాళ్ళలోని జాతీయ

ప్రవృత్తులు తొలగించి తనలో చేర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆయన నిశ్చయం ప్రకారం కార్యప్రణాళిక సిద్ధమయింది. ఆందోళన కొక రూపురేఖ లేర్పడ్డాయి. లక్ష్యమూ, దానికొక మార్గమూ ఒకసారి నిశ్చయమయాక, నిష్ఠతో పనిచేసేవాడు ముందడుగు వెయ్యడానికి అలస్యముండదు. అతడి జీవన నౌక జంకూ, శంకా అనే సుడిగుండాల్లో 'మునగానాం తేలానాం' కాదు. విరోధులు లేవదీసిన తుఫానులో అల్లాడి పోదు. 'జ్ఞానమూ' 'శ్రద్ధ' అనే చుక్కాని దానినే రక్షిస్తూనే వుంటుంది. ఆత్మ విశ్వాసమనే తెరచాప ఎత్తుకొని అది తుపానుల్లో కూడా ఆగదు; ముందుకి పోతుంది.

భారత దేశమంతటా ఆందోళన ఆరంభించే ముందు తనతో చేతులు కలిపే వాళ్ళని తయారు చేయడానికి పూనుకున్నాడు శంకరాచార్యులు. ఈ పనికి కాశీ పట్నంకంటే మంచి స్థలం మరొకటి లేదు. యుగయుగాల నుంచీ కాశీనగరం భారత సంస్కృతికి కేంద్రస్థలం. భారతాత్మ కాశీలోనే వుంటుందంటే కూడా అతిశయోక్తి కాదు. గొప్ప గొప్ప దిగ్గజాలలాంటి పండితులు ఎప్పుడూ అక్కడ కిటకిటలాడుతూ వుండేవాళ్ళు. విద్య కోసం దేశదేశాల నుంచి విద్యార్థు లక్కడికి వచ్చేవాళ్లు. గురువుల దగ్గర పన్నెం డేళ్ళు, పదిహేనేళ్ళు వుండి తమ ఊళ్ళకి వెళ్ళేవాళ్ళు. ఒకరు దూరదేశం దక్షిణాది నించి వస్తే, ఒకరు ఉత్తరాది కాశ్మీరంనించి వచ్చేవాళ్లు. ఒకరు పడమటి ఎడారిదాటి సౌవీరం నుంచి వస్తే, ఒకరు ఎన్నో నదులు దాటి తూరుపు ప్రాగ్జోతిషం నుంచి వచ్చేవారు. వేరు వేరు ప్రాంతాల నుంచి వచ్చిన వాళ్ళు తమ విద్యార్థి దశ అక్కడే గడిపేవాళ్ళు. యావన్మందీ ఒక్క గురువుదగ్గిర అన్నదమ్ములవలె కలిసి మెలిసి వుండేవాళ్ళు. ఒక్క దగ్గిరే పడుకునేవారు, ఒక్కదగ్గిరే కూచునేవారు, ఒక్కదగ్గిరే చదువుకునే వారు. ఒక్కదగ్గిరే ఆడుతూ పాడుతూ, తింటూ తిరుగుతూ వుండేవారు.

ఒక్క ఏడనికాదు, రెండేళ్ళని కాదు-నిండా పాతికేళ్ళు వచ్చేవరకూ అలా జీవించేవాళ్ళు. అలాంటప్పుడు వాళ్ళలో పరస్పరం ప్రేమ వృద్ధి కావడంలో వింతేముంది? వీళ్ళలో భేదభావం పరారీ చిత్తగించేది. భిన్నత్వం ఛిన్నాభిన్నమయేది. సంకుచితత్వం పటాపంచ లయేది. ప్రాంతీయభావం తల ఎత్తేదికాదు. ఈ బ్రహ్మచార్య పరంపతే భారతదేశమంతటా ఏక జాతీయత నిండించింది. దేశంలో సమానమైన విచారమూ, సమానమైన ఆచారమూ నెలకొల్పింది. దేశమంతటినీ సమానమైన భావ సూత్రంతో బంధించింది. శంకరాచార్యుల కాలంలో కూడా ఈ బ్రహ్మచార్య పరంపర ఉండేది. కాని క్షీణదశలో ఉండేది. ఆ ఉన్నవాళ్ళలోనూ కూడా భిన్నభావాలు మొలకెత్తుతూ ఉండేవి. హృదయంలోంచి బయలుదేరిన రక్తమే శరీరమంతటా వ్యాపిస్తుంది. అంచేత శంకరాచార్యులు ముందు హృదయమే శుద్ధి చేయటానికి పూనుకున్నాడు. శుద్ధమయిన రక్తం సులువుగా రక్తనాళాల్లోంచి, సిరల్లోంచి శరీరమంతటా ప్రాకుతుంది. రక్త నాళాల్లోనూ, సిరల్లోనూ చిక్కు వచ్చిందో, వాటిని కూడ సరిచేసి తీరాలి. కాని ముందుగా హృదయం గురించే జాగ్రత్త పడాలి. శుద్ధమయిన రక్తం నరాలకు కూడా పటుత్వం కలిగిస్తుంది. శంకరాచార్యులు రెండు పనులూ చేశాడు- కాశీ క్షేత్రంలో తన ధర్మ ప్రభావం స్థాపించాడు; అక్కడికి వచ్చేపోయే బ్రహ్మచారి పరంపరను కూడా పురిపుష్టి చేశాడు.

తాను నిశ్చయించుకున్న ప్రకారం శంకరాచార్యులు గోవిందపాదుల శిష్యులతో కాశీక్షేత్రం చేరాడు. గంగానది వొడ్డున దశాశ్వమేధ ఘాటు సుప్రసిద్ధమైంది ఒకటీ రెండూ కాదు- పదేసి అశ్వమేధ యజ్ఞాలు చేసి, యావద్భారత దేశంలోనూ సమ్రాట్టులు ఏకఛత్రాధిపత్యం ప్రకటించిన చోటది. ఆ కూలిపోయిన సామ్రాజ్యాల గురించీ, భారత దేశైక్యత గురించీ ఆ దశాశ్వమేధ ఘాటులోనే చర్చించాలి. సాంస్కృతికంగా ఐక్యత ఏర్పడందే, దాని గురించి చర్చ జరగందే, ఏకఛత్ర

సామ్రాజ్యానికి చెందిన రాజనీతి యొక్క ఐక్యత నిలవదు. రాజనీతి యొక్క ఐక్యతకి ముందు సాంస్కృతికమయిన ఐక్యత అవసరం. సాంస్కృతికంగా ఐక్యత ఏర్పడిందో, రాజకీయ ఐక్యతకోసం ఎంత మంది వీరులయినా జన్మించవచ్చు. సాంస్కృతికంగా ఏకత్వం ఏర్పడి ఉంటే, రాజకీయమైన భిన్నత్వం ఉన్నా అది దేశం గొంతుక నొక్కినా, దాని శరీరం శుష్కింప జేసినా దాని ఆత్మని మాత్రం పాడు చెయ్యలేదు. ఆత్మ బలంగావుంటే శరీరం సంగతి అదే చూసుకుంటుంది. శంకరాచార్యులు దశాశ్వమేధ ఘాటులో కూచున్నాడు. మాంధాతా, భరతుడూ, రఘువూ, రాముడూ, ధర్మరాజూ, చాణక్యుడూ, చంద్రగుప్తుడూ, పుష్యమిత్రుడూ, శాతకర్ణి, నవనాగుడూ, వాకాలుకుడూ, ప్రదరసేనుడు, సముద్రగుప్తుడూ, చంద్రగుప్త విక్రమాదిత్యుడూ మొదలైన మహామహుల దిగ్విజయాలు ఒకటి తరువాత ఒకటి చలన చిత్రాల్లా ఆయన కళ్ళ ముందు అవుపించాయి. వాళ్ళమల్లే దిగంత వ్యాప్తమైన ఏకఛత్ర సామ్రాజ్యం - అంతకంటే దృఢమైన సామ్రాజ్యం- విశాలమైన, ప్రభావ యుక్తమైన సామ్రాజ్యం స్థాపించాలని భావించా డాయన. భూసామ్రాజ్యానికి బదులు భావసామ్రాజ్యం ఆపేక్షించాడు. కలకలమంటూ గంగా నది ఆయనని సమర్థించింది. ఆమె తరంగ మాలికలు ఎగిరి ఎగిరి ఈ శుభసంకల్పం అభినందించాయి. గంగానది స్వచ్ఛమైన జలరాశి స్నానానికని ఆయన నాహ్వానించింది. అలయిక అంటే ఎరుగని భగీరథుడి కార్య దీక్ష బహుశా ఆయనకు ప్రసాదిస్తుందో ఏమో గంగ! తనలో స్నానమాడిన ఋషిపుంగవుల తపస్సు ఆమెలో సంక్రమించి ఉంటుంది. కనుకనే గంగాజలాలకా పవిత్రతా, పాపుల్ని ఉద్ధరించే శక్తి వచ్చి ఉంటుంది. ఆ ఋషి పుంగవుల తపశ్శక్తి శంకరాచార్యునిలో ప్రవేశ పెడుతుందో ఏమో గంగమ్మ! అందుకే ఆయనని స్నానాని కాహ్వానించి ఉంటుంది.

శంకరాచార్యులు గంగానదిలో స్నానమాడాడు. శుచిగా బైటికి వచ్చాడు. ఆయన తేజస్సు రెండింతలయింది. మనస్సులోని నిశ్చయ భావం తేజస్సయి పైకి ఉబికినట్టుంది. తన భావాల ప్రతిబింబమే గంగలో తన కవుపించింది. తన ఆధ్యాత్మిక ప్రపంచం మూర్తిమంత మైన గంగానదిగా తన ముందు ప్రత్యక్షమైనట్టుంది. లోకం ఎదుట గంగానది పరుగెత్తుకుపోతోంది. ప్రతి క్షణమూ మారుతూనే ఉందది. కాని దానిలో భిన్నత్వం లేదు. అనుక్షణమూ అనిత్యంగానే ఉంది. కాని శాంతికి లోపం లేదు. లెక్కా జమా లేని నీటి బిందువులు ఎదటికి వస్తాయి, ఒక్క క్షణం నాట్యం చేస్తాయి, ముందుకి సాగిపోతాయి. వాటి స్థానం మరికొన్ని నీటిబిందువులా క్రమిస్తాయి. మొదటి వాటికంటే వేరయినవే ఇవి. కాని జీవనంలో అవీ ఇవీ ఒక్కటే. మొదటివాటి అడుగుజాడల్లోనే ఇవీ నడుస్తాయి. వాటిని అంటి పెట్టుకునే ఉంటాయి. వాటి పరంపరగా అలాగే వెళ్ళి సముద్రంలో కలవాలన్న కోరికతో పరి గెడతాయి. కనుక కాశీలో గంగా, హరిద్వారంలో గంగా ఒక్కటే. ఈ రెండూ వేరువేరని ఎవరంటారు? చూస్తే ఆ రెంటికీ మళ్ళా ఎంతో భేద ముంది. అయినా అవి రెండూ ఒక్కటే; రెండింటి ప్రవాహమూ ఒకటే. రెండింటి లక్ష్యమూ ఒక్కటే, పుణ్యం ప్రసాదించే శక్తి, పాపం పోగొట్టే సామర్థ్యమూ ఒకటే. ఇదే భేదంలో అభేదం; భిన్న త్వంలో అభిన్నత్వం. అనేకత్వంలో ఏకత్వం. దీన్నే శంకరుడు లోకానికి చాటదల్చుకున్నాడు. గంగలో లేచే కెరటాలూ, సుడిగుండాలూ నిజం కాదు. గాలి పరిణామ స్వరూపాలవి. పైపైవి. అసత్యమైనవి. అవి నిత్యమైనవి కావు. అనిత్యమైనవి. అదంతా అసత్యం, దగా, మాయ. ఐతే, నావికుడు సుడిగుండాలు తప్పించుకోడం మాత్రం తప్పదు. జాతీయత కూడా గంగలా అనుక్షణమూ పరివర్తనం పొందుతూ ఉన్న ప్రవాహమే. ఈ పరివర్తనం అడ్డుకునేందుకు ప్రయత్నించడమంటే,

పురుగులతో కంపుకొట్టే నిలవనీటితో దేశం నింపెయ్యడమన్న మాట! అలాగే ప్రవాహంతో విడిపోవడమంటే, దానిని శుష్కింప చెయ్యడమన్న మాట! హిందూజాతి యొక్క, హిందూ ధర్మం యొక్క సనాతన ప్రవాహం అదే విధంగా ఎల్లప్పుడు ప్రవహించాలని శంకరాచార్యుల అభిప్రాయం. పరివర్తనం సాగుతూవుండినా, అవరోధం మాత్రముండకూడదు. మీదిమీది మార్పుల వెనక దృఢమైన సత్యం ద్యోతకం కావాలి. జాతి యొక్క నిజమైన ఆత్మ దర్శనమిస్తూ వుండాలి. అదీ ఆయన సంకల్పం. ఈ సమయంలోనే శంకరాచార్యులు గంగాస్తోత్రం రచించాడు. ఆయన ఊహించిన జాతీయ స్వరూప మందులో సువ్యక్తమవుతుంది.

శంకరాచార్యులు కొంతకాలం కాశీలో నివసించాడు. తన లక్ష్య పూర్తికోసం క్షేత్రం తయారు చేయడంలోనే ప్రతి క్షణమూ గడిపాడు. తన భావాలతో ఏకీభవించి, వాటిని కార్యరూపంలో పెట్టడానికి దృఢ సంకల్పంతో వ్రతం పట్టిన వాళ్ళని చుట్టూ చేర్చుకున్నాడు. క్రమక్రమంగా తన శిష్యబృందం పెరుగుతూ వచ్చింది. వాళ్ళలో పద్మపాదుడు ముఖ్యుడు. గురువుగారిమీద అతడి శ్రద్ధాభక్తులు అద్వితీయమైనవి. ఒకనాడు గురువుగారు పిలిచేసరికి పద్మపాదుడు ఉత్తి కాళ్ళతో గంగలో దిగిపోయాడు! అగాధంగా వుంది గంగానది. అడుగడుకీ వొక్కొక్క పద్మ పుష్పం తనముందు నీటి మీద కనపడుతూ వచ్చింది. ఆ పద్మాల మీంచి నడిచి అతడు వచ్చేశాడు! అంచేత అతడి పేరు పద్మపాదుడయింది! నిజమే, తన లక్ష్యం మీద దృష్టి, నాయకుడి మీద గురీ కలవాణ్ణి - నాయకుడి పిలుపు వినగానే సంకోచించకుండా పరిగెత్తేవాణ్ణి ఏ అడ్డంకులూ అడ్డుకోలేవు. శ్రద్ధ తెప్పగా వున్నవాణ్ణి గంగాజలాలు మాత్రమెలా ముంచేస్తాయి? అలాంటి వాడి దారిలో ముళ్ళుండవు. దారిలోని శూలాలు కూడా పూవులయిపోతాయి. రవంత ఆపద కొండంత చేసే శ్రద్ధాహీనులూ, సంశయాత్ములూ అయినవాళ్ళ దారిలో మాత్రం దాటలేని పర్వతాలూ, ఈదలేని

సముద్రాలూ ఎదురవుతాయి. ఎంచేతనంటే, వాళ్ళ గురి లక్ష్యం మీద వుండదు. కాళ్ళమీద వుంటుంది. వాళ్ళ హృదయంలో లక్ష్య దేవతకి స్థానం లేదు. తాము కల్పించుకున్న కష్టాలే తమ మీదికి రాకాసుల్లాగ నోళ్ళు తెరుచుకొని పరుగెడుతూ వుంటాయి.

ఒక్క పద్మపాదుడే అన్నమాటేమిటి, అలా ఎంతోమంది శిష్యులు శంకరాచార్యులంటే ప్రాణం పెట్టేవాళ్ళు అయన 'ఊ' అంటే ప్రాణా లర్పించడం మహాభాగ్యమని భావించేవాళ్ళు. వేదాంతం వంటి శుష్క విషయం బోధించే శంకరాచార్యులలో ఎంత ఆత్మీయత వుండేదో అది ఆయన శిష్యకోటికే తెలుసు. గురువు గారి పెద్దరికమెన్నడూ శిష్యుల మీద చూపించలేదాయన. పైగా అవసరమైనప్పుడు శిష్యుల సేవ కూడా చేయడం కద్దు. ఉదంకుడన్న కుష్ఠురోగి శిష్యుడికి స్వయంగా సేవ చేశా డాయన. ఆయన సేవవల్లే భయంకరమైన కుష్ఠు రోగంనించి బాగయాడు ఉదంకుడు. హస్తామలకుడు కూడా ఆయనవల్లే ఆరోగ్యవంతుడయ్యాడు. శిష్యులతో గురు శిష్యుల తారతమ్యం గమనించేవాడు కాడాయన. శిష్యుల్ని సహాధ్యాయులలా చూసేవాడాయన. గురువూ శిష్యులూ వొక్కదారిని ప్రయాణించే బాటసారులే. ఈ ప్రేమవల్లే, ఈ హృదయ వైశాల్యంవల్లే ఆయనమీద శ్రద్ధాభక్తులు చూపేవారు జనం. ఆయన లక్ష్యంతో సమ లక్ష్యం కలిగివుండేవారు; ఆయన చుట్టూ చేరేవారు. ఆ బలం మీదే భవిష్యత్తులో ఆయన తన ధర్మప్రచారం సునాయాసంగా సాగించగలిగాడు.

కాశీలోవుండి శంకరాచార్యులు కొన్ని భక్తి ప్రధానమైన గ్రంథా లున్నూ వ్రాశాడు. ప్రస్థానత్రయం మీద ఆయన భాష్యం లోగడే ప్రసిద్ధి చెందింది. ఆయన భాష్యంమీద కాశీపండితులు బ్రహ్మాండమైన చర్చ సాగించారు. పద్మం తాను వికసించానంటూ ఎన్నడూ దండోరా వెయ్యదు, విజ్ఞాపన పత్రాలు ప్రకటించదు. దాని పని వికసించడమే. తుమ్మెదలు

వాటంతట అవే దానిచుట్టూ మూగుతాయి. అలాగే శంకరాచార్యుల చుట్టూ పండితులు కిటకిటలాడారు. కొందరు ఆయనతో శాస్త్ర చర్చకోసం వచ్చే వారు. కొందరు కుతూహలంకొద్దీ వచ్చేవారు. కొందరు వితండవాదం చేసి ఆయనను కించపరచాలని వచ్చేవారు. కాని వచ్చేవాడల్లా ఆయనకు లొంగిపోయేవాడు. పెద్దపెద్ద పండితులు బోరవిరుచుకు వచ్చేవాళ్ళు. వెళ్ళే టప్పుడు తలవాల్చుకు మరీ వెళ్ళేవాళ్ళు. ఆయనను తిడుతూ వచ్చేవాళ్ళు, పొగుడుతూ వెళ్ళిపోయేవాళ్ళు. వచ్చిన ప్రతివాణ్ణి ప్రేమతో దగ్గిర కూచో బెట్టుకునేవాడు శంకరాచార్యులు. వాళ్ళు చెప్పింది శాంతంగా వినేవాడు. అహంకారమన్నది లేకుండా వాళ్ళ సందేహాలన్నిటికీ సమాధానాలు చెప్పే వాడు. పొంగుతూన్న పాలు చన్నీళ్ళు చల్లడంతోనే ఎలా చల్లారిపోతాయో అలాగ విరోధుల విరుద్ధభావం ఆయన మధుర సంభాషణతో చల్లారిపోయేది. జ్ఞానులలో సర్వశ్రేష్ఠుడు శంకరాచార్యులు. వేదవేదాంగాలలో ఉద్దండుడు. ఐతే లోకులను తన జ్ఞానం చేతకాదు, ప్రేమచేత గెలుచుకున్నాడాయన. లోకుల మస్తిష్కం మీదకాదు, హృదయం మీద విజయం సాధించాడు. హృదయం గెలుచుకున్నాక మెదడు దానంతట అదే స్వాధీనమయి పోతుంది. ఏమంటే, హృదయానికి బానిస మెదడు.

నాలుగు దిక్కులా శంకరాచార్యుల యశస్సు కొనలు సాగుతూ వుండేది. దానితోపాటు ఆయన శిష్యులున్నూ హెచ్చుతూ వుండేవాళ్ళు.

''ఇంకా ఎన్నాళ్ళికాశీలో పడివుండాలి స్వామీ?'' ఒకనాడు చిత్సుఖు డడిగాడు - ''భారతదేశమంతటా పని చెయ్యాలికదా! నాలుగుదిక్కులా అనాచారం పెరిగిపోతున్న వార్తలతో చెవులు చిల్లులు పడిపోతున్నాయి.''

''ధైర్యం వహించు విష్ణూ!'' శాంతంగా అన్నాడు శంకరాచార్యులు. చిత్సుఖుణ్ణి ఆయన ఇప్పుడు కూడా విష్ణూ అనే పిలిచేవాడు. "అవసరమైన శక్తి సంపాదించనిదే ఆందోళన ప్రారంభించామో, అపజయమూ, నిరాశా కొనుక్కున్నట్టే అవుతుంది. ఇప్పుడు ప్రతి ఒక్కరూ తమ మతం అఖిల

భారత మతంగా చెయ్యాలనే చూస్తున్నారు. అది సహజమే కూడా. ఏమంటావా? తమ విచారాలూ, వాటి లాభాలూ తమ దేశీయులందరికీ పంచి పెట్టాలనుకోడం స్వాభావికమే కదా? ఈ పరిమిత ప్రదేశంలోనే మా మత ముండాలని హద్దు లేర్పరుచుకోవలసిన అవసరం వాళ్ళకేముంది? ఐతే వాళ్ళ సిద్ధాంతాలు అసత్యమైనవి కావడమే. ప్రజలభావాలకి ప్రతికూలంగా వుండడమే. నిస్సారమైనవి కావడమే. వాళ్ళు శక్తి హీనులు కావడమే కాదు. వాళ్ళ కార్య పద్ధతులున్నూ దోష భూయిష్టమైనవి. ఊరికే అఖిల భారతీయమని పేరు పెట్టేసినంత మాత్రాన, లేదా అలా అని ఊహించు కున్న మాత్రాన అది అఖిల భారతీయమయిపోదు. దానికోసం తగినంత ప్రయత్నం జరగాలి. సంఘమంతటా వ్యవస్థ ఏర్పాటు చెయ్యాలి. సకల ధర్మాలూ సమన్వయ పరచాలి. దానికి తగినట్టు శక్తి కూడా సంపా దించాలి."

చిత్సుఖుడి కవగతమైంది. సంశయాలు లేకుండా ఉన్నప్పుడే పని చేసే శక్తి హెచ్చుతుంది. సంశయాలు చిత్తవృత్తిని రక్కుతూ ఉంటాయి. కాళ్ళు పట్టుకుని వెనక్కి పడతాయి. మన ఉద్దేశాలు సఫలం కావడం మనం చేసిన పనిమీద ఆధారపడి ఉంటుంది. అంచేత నిస్సందేహమయిన చిత్తంతో శంకరాచార్యుని శిష్యవర్గం యావత్తూ వెంటనే పనిచేయడానికి నడుం కట్టింది.

శంకరాచార్యుల మనస్సులో చిన్నా - పెద్దా, మడీ - మైలా అన్న భేద భావం ఎన్నడూ లేదు. నిజానికిమడీ-మైలా అన్న సమస్య ఈనాటిది. ఆనాడు దీని వూరూ పేరూ ఉండేదికాదు. అయినా ఒక సంగతి చెప్పా లిక్కడ. ఒకసారి శంకరాచార్యులు స్నానానికి వెళ్ళుతున్నాడు. ఇంతలో వొక చండాలుడు ఎదురుగుండా వెళుతూ ఎదురయాడు. అతణ్ణి దూరం తప్పుకోమన్నారు శిష్యులు. చండాలుడు చప్పున వెనక్కి తిరిగాడు. శంకరా చార్యుల్ని చూసి అన్నాడు, "ఆత్మలన్నీ ఒకటే అని అద్వైతం చెపు తున్నావు. క్రియకు వచ్చేసరికి ఈ భేద భావమేమిటి స్వామీ? ఏమిటీ ఆడంబరం! తమ సన్యాసమూ, ఈ దండ కమండలాలూ - అంతా కపట

నాటకమే అనుకోనా నేను? సరే, బావుంది. కాని మీరు దేనిని తప్పుకో మంటున్నారు? ఈ శరీరాన్నా? నశించేదేకదా ఇది! నా శరీరానికీ మీ శరీరానికీ భేదమేమిటి? లోపలా బైటా ఈ రెండింటి నిర్మాణమూ ఒక్కటే కదా? అదీకాక ఈ శరీరం సత్యం కాదు; మాయ. ఈ మాయలో పడి, అభేదమంటూ భేదభావం సృష్టిస్తున్నారా? కాదు, ఆత్మనే తప్పుకో మంటారా? ఐతే యావన్మంది శరీరాల్లోనూ ఉన్న ఆత్మలన్నీ ఒక్కటే కదా? పైగా ఆత్మ సాక్షి మాత్రమే. దేనితోనూ సంబంధం లేదు దానికి. దేని సాంగత్యమూ దాని నంటదు. తాకితే మైలపడిపోతుందా అది?"

శంకరాచార్యులు శాంతభావంతో అన్నీ విన్నాడు. తన శిష్యులు చేసిన తప్పుకి ఎంతో నొచ్చుకున్నాడు. అప్పుడే సుప్రసిద్ధమైన మనీషా పంచకం వ్రాశా డాయన. ఐదు శ్లోకాలవి. చండాలుణ్ణి తన గురువన్నాడు. ఇంత జ్ఞానంకల చండాలుడు నిజంగా శంకరుడి అపరావతారమే అను కోవాలి. చూడండి, ఎంత నిరహంకారమైన స్వభావమో శంకరాచార్యులది! ఎంత తక్కువ వాణ్ణయినా దగ్గరికి తీసుకునే వాడాయన. అతడి దగ్గిర చేర్చుకునేందుకు సిద్ధపడేవాడు. ఆదరించేవాడు. అందుచేతనే అన్నారు- "విద్యా దదాతి వినయమ్" అని.

శంకరాచార్యుల కార్యం ఫలోన్ముఖానికి వస్తోంది. కాశీలో ఇప్పు డాయన సర్వోత్తములైన పండితులలో ఒకడుగా గణింపబడుతున్నాడు. ప్రజల హృదయాల్లో ఆయన చక్రవర్తే అయిపోయా డిప్పుడు. కాశీరాజు కూడా ఆయన శిష్యరికం పుచ్చుకున్నాడు. కాశీలో రాజు మొదలు పేద దాకా యావన్మంది హృదయాలూ ఆక్రమించా డాయన. ఆయన కీర్తి నాలుగు దిక్కులా పాకిపోవడంలో వింతేముంది? ఎందరో శిష్యు లాయన కేర్పడ్డారు. ఆయన తలచుకుంటే వాళ్ళందరినీ దేశంతో విరచల్లి దేశ మంతటా వొకే భావన ప్రచారం చెయ్యవచ్చు. ఒకనాడు తన దిగ్విజయ సంకల్పం వాళ్ళకి వెల్లడించాడు శంకరాచార్యులు. శిష్యబృందం యావత్తూ ఆనందంతో నాట్యంచేసింది. కాని ఆయన మాత్రం శాంత గంభీర ముద్ర వహించాడు; ధ్యానమగ్నుడయాడు.

శంకరాచార్యుల దిగ్విజయ ప్రకటన ఆనోటా ఈనోటా పట్టణమంతా ప్రాకిపోయింది. ఇలాంటి వార్తలు గాలికంటే వేగంగా వ్యాపిస్తాయి. ఆయన సహయోగులు యావన్మందీ ఆయన దగ్గరికి వచ్చేశారు. అలా సమావేశమైనవాళ్ళందరి ఎదటా ఆయన ఇలా అన్నాడు:

స్నేహితులారా! ఇవాళ మనం యావన్మందిమి మన సత్య సిద్ధాంతాలు సర్వత్రా ప్రచారం చెయ్యడానికని తహతహ పడుతున్నాము. గత వెయ్యి సంవత్సరాలలోనూ మన ధర్మానికి విచిత్రమైన గతి పట్టింది. దాని వేళ్ళు తొలిచెయ్యడానికి ఎన్నోరకాల ప్రయత్నాలు జరిగాయి. ఐతే తన సర్వశక్తులూ వినియోగించి, తనమీద పడ్డ దెబ్బలన్నీ సంబాళించుకున్నదది. మన ధర్మానికి లోపలకాని, బైటకాని ఏ మాత్రమూ నష్టం రాలేదు. అందుచేత గర్విస్తున్నాం మనము. ఈ దగ్గరే సారనాథ ముంది. అక్కడే ఒకనాడు బుద్ధభగవానుడు 'ధర్మచక్ర ప్రవర్తనం' చేశాడు. ప్రాచీన సంప్రదాయాల మీద ఔదాసీన్యం వహించి, కొత్తరకం ధర్మం స్థాపించా డాయన. ఆయన అనుయాయులు ఆ ఔదాసీన్యం విరోధం కింద మార్చేశారు. మన దేశ మాక్రమించుకున్న విదేశీయులు ఈ విరోధాన్ని వినియోగించుకున్నారు. దాన్ని అనుసరించారు. మన కీలక స్థానంలో దెబ్బకొట్టి మనల్ని నాశనం చెయ్యడానికి ప్రయత్నించారు. ఐతే అక్షయ హిమాలయ గర్భంలోంచి ప్రవహించిన నదీ ప్రవాహం

వానాకాలంలో ఎంత పొంగితేనేం గాక, చుట్టుపట్ల పొలాలూ అవీ ఎంత ముంచేస్తేనేం గాక - ఎండాకాలం రాగానే ఎండిపోతుంది. ఆ ప్రవాహం ఎల్లప్పుడూ వుండదు. ఆ గొప్పతనం గంగోత్రి నుంచి పుట్టిన గంగా ప్రవాహానికే దక్కింది. ఇవ్వాళ ఒక పక్షంలో వేద విరుద్ధమైన ధర్మం కొనవూపిరితో వుంది. రెండో ప్రక్క హిందూ ధర్మం పునరుద్ధరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ ప్రయత్నాలన్నిటినీ మనం సమన్వయ పరచుకోవాలి. ఐక్యత కుదుర్చుకోవాలి. మన జాతీయ దేవాలయానికి కౌటిల్యుడు పునాదులు వేశాడు. ఋషులూ, మునులూ, చక్రవర్తులూ కవులూ, కళాకారులూ, సాహిత్యకారులూ, స్మృతికర్తలూ, పురాణ రచయితలూ, ధర్మశాస్త్ర ప్రణీతలూ దాని నిర్మాణం సాగిస్తూ వచ్చారు. అదిగో, ఆ దేవాలయంలో మన రాష్ట్ర పురుషుడికి మూర్తి స్థాపించాలి. దాని నభిమంత్రించాలి. ఈ మహాకార్యం చేసే అదృష్టం మనకు దక్కింది అందుకని భగవంతుడికి ధన్యవాదా లర్పించాలి. మన పూర్వుల ప్రగతి మార్గంలో నడిచి మన మీ కార్యం పూర్తి చేయాలి. ఈ దేవాలయానికి మనమే తొలి పూజారులం కావాలి. ముందు రాబోయే తరాలవాళ్ళు ఈ దేవాలయంలో చిరకాలం పూజించగలిగినట్టు కట్టుదిట్టంతో పని చెయ్యాలి. మనం ప్రతిపాదించిన తత్వాలు వేదసమ్మతమైనవి, సత్యమైనవి, శాశ్వత మైనవి, లోక కల్యాణకరమైనవి. ఐతే, ఊరికే తత్వాలు, తర్కమనే త్రాసులో తూచినంత మాత్రాన లాభం లేదు. వాటి సత్యమూ, సౌంద ర్యమూ మనలో మనం చర్చించుకుంటూ ఆనందిస్తూ ఉండినా ప్రయోజనం లేదు. కల్పనా సౌధాలు కట్టుకుని కాలక్షేపం చేసినా ఉపయోగం లేదు. ఆ తత్వాలు వ్యవహారంలో పెట్టినప్పుడే వాటి సార్థకత. మన ధనమూ, దేశమూ, భూమీ, ధర్మమూ రక్షించుకోవడం కోసం మన సందేశం దేశం మూలమూలకూ ఇంటింటికీ అందించాలి. దేశం దుర్దశ చూసి, దీనుల మీదా అనాథుల మీదా కట్టుకట్టి రాక్షసులు సాగిస్తూన్న అత్యాచారాలు

చూసి రెండు కన్నీళ్ళు కార్చడంకంటే ఒళ్ళువంచి కష్టపడాలి. కపటుల నాటకాలను రూపుమాపాలి. దుష్టుల దౌష్ట్యం తొలగించాలి. మన ధైర్యం దగ్గిర దుర్నీతిపరుల దర్పం దగ్ధమైపోతుంది. దుర్మార్గుల ఆటలు సాగి రావు. తామసులయిన దొంగలు కకావికలయిపోతారు. తమ ధర్మంమీద ప్రేమకలవాళ్ళు నాతో రండి. రక్తనాళాల్లో పూర్వుల రక్తం ప్రవహిస్తూన్న వాళ్ళు నాతో రండి. తమ కార్యం మీద శ్రద్ధ కలవాళ్ళు, హృదయంలో ఆత్మవిశ్వాసం వేళ్ళు తన్నిన వాళ్ళు, సముద్రం కెరటాల్లా ఉత్సాహ ముప్పొంగుతూన్న వాళ్ళు నాతో రండి. మానమూ, సన్మానమూ, సుఖమూ, ఆనందమూ వదులుకున్న వాళ్ళు, కష్టాలు వరించినవాళ్ళు దేశం కోసం ధర్మం కోసం నాతో రండి. భగవంతుడి ఆశీర్వాదం మనకుంది. పూర్వుల పుణ్య ప్రతాపమూ; మునుల తపస్తేజమూ, వీరుల బలిదానమూ - ఇవన్నీ మన వెంట వుంటాయి. మనలో విశ్వాసముంది. సఫలత మన మార్గం శుభ్రపరుస్తుంది; ముందు నడుస్తుంది. రండి,బయల్దేరేవాళ్ళు బయల్దేరండి."

శంకరస్వామి శంఖం పూరించాడు. నాలుగు దిక్కులా వాతావరణం గింగురుమంది. కడుపులో చల్ల కదలకుండా కూచున్న సోమరిపోతుల కర్ణ కుహరాలు కూడా ప్రతిధ్వనించాయి. శత్రువుల గుండెలు దడదడలాడాయి. మంచి మంచి వస్తాదులు మతిపోయి కిందా మీదా పడ్డారు. మతాలూ, మతాంతరాలూ మొక్కుబళ్ళు మొక్కడం మొదలు పెట్టాయి. మోసం రెక్కలు తెగిన పక్షిలా విలవిలా కొట్టుకుంది. ఆడంబరం బండారం బైటపడి తెల్లబోయింది. అనేకత్వమూ, వైరుధ్యమూ తమ పాచిక పారక పలాయనం చిత్తగించాయి. భేదభావం తన సుడిలో తానే పల్టీలు కొట్టింది. పిరికితనం భయంతో వణికింది. పారుబోతుతనం పరుగుతీసింది. క్రూరత్వం కొయ్యబారిపోయింది. అదే శంఖధ్వని విని సహయోగుల హృదయాలు వికసించాయి. కర్మయోగులకి బ్రహ్మాస్త్రం దొరికింది. ఊరూ పేరూ లేనివాళ్ళు కూడా గురుమంత్ర ప్రభావంవల్ల

కొమ్ములు తిరిగిన వాళ్ళముందు నువ్వా నేనా అంటూ నుంచున్నారు. సమన్వయత సర్వత్రా వ్యాపించింది. సరళత సర్వాధిపత్యం వహించింది. శాంతి సామ్రాజ్యం స్థాపించింది. స్పష్టత నిర్మొగమాటంగా నడుంకట్టింది. కలుపుగోలుతనం భేదాభిప్రాయాలను హతమార్చింది; స్వేచ్ఛావిహారం చేసింది. శూరత్వం వీరవిహారం సాగించింది. వీరత్వం సింహనాదం చేసింది. దయ చేతికి ఎముక లేకుండా దాన మారంభించింది. అభేదమూ అద్వైతమూ ఆనంద తాండవం చేశాయి.

శంకరాచార్యులు దిగ్విజయ యాత్ర ఆరంభించాడు, కాశీరాజు రతనసింహుడాయన వెంట నడిచాడు. న్యాయమూ, సత్యమూ, వీటికి వెనక అండగా శక్తికూడా అవసరం. ఆయనకి తెలుసు, సత్యంలేని శక్తి గుడ్డిది. అలాగే శక్తిలేని సత్యం కుంటిది. క్షమాజనని భారత భూమిలో జీవనమంటే భయం కానీ, వ్యామోహంకానీ లేదాయనకి. కానైతే భారతదేశమంతటా ప్రజాందోళన సాగించడానికి బయలుదేరుతున్నా డాయన. అంచేత ప్రజల్ని రక్షించడం కోసం, వాళ్ళని ప్రభావితుల్ని చేయడంకోసం కొంత పటాటోపమూ అవసరమే. తన ఉద్యమం సఫలం కావడం కోసమే శంకరాచార్యులు ఈ పటాటోపం జత పరిచాడు. సాధన సామగ్రి యావత్తూ కుదుర్చుకున్నాడు. కాని స్వయంగా ఆయన మాత్రం వాటికి దూరంగానే వున్నాడు. ఛత్ర చామరాలతోనూ, అస్త్ర శస్త్రాలతోనూ ఆయనకి ప్రమేయమేముంది గనుక! వైరాగ్యమే ఆయన కవచం. జ్ఞానమే డాలు. ప్రస్థానత్రయమే శస్త్రాలు. శిష్యబృందమే సైన్యం. ఈ సైన్యం గంగానది ఒడ్డంబడే పాడుతూ బయల్దేరింది—

భగవతి తవ తీరే నీరమాత్రాశనోఽహం
విగత విషయతృష్ణః కృష్ణ మారాధయామి,
సకలకలుషభంగే స్వర్గసోపానసంగే
తరళతరతరంగే దేవి గంగే ప్రసీద. ౧

భగవతి భవలీలామౌళిమాలే తవాంభః
కణ మణుపరిమాణం ప్రాణినో యే స్పృశంతి
అమరనగరనారీ చామరగ్రాహిణీనాం
విగత కలికలంకాతంక మంకే లుఠంతి. ౨

బ్రహ్మాండం ఖండయంతీ హరశిరసి జటావల్లి ముల్లాసయంతీ,
స్వర్లోకాదాపతంతీ కనకగిరిగుహాగండ శైలాత్స్ఖలంతి,
క్షోణీపృష్ఠే లుఠంతీ దురిత చయచమూర్నిర్భరంభర్త్సయంతీ
పాథోధీం పూరయంతీ సురనగరసరిత్పావనీ నః పునాతు. ౩

మజ్జన్మాతంగకుంభచ్యుతమదమదిరామోదమత్తాలిజాలం
స్నానైఃసిద్ధాంగనానాంకుచయుగలిగలత్కుంకుమాసంగపింగమ్
సాయం ప్రాత ర్మునీనాం కుశకుసుమచయైశ్ఛన్న తీరస్థనీరం
పాయన్నో గాంగకుంభః కరికలభకరాక్రాంతరంహ స్తరంగమ్. ౪

ఆదా వాది పితామహస్య నియమ వ్యాపార పాత్రే జలం,
పశ్చా త్పన్నగశాయినో భగవతః పాదోదక పావనం
భూయః శంభుజటావిభూషణమణి ర్జహ్నో ర్మహర్షే రియం
కన్యా కల్మషనాశనీ భగవతీ భాగీరథీ భూతలే. ౫.

శైలేంద్రాదవతారణీ నిజజలే మజ్జజ్జనోత్తారిణీ
పారావార విహారిణీ భవభయశ్రేణీ సముత్సారిణీ
శేషాంగై రనుకారిణీ హరశిరోవల్లీదలాకారిణీ,
కాశీప్రాంతవిహారిణీ విజయతే గంగా మనోహారిణీ. ౬

కుతోఽవీచిర్వీచి స్తవ యది గతా లోచనపథం
త్వయా పీతా పీతాంబరపురనివాసం వితరసి
త్వదుత్సంగే గంగే పతతి యది కాయ స్తనుభృతాం
తదా మాతః శాతక్రతవపదలాభోఽప్యతిలఘుః. ౭.

గంగే త్రైలోక్యసారే సకలసురవధూధౌత విస్తీర్ణతోయే
పూర్ణబ్రహ్మస్వరూపే హరిచరణరజోహారిణి స్వర్గమార్గే
ప్రాయశ్చిత్తంయదిస్యాత్తవజలకణికా బ్రహ్మహత్యాదిపాపే
కస్త్వాం స్తోతుం సమర్థస్త్రిజగదఘహరే దేవి గంగే ప్రసీద. ౮

మామాతః శాంభవి శంభుసంగమిళితే మౌళౌ నిధాయాంజలిం
త్వత్తీరే వపుషోఽవసానసమయే నారాయణాంఘ్రిద్వయమ్
సానందం స్మరతో భవిష్యతి మమ ప్రాణప్రయాణోత్సవో
భూయా ద్భక్తి రవిచ్యుతాహరిహరాద్వైతాత్మికాశాశ్వతీ. ౯

గంగాష్టక మిదం పుణ్యం యః పఠే త్ప్రయతోనరః
సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి. ౧౦

గంగఒడ్డంబడే పడి ఈ తరుణ తాపసుల దండు ఉత్తరాది కేసి వెళ్ళింది. అలా శంకరాచార్యులు ఎగువకి వెళ్ళడంలో, బహుశా జాతీయ భాగీరథి పుట్టుకని పూర్వ చరిత్రతో సంబంధం స్థాపించాలని ఆయన అభిప్రాయమేమో! దారిలో, ఊరూరా జనం ఆయన దర్శనం కోసం వచ్చేవాళ్ళు; ఆయన ఉపదేశామృతం పానం చేసేవాళ్ళు; తృప్తిపడేవాళ్ళు. శైవులు ఆయనను సాక్షాత్తూ శంకరుడి అవతార మన్నారు. వైష్ణవులు ఆయనలో విష్ణువు అంశ దర్శించారు. యావన్మంది దేవతలూ ఒకే పరబ్రహ్మయొక్క భిన్న భిన్న స్వరూపాలని ఆయన బోధించేవాడు. రామేశ్వరంలో శివప్రతిష్ఠ చేసి, శివోపాసన చేసి, సముద్రంలాంటి లంకా పట్నం జయించిన శ్రీరామచంద్రమూర్తికీ, రామనామం జపిస్తూ హాలా హలం పానం చేసిన శివుడికీ విరోధ మెక్కడుంది? సతీదేవి మృతదేహం భుజాల మీద వేసుకుని భారత సంచారం చేసిన శివుడికి, రెండో జన్మలో శివుణ్ణి వరించాలన్న కోరికతో ఘోరమైన తపస్సు చేసిన పార్వతీదేవికి అంతరమేముంది? వీరంతా వొక్కటే. ఎవడు వైష్ణవుడో వాడే శివుడు; వాడే శాక్తేయుడు. ఒకడి పూజ రెండోవాడికి విరోధమా? ఏమిటి?అందుచేత అక్కడక్కడ పంచాయతన పూజ చేయాలని ఆదేశించా డాయన. ఆ అయిదు మూర్తులలోనూ ఎవరి ఇష్టదైవాన్ని వారు మధ్య స్థాపించుకో

వచ్చు. అందులో ఒక దైవం పెద్దనీ ఒక దైవం చిన్ననీ భేదం లేదు. శివభక్తుడు విష్ణుపూజ చెయ్యవచ్చు. పరమవైష్ణవుడు శివపూజ చెయ్యవచ్చు. ఇదే గ్రామవాసులకి ఆయన ఇచ్చిన సందేశం. ఆయన సందేశం గ్రామ గ్రామాల ప్రజలు శ్రద్ధతో విన్నారు. అవగతం చేసుకున్నారు. ఆయన మాటలకి అద్భుతమైన ప్రభావముండేది. నోట వెలువడడమే తడవు - శ్రోతల హృదయాలలో నాటుకునేవవి. శాశ్వతమైన ముద్ర వేసేవి.

సాయంకాలమయ్యేది. ఆకాశం సింధూరం పూసుకునేది. దినమంతా అలిసిపోయిన సూర్యుడు నిద్రకని వెళ్ళిపోయేవాడు. శంకరాచార్యుల శిష్యులు గంగవొడ్డున కూర్చునేవాళ్ళు. యావన్మందీ కాలకృత్యాలు తీర్చు కునేవాళ్ళు. శాంతి భంగమవుతుందేమో అని చల్లగాలి కూడా భయపడేది. నిశ్శబ్దంగా నిలబడిపోయేది. ఈ నిశ్చల వాతావరణంలో వాళ్ళ కల్పనా నేత్రాలకి ఎన్నో దృశ్యాలు కనపడేవి. మాసిపోయేవి. జగత్తుకు గురువైన భారతభూమి భవ్యమూర్తి, కళ్ళముందు ప్రత్యక్షమయ్యేది. సమస్వరంతో ప్రపంచానికి శాంతి, క్షమ, సమన్వయమూ తాము బోధిస్తున్నట్లు అని పించేది. మెల్లిమెల్లిగా గంగానది వాళ్ళచెవిలో ఏదో వూదేది. బహుశా గత దినాల చరిత్ర - భాంశివులూ, గుప్తులూ ఆతతాయులయిన విద్వేషి యుల్ని తరిమివేసి, తమ ఒడ్డున యజ్ఞాలు చేసిన వైనం చెప్పేది కామోసు! గంగమ్మనే వాళ్ళు తమ రాజ చిహ్నంగా చేసుకున్నారు. ఏమంటే, కుళ్ళు కాలవలు కూడా తనలో కలుపుకొని పవిత్రం చేసే శక్తి గంగమ్మ తల్లికే వుంది. అందుచేత భారతదేశానికి గంగానదే తగిన గురుతు. భారత చరిత్రకు అదే ప్రతిమూర్తి. దాని జ్ఞానానికి అదే జనని. దాని సంస్కృతికి అదే దోహదం.

శంకరాచార్యులు శిష్యులకి గుప్త సామ్రాట్టుల స్వర్ణయుగంనాటి విషయాలు వినిపించేవాడు. అనేక ప్రవృత్తులు బోధించేవాడు. చారిత్రక విషయాలు చర్చించేవాడు. శకులా, హూణులా పాశవత్వంనుంచి ముక్తి పొందడానికి హిందూధర్మ మెలా పెనుగులాడిందో వివరించేవాడు. ఆ

యుగంలో జాతీయ వీరులు అవసరమైతే అన్నీ వదిలేసి 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అనే సిద్ధాంతంకూడా మరచారా అన్నట్లు హిందూ ధర్మ మొక్కదాన్నే వృద్ధిచెయ్యడమే తమ జాతీయ కర్తవ్యమని ఏ విధంగా భావించేవారో విశదపరిచేవాడు. ఈ పవిత్ర చరిత్ర తెలుసుకోవడంకోసం, పురాణాల ప్రవచనం వినడంకోసం సప్తర్షులు నీలాకాశంనించి దిగివచ్చే వారు. గంగాజలంలో కూచునేవారు, ఉండివుండి ఆనందధ్వని చేసేవారు. అప్పుడు గంగాజలం కలకలమని లేచేది. చేపలు చెంగున పైకి గెంతేవి; లోపల మునిగిపోయేవి. ఆచార్యుల ప్రసంగం ముగిసేది. శిష్యులు నిద్ర పోయేవాళ్ళు. కాని ఋషులు మాత్ర మక్కడే గంగాజలాల్లో కూచుని వుండేవాళ్ళు. రాత్రంతా ఆలోచించేవాళ్ళు. తెలతెలవారేసరికి శంకరా చార్యుల చర్యలు సమ్మతిస్తూ తమ నివేశానికి వెళ్ళిపోయేవాళ్ళు. శంకరా చార్యులు తన పరివారంతో ముందుకి సాగేవాడు. సూర్యు డాయన వెను వెంట నడిచేవాడు. నిజమే, ఆచార్యుల కెదురు నడిచి అపరాధమెలా చేస్తా డతడు? అందుకనే మధ్యాహ్నమప్పుడు ఆచార్యులు చెట్లనీడని ఆగిపోయే వాడు. సూర్యుడి పనిలో బాధ కలగకుండా ఆతడికి దారి వదిలిపెట్టేసే వాడు. చెట్లు చుట్టూ వున్న నీడని ఒడిసిపట్టేవి. ఆచార్యుల పాదాలమీద అర్పించేవి. ఇది శంకరాచార్యుల దైనిక కృత్యం. ఆయనలా వెళ్ళిన కొద్దీ శిష్యుల సంఖ్య పెరుగుతూ వుండేది.

కాశీనుంచి శంకరాచార్యులు చరణాద్రిగడం చేరాడు. అక్కడే వింధ్య పర్వతం స్నానానికి గంగలో దిగుతుంది. అగస్త్యులవారి ఆజ్ఞ ప్రకారం తల వంచిన మహాపర్వతమది. ఉత్తర దక్షిణాల సమ్మేళన కర్త అగస్త్య మహర్షి. ఆయన పాదాలు ముద్దుపెట్టుకుని గంగమ్మ తల్లికూడా ధన్యత నాపాదించుకుంటుంది. [illegible]డికి రాజ్యమిచ్చేసి, లోక కళ్యాణార్థం సన్యాసం పుచ్చుకున్న భర్తృ[illegible]గలో తలంచుకున్నాడు శంకరాచార్యులు. భక్తితో తల వంచాడు. అ[illegible]గునా ప్ర[illegible] శిష్యసమేతంగా ప్రయాగ చేరుకున్నా డాయన. కాశీని[illegible]యింది. భా[illegible]క ప్రయాగే ఆయన కొన్ని దినాలాగిన మొదటి స్థలం. ప్రతిష్ఠించిన [illegible]

వచ్చు. అందులో ఒక దైవం పెద్దనీ ఒక దైవం చిన్ననీ భేదం లేదు. శివభక్తుడు విష్ణుపూజ చెయ్యవచ్చు. పరమవైష్ణవుడు శివపూజ చెయ్యవచ్చు. ఇదే గ్రామవాసులకి ఆయన ఇచ్చిన సందేశం. ఆయన సందేశం గ్రామ గ్రామాల ప్రజలు శ్రద్ధతో విన్నారు. అవగతం చేసుకున్నారు. ఆయన మాటలకి అద్భుతమైన ప్రభావముండేది. నోట వెలువడడమే తడవు. శ్రోతల హృదయాలలో నాటుకునేవవి. శాశ్వతమైన ముద్ర వేసేవి.

సాయంకాలమయ్యేది. ఆకాశం సిందూరం పూసుకునేది. దినమంతా అలిసిపోయిన సూర్యుడు నిద్రకని వెళ్ళిపోయేవాడు. శంకరాచార్యుల శిష్యులు గంగవొడ్డున కూర్చునేవాళ్ళు. యావన్మందీ కాలకృత్యాలు తీర్చుకునేవాళ్ళు. శాంతి భంగమవుతుందేమో అని చల్లగాలి కూడా భయపడేది. నిశ్శబ్దంగా నిలబడిపోయేది. ఈ నిశ్చల వాతావరణంలో వాళ్ళ కల్పనా నేత్రాలకి ఎన్నో దృశ్యాలు కనపడేవి. మాసిపోయేవి. జగత్తుకు గురువైన భారతభూమి భవ్యమూర్తి, కళ్ళముందు ప్రత్యక్షమయ్యేది. సమస్వరశ్రుతో ప్రపంచానికి శాంతి, క్షమ, సమన్వయమూ తాము బోధిస్తున్నట్లు అనిపించేది. మెల్లిమెల్లిగా గంగానది వాళ్ళచెవిలో ఏదో వూదేది. బహూశా గత దినాల చరిత్ర - భాంశివులూ, గుప్తులూ ఆతతాయులయిన విదేశీయుల్ని తరిమివేసి, తమ ఒడ్డున యజ్ఞాలు చేసిన వైనం చెప్పేది కామోసు! గంగమ్మనే వాళ్ళు తమ రాజచిహ్నంగా చేసుకున్నారు. ఏమంటే, కుళ్ళు కాలవలు కూడా తనలో కలుపుకొని పవిత్రం చేసే శక్తి గంగమ్మ తల్లికే వుంది. అందుచేత భారతదేశానికి గంగానదే తగిన గురుతు. భారత చరిత్రకు అదే ప్రతిమూర్తి. దాని జ్ఞానానికి అదే జనని. దాని సంస్కృతికి అదే దోహదం.

శంకరాచార్యులు శిష్యులకి గుప్త సామ్రాట్టుల స్వర్ణయుగంనాటి విషయాలు వినిపించేవాడు. అనేక ప్రవృత్తులు బోధించేవాడు. చారిత్రక విషయాలు చర్చించేవాడు. శకులా, హూణులా పాశవత్వంనుంచి ముక్తి పొందడానికి హిందూధర్మ మెలా పెనుగులాడిందో వివరించేవాడు. ఆ

యుగంలో జాతీయ వీరులు అవసరమైతే అన్నీ వదిలేసి 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అనే సిద్ధాంతంకూడా మరచారా అన్నట్లు హిందూ ధర్మ మొక్కడాన్నే వృద్ధిచెయ్యడమే తమ జాతీయ కర్తవ్యమని ఏ విధంగా భావించేవారో విశదపరిచేవాడు. ఈ పవిత్ర చరిత్ర తెలుసుకోవడంకోసం, పురాణాల ప్రవచనం వినడంకోసం సప్తర్షులు నీలాకాశంనించి దిగివచ్చే వారు. గంగాజలంలో కూచునేవారు, ఉండివుండి ఆనందధ్వని చేసేవారు. అప్పుడు గంగాజలం కలకలమని లేచేది. చేపలు చెంగున పైకి గెంతేవి; లోపల మునిగిపోయేవి. ఆచార్యుల ప్రసంగం ముగిసేది. శిష్యులు నిద్ర పోయేవాళ్ళు. కాని ఋషులు మాత్ర మక్కడే గంగాజలాల్లో కూచుని వుండేవాళ్ళు. రాత్రంతా ఆలోచించేవాళ్ళు. తెలతెలవారేసరికి శంకరా చార్యుల చర్యలు సమ్మతిస్తూ తమ నివేశానికి వెళ్ళిపోయేవాళ్ళు. శంకరా చార్యులు తన పరివారంతో ముందుకి సాగేవాడు. సూర్యు డాయన వెను వెంట నడిచేవాడు. నిజమే, ఆచార్యుల కెదురు నడిచి అపరాధమెలా చేస్తా డతడు? అందుకనే మధ్యాహ్నమప్పుడు ఆచార్యులు చెట్లనీడని ఆగిపోయే వాడు. సూర్యుడి పనిలో బాధ కలగకుండా అతడికి దారి వదిలిపెట్టేసే వాడు. చెట్లు చుట్టూ వున్న నీడని ఒడిసిపట్టేవి. ఆచార్యుల పాదాలమీద అర్పించేవి. ఇది శంకరాచార్యుల దైనిక కృత్యం. ఆయనలా వెళ్ళిన కొద్దీ శిష్యుల సంఖ్య పెరుగుతూ వుండేది.

కాశీనుంచి శంకరాచార్యులు చరణాద్రిగడం చేరాడు. అక్కడే వింధ్య పర్వతం స్నానానికి గంగలో దిగుతుంది. అగస్త్యులవారి ఆజ్ఞ ప్రకారం తల వంచిన మహాపర్వతమది. ఉత్తర దక్షిణాల సమ్మేళన కర్త అగస్త్య మహర్షి. ఆయన పాదాలు ముద్దుపెట్టుకుని గంగమ్మ తల్లికూడా ధన్యత నాపాదించుకుంటుంది. తమ్ముడికి రాజ్యమిచ్చేసి, లోక కళ్యాణార్థం సన్యాసం పుచ్చుకున్న భర్తృహరిని తలంచుకున్నాడు శంకరాచార్యులు. భక్తితో తల వంచాడు. అక్కడినించి శిష్యసమేతంగా ప్రయాగ చేరు కున్నా డాయన. కాశీనించి బయలుదేరాక ప్రయాగే ఆయన కొన్ని దినా లాగిన మొదటి స్థలం.

ప్రతిపాదించేవాళ్లు. అవి సులువుగా దేశమంతటా వ్యాపించేవి. మన ఆర్థిక జీవనం మీద పడే ఈ మేలాల ప్రభావం సహజంగానే వ్యక్త మవుతుంది.

అవాళ మాఘమాసం, అమావాస్య. నేటికి కూడా యాత్రికులు ఆనాడు వచ్చి గంగలో స్నానమాడతారు. పుణ్యాత్ముల మహిమని భావిస్తూ ఇళ్ళకి వెళతారు. అంతేకాదు; ఆ మేలా దినాల్లో సాధువుల దర్శనం చేస్తారు. వాళ్ళ ఉపదేశాలు వింటారు. హృదయాలు కూడా స్నానం చేయించుకుని పునీతులవుతారు. అలా ఏడాది కేడాది వచ్చి యాత్రికులు ధన్యులవుతారు. ఏడాది పొడుగునా తమ కంటిన కల్మషం కడిగేసుకుంటారు. మేలా దినాల్లో పితృ తర్పణాలు చేస్తారు. అవే నిజమైన పితృ తర్పణాలన్నమాట! ఆవాళ రెండు దోసిళ్ళ నీళ్లు మాత్రం పితరుల కర్పించడం కాదు; హృదయమే పితరుల కర్పించినట్టు. పూర్వుల స్మృతి నిలపడమూ, వారి సంప్రదాయం ముందుకి సాగనివ్వడమూ, వారి ధర్మమూ, విజ్ఞానమూ మొదలయిన క్షేత్రాలలో జరిగిన ప్రగతి వృద్ధి చేయడమూ, వారి ఆదర్శాలు రక్షిస్తూ జీవనం గడపడమూ- ఇదే పితృతర్పణము తాలూకు నిజమైన ఉద్దేశం. మేలాలో చేసిన పితృ తర్పణంవల్ల తర్పణంయొక్క నిజమైన ఉద్దేశం సిద్ధించిందన్నమాట! ఏమంటే, ఆవాళ శంకరాచార్యులు పూర్వపు ఋషుల ఆత్మలను సాక్షాత్కరింపచేశాడు.

మాఘ మేలా ముగిసింది. కాని శంకరాచార్యు లక్కడ కొన్నాళ్ళాగాడు. పర్వం ముగిసినా త్రివేణీ సంగమం దగ్గిర ముగిసి భారద్వాజాశ్రమం దగ్గిరికి వెలిసింది. ప్రయాగలో ప్రతి అడుగునేలా పవిత్రమైనదే. ఎంచేతంటే, అక్కడ అడుగడుగునా ప్రజాపతి బ్రహ్మ యజ్ఞాలు చేశాడు. అందుచేతే అది ప్రయాగ అయింది. భారద్వాజాశ్రమం మరింత పవిత్రమైనది. నాలుగు వేదాలూ ప్రతిష్ఠించిన బ్రహ్మదేవుడి నోటినుంచీ, అతడి

ప్రతినిధి స్వరూపులయిన ఎంతో మంది కులపతుల, ఆచార్యుల, వేదజ్ఞుల నోళ్ళనుంచీ శ్రుతి స్వరూప సరస్వతీ ప్రవాహం అక్కడే ప్రవహించేది. ఆ సరస్వతీ ప్రవాహంలో ఎంతో మంది బ్రహ్మచారులు స్నానమాడేవాళ్ళు; పవిత్రులయేవాళ్ళు; పుణ్యమూ, పురుషార్థమూ సాధించే వారు. ఈ భారద్వాజాశ్రమంలోనే గొప్ప విశ్వవిద్యాలయముండేది. వేల కొద్దీ విద్యార్థు లక్కడ విద్యాభ్యాసం చేసేవాళ్లు. శ్రీరామచంద్రమూర్తి పాదధూళితో పవిత్రమైన ఆశ్రమమది. భారద్వాజాశ్రమ మహత్వం బౌద్ధ యుగంలో తగ్గుతూ వచ్చింది. ఇప్పటిలాగే ఆ దినాల్లో అక్కడ సరస్వతి లోపించి పోయింది. శంకరాచార్యులు మళ్ళీ ఒకసారి అక్కడ సరస్వతిని ప్రవహింపజేశాడు. వేదాంత సూత్రా లక్కడ చదివించడ మారంభించా డాయన. సూత్రాల భాష్యమూ, వాటి విశదీకరణమూ నిరంతరం సాగింది. నిర్మలమూ, జ్ఞానమయమూ అయిన ఆ సరస్వతీ ప్రవాహంలో స్నాన మాడేందుకు వేలకొద్దీ జనం గుమికూడారు దూరదూరాలనుంచి వేదాంత జిజ్ఞాసువులు రావడం మొదలుపెట్టారు. ఎంతో మంది విరోధులు కూడా శంకరాచార్యులతో తర్కించడానికి వచ్చేవాళ్ళక్కడికి. చివరి కాయన శిష్యరికం స్వీకరించి అక్కడే వుండిపోయేవాళ్ళు. తర్కమూ, శాస్త్ర చర్చా అన్న మాటలు విని ఏదో రాద్ధాంత సిద్ధాంతం జరిగేదేమో అని అనుకోవచ్చు మీరు. కాని శంకరాచార్యుల పద్ధతి అదికాదు. అలాంటి పద్ధతికి ఎంతో దూరం తొలిగిపోయేవా డాయన. తన జ్ఞానంతో తర్కం ప్రయోగించి ఎదుటివాడి నోరు మూయించినా, అతడు తనవాడయిపోడు. తర్కంవల్ల మనిషి పీగిపోవచ్చు, కాని స్నేహితుడు కాడు. పైగా శత్రు వయితే కావచ్చు. తర్కంకోసమే తర్కించేసేవాళ్ళతో ఆయన మాట్లాడే వాడుకాడు. కాని దేశమూ ధర్మమూ ప్రేమించేవాళ్ళ నిజమైన సందేహా లన్నిటికీ మాత్రం సమాధానాలు చెప్పేవాడు. తన యోగ్యతా, రుజువర్త నమూ, మనోదృఢత్వమూ, నిస్వార్థతా—వీటన్నిటి ప్రభావమూ వాళ్ళమీద వేయడానికి ఎంతోకాలం పట్టేదికా దాయనకు. ఇలా ఆయన శిష్యకోటి అనుదినమూ పెరుగుతూ వచ్చింది. శంకరాచార్యుల అలౌకికమైన జ్ఞాన

ప్రభతో ప్రయాగక్షేత్రం వెలిగిపోయింది. అంతటితో సరిపోలేదు; స్నేహ స్నిగ్ధమైన ఆయన హృదయం రసధారలో రసవంతమున్నూ అయి పులకరించింది.

ఒకనాడు ఆయన శిష్యు డొకడు అక్షయవటం చూసేందుకు వెళ్లాడు. ఈ వటవృక్షం సృష్ట్యాదినుంచీ అక్కడవుంది. ప్రళయకాలమపుడు సృష్టి యావత్తూ నాశనమైపోయినా కూడా అది అలాగే నిలబడివుంది. ప్రళయ మప్పుడు మార్కండేయముని దీనినే ఆశ్రయించాడు.* ఆ వటవృక్షం క్రింద ఒక కుష్ఠరోగి బాధపడుతూ వుండడం చూశాడు శిష్యుడు. ఆ రోగి శరీరం యావత్తూ తెల్లబడిపోయివుంది. కళ్లల్లో వెలుగులేదు. దృష్టి నశించిపోయింది బ్రతుకు నిరాశ చేసుకున్నాడతడు ఆత్మహత్యకి సిద్ధపడుతున్నాడు. చివరి క్షణంలో శిష్యుడు కాపాడా డతణ్ణి. ఆత్మహత్య మానిపించాడు. తన గురువు దగ్గరికి తీసుకువచ్చాడు. చూసీ చూడడంతోనే ఆచార్యు లతణ్ణి నయం చేసేస్తాడని అతడి నమ్మకం. కుష్ఠరోగిని చూశారు జనం. దూరం తప్పుకున్నారు. శిష్యుణ్ణి తిట్టారు. కాని ఆచార్యులు మాత్రం ఆనందించాడు. కుష్ఠరోగిని దగ్గిర చేర్చుకున్నాడు. స్వయంగా అతడికి సేవచేశాడు. మందూ మాకూ ఇచ్చాడు మహాపురుషుడి చేతిచలవ- కుష్ఠరోగి రోగం నయమై పోయింది. క్రమంగా మీది మచ్చలూ మాయమయాయి. శంకరాచార్యు లతడి ప్రాణంలో ప్రాణం పెట్టి బతికించాడు. అతడికి ఉదంకుడని పేరు పెట్టాడు. తన శిష్యకోటిలో చేర్చుకున్నాడు. తన సమాజంలోంచి దూరమై

---

* ప్రయాగకోటలో ఇప్పుడు కూడా ఈ అక్షయవటం చూడవచ్చు. ఐతే దీని మొండెం మాత్రమే వుందిప్పుడు. అక్బరు దీనిని తెగ గొట్టించాడు. జహంగీరు దీనిని నరికించి, మరుగుతూన్న నూనె దీని మీద పోయించాడు. కాని అక్షయమైన హిందూసంఘం లాగే ఈ అక్షయవటం ఎంత నరికితే అంత చివురు పెడుతూనే వుంది!

పోయిన ఒకవ్యక్తి గురించి శంకరాచార్యుల హృదయంలో ఎంత ప్రేమా ఎంత సౌహార్ద్రమూ ఉందో, చూడండి! అంచేతనే ఆయనదే అయిపోయింది సమాజం. సమాజానికాయన సేవకుడైతే, సమాజం ఆయన్ని సేవించి ధన్యమైంది.

ప్రయాగలో ఉన్నప్పుడే ఆయన కవితలు యమునాకష్టకమూ, ప్రయాగాష్టకమూ, మాధవాష్టకమూ, లక్ష్మీనృసింహ పంచరత్నాలూ, వేదహర శివస్తోత్రమూ బైటికి వచ్చాయి. ప్రయాగాష్టకమూ, యమునాష్టకమూలోని ప్రతీ అక్షరమూ ప్రయాగమీదా, యమునమీదా ఆయనకున్న భక్తిని వెల్లడి చేస్తుంది. ఈ అష్టకాలు చదివితే మనలో ఒదిగివున్న ప్రాచీన స్మృతులు ఒక్కసారి మేలుకుంటాయి. హృదయం స్వాభిమానంతోనూ, శ్రద్ధాభక్తులతోనూ నిండిపోతుంది.

ప్రయాగలో శంకరాచార్య లోక విజయం సాధించాడు. అది వర్ణించడం వదిలిపెట్టేస్తే ఆయన ప్రయాగ యాత్ర అసంపూర్తిగా ఉండిపోతుంది. ఈ విజయ మాయన ప్రతిష్ఠానపురంనుంచి వచ్చిన ప్రభాకరాచార్యుడిమీద సాధించాడు. ప్రతిష్ఠానపురం* గంగదాపలి ఒడ్డునవుంది. పూర్వమిది చంద్రవంశం రాజుల రాజధానిగా ఉండేది. ప్రభాకరాచార్యులు ప్రతిష్టానపురంలో కుమారిలభట్టు శిష్యుడు. పేరుకేమో అతడు కుమారిలభట్టు శిష్యుడే కాని, కర్మకాండలో కొత్త పద్ధతి స్థాపించాడు. కర్మకాండే తన జీవన సర్వస్వమని భావించే వాడతడు. శంకరాచార్యులు స్వయంగా అతడి దగ్గిరకు వెళ్ళాడు. అంత మహాపురుషుడు తన దగ్గిరకు రావడంతోనే విరగబడిపోయాడు ప్రభాకరాచార్యులు. కిందా మీదా కనిపించలేదతనికి. శంకరాచార్యులు వంటి మహనీయులు తన దగ్గరికి రావడంతోనే

---

* ఇవాళ కూడా ప్రతిష్ఠానపురం శిథిలావస్థలో అవుపిస్తుంది. దానిని ఝూఁసీ అంటారిప్పుడు. ఎప్పుడో ఇది పరశురామప్రీతి అయిపోయింది. అంచేత ప్రతిష్ఠానపురమన్న పేరు మారిపోయి ఝూఁసీ అయిపోయింది.

‘‘నేనూ ఒక మహాపురుషుణ్ణే’’ అనుకున్నా డతను. ‘‘నా దగ్గరికి రానే వచ్చాడీయన. ఇప్పు డీయనని ఓడించేస్తాను. శిష్య సమేతంగా నా మతంలో కలిపేసుకుంటాను’’ అంటూ ఉప్పొంగిపోయాడు. కాని సముద్రానికి వెళ్ళిన ప్రతి నదీ సముద్రమే అయిపోతుంది. శంకరాచార్యుల్ని ఓడిస్తానని బయలుదేరాడు ప్రభాకరాచార్యుడు, తానే ఆయన దగ్గర ఓడిపోయాడు. ఆయన శిష్యరికం పుచ్చుకున్నాడు. అతడే కాదు - అతడి అగ్రహారం యావత్తూ శంకచారార్యుల మతం పుచ్చుకున్నారు.

ప్రభాకరాచార్యుణ్ణి గెలవడంలో శంకరాచార్యునికి తన జ్ఞానమే కాకుండా మరో సంఘటన కూడా సహాయపడింది. ప్రభాకరుడి జీవనంతో సంబంధముంది దానికి. ప్రభాకరుడి కొక కుమారు డుండేవాడు. అతడి పేరు పృథ్వీధరుడు. ఐదేళ్ళ ప్రాయం నుంచీ అతడు మాటామంతీ మానేశాడు. ధ్యానమగ్నుడైన యోగీశ్వరుడిలాగ కదలకుండా మెదలకుండా కూచునే ఉండేవాడు. ప్రభాకరు డెన్నో ప్రయత్నాలు చేశాడు. మందులూ మాకులూ ఇప్పించాడు. లాభం లేకపోయింది. పృథ్వీధరుణ్ణి శంకరాచార్యులు చూశాడు. జ్ఞానంలోనూ తెలివితేటల్లోను లోపంలే దతడికి. అయినా పిచ్చివాడిలా ఉన్నాడు. తనలో సుప్తావస్థలో ఉన్న భావాలు ప్రకటించడాని కతడికి అవకాశం లేకపోవడమే దానికి కారణం. ప్రేమతో లాలించి అతడితో మాట్లాడేవాళ్ళు లేకపోయారు. అతణ్ణి తెలుసుకునేంమ కెవళ్లూ ప్రయత్నించలేదు. శంకరాచార్యు లతణ్ణి ఆదరించాడు. లాలించి మాట్లాడాడు. ప్రేమంటే ప్రాణం పెడతారు కుర్రాళ్ళు. హృదయం గుర్తించగలరు వాళ్ళు. పృథ్వీధరుడు శంకరాచార్యుల దగ్గరికి వచ్చేశాడు. ఆయన నెమ్మది నెమ్మదిగా ప్రశ్నించాడు. అతడి మనసులోని మాట బైటికి లాగేశాడు. తెలిసిపోయింది. పృథ్వీధరుడి హృదయంలో వేదాంత సిద్ధాంతాలు ముందే తిష్టవేసి కూచున్నాయి. ఘోరమైన కర్మకాండ జరుగుతూవున్న ఇంట్లో అతడికి శాంతి ఎలా వుంటుంది? శంకరా

చార్యుల దగ్గర హృదయశాంతి పొందా డతడు. శంకరాచార్యులు శిష్య కోటిలో చేర్చుకున్నాడతణ్ణి. అతడికి హస్తామలకుడని పేరు పెట్టాడు. ఏమంటే, జ్ఞానం కరతలామలకంగా (అరిచేతి ఉసిరికాయలా) వుండే దతడికి.

ప్రతిష్ఠానపురం ప్రభాకరాచార్యుల్ని తన శిష్యుల్లో కలుపుకుని శంకరాచార్యులు పూర్వ మీమాంసకులలో ఒక వర్గాన్ని తనలో కలిపేసు కున్నాడు. అయినా ఇంకా ఎంతోమంది మిగిలిపోయారు. ఈ వర్గంలో ఒక విశేషముండేది. వీళ్ళలో తమ ప్రాచీన పరంపరమీద ఆదరణ ఉండేది. వేదాలమీద చలించని శ్రద్ధ ఉండేది. దేశంమీద భక్తి, ధర్మం మీద నిష్ఠా ఉండేవి. కుమారిలభట్టు వీళ్ళ గురువు. వైదిక ధర్మం పున రుద్ధరించడంకోసం ప్రాణాలొడ్డినవాడు కుమారిలభట్టు. ఈనాటికి కూడా ఈయన స్మృతి ప్రయాగలో సజీవంగా ఉంది. శంకరాచార్యునికి బాగా తెలుసు- కుమారిలభట్టే కీకారణ్యం బాగుచేసి తనకోసం రాచబాట వేశాడు. బంగాళమూ, బీహార్, మధ్యదేశమూ, శూరసేనమూ మొదలైన ప్రాంతాల నుంచి బౌద్ధమతం తొలగించిన కీర్తి ఎవరికయినా దక్కిందంటే కుమారిలభట్టుకే దక్కింది. అతడి ప్రయత్నంవల్లే ఆ చుట్టుపట్ల వైదిక ధర్మం సన్మానం పొందింది. అయితే అప్పటి వైదికధర్మం ప్రజల ధర్మం కాలేకపోయింది. గత శతాబ్దాల్లో జరిగిన సంస్కారాలు ఎంత గంభీరంగా నాటుకున్నాయంటే - వాటిని తొలగించడం అసాధ్యమై పోయింది. శంకరాచార్యులు ఈ విషయమే ఆలోచిస్తూ హటాత్తుగా అన్నాడు—"కుమారిలభట్టుకూడా ఉంటేనా!" అద్వితీయమైన విద్వాంసుడు కుమారిలభట్టు. అధికమైన పరిశ్రమ చేసేవాడు. అలాంటివాడు శంకరా చార్యునికి కుడిభుజంలా ఉంటే నిమిషాలమీద పూర్తయ్యేది తన పని. అతడు లేకపోవడం విచారంగా ఉంది ఆచార్యునికి. ఆచార్యుల పక్కనే ఉన్నాడు ఉదంకుడు. గురువు ఆవేగంతో అన్నమాట అర్థం కాలే

దతడికి. వినయపూర్వకంగా అడిగాడు, "ఎవర్ని స్మరిస్తున్నారు స్వామీ! ఎవరీ కుమారిలభట్టు?"

."కుమారిలభట్టునే ఎరుగవా?" కొంచెం వేదనతో అన్నాడు శంకరాచార్యులు.

ఉదంకుడు శాంతంగా చూస్తున్నాడు. అతడి చూపులో జిజ్ఞాసా భావం వెల్లడవుతోంది.

"మన బాధలు తొలగించిన మహాపురుషుణ్ణి మనం తెలుసుకోక పోవడం, ఇది మన దౌర్భాగ్యం!" అన్నాడు ఆచార్యులు. తన తెలివి తక్కువకి తనలో తాను సిగ్గుపడ్డాడు ఉదంకుడు. అంతకంటే తన అజ్ఞానం వెల్లడి చేసిన తన జిజ్ఞాసా భావానికి మరింత విచారించా డతడు. ఇంకా ఇలా అన్నాడు ఆచార్యులు— "కుమారిలభట్టు, గత శతాబ్దం మీమాంసకుల్లో ఉద్దండుడైన పండితుడు. కేవల విద్యాబుద్ధుల్లో అద్వితీయుడు మాత్రమేకా దతడు. దేశాన్ని ప్రేమించే ఉదార హృదయుడు. అంతటా ధర్మం క్షీణించడం చూసి ఆయన హృదయం హాహాకారాలు చేసింది. నాస్తికుల అనాచారం చూసి ఎంతో బాధపడ్డాడాయన. దుఃఖమూ, దురవస్థా చూసి గోళ్ళు గిల్లుకుంటూ కూచ్చునే మనిషికా దాయన. కనుక నే వ్యర్థ జీవనం గడపలే దాయన. ఆయన కర్మయోగి. ఉద్యోగి. పురుషార్థ మెరిగిన బుద్ధిశాలి. తన వ్యాకుల హృదయ కార్యకలాపాల్లో తన నిశ్చయం బలపరిచింది. ధర్మం స్థాపించాలనే లాలస కష్టాలు వహించే సామర్థ్యం ప్రసాదించింది. వేదాలు పతనం కావడం చూసి దుఃఖపడిన రాజకుమారి అనిన 'కోవాను వేదా నుద్ధ ష్యతి' వాక్యం నిరంతర మాయన చెవిలో గింగురుమంటూ ఉండేది. అది ఆయనను శాంతంగా కూచోనిచ్చేదికాదు. నెత్తిమీద భూతం కూచున్నట్టు, ఎల్లప్పుడు కర్మచెయ్యి, కర్మ చెయ్యి అని ప్రేరేపించేది" ఉదంకుడు హృదయ మర్పించి వింటున్నాడు. ఆచార్యులు చూశాడు; ఓ క్షణమాగి మళ్ళీ అందుకున్నాడు: "కుమారిలభట్టు వేదవిరోధుల్ని తొలగించడానికి కంకణం కట్టాడు. బౌద్ధులంటే కళ్లల్లో ములుకుల్లా అగుపించారు. వాళ్లని అణచి

తీరాలి. శత్రువుల రహస్యం తెలిస్తేనే వాళ్ళని రూపుమాపడం సులువవు తుంది. అందుకని ఆయన మారువేషం వేసుకున్నాడు. వేద విరుద్ధమయిన బౌద్ధధర్మం నేర్చుకునే మిషమీద ఒక మఠంలో ప్రవేశించాడు. జీవనం కంటే అధికంగా ప్రేమించిన తన ధర్మాన్ని చెప్పలేనంత కటువుగా విమర్శిస్తూవుంటే చలించకుండా సహనంతో వినేవా డాయన. ఆయన సహనమూ, సంయమనశక్తి ఎలాంటిదో ఊహించు! కాని వేదన ఎంతని ఆగుతుంది? అగ్నిహోత్రం ఎంతసేపని దాచగలం? ఒకనాడు ఆయన భరించలేకపోయాడు. బౌద్ధగురువు నోట వేద దూషణ విని ఆయన హృదయం కుమిలిపోయింది. విచారించా డాయన. ఆ విచారంలో కన్నీళ్ల వచ్చేశాయి. ఆ కన్నీళ్ళే ఆయన రహస్యం బయట పెట్టేశాయి. అహింస, అహింస అని కబుర్లు చెప్పే బౌద్ధులు ఆయనని హింసించడానికి విరుచుకు పడ్డారు. ఆయన ప్రాణాలు పుచ్చుకోడానికే తలపడ్డారు. తుదకి ప్రాణాలకి బదులు ఒక కన్ను సమర్పించి బతికి బైటపడ్డా డాయన."

ఉదంకుడి మొహంమీద విచారమూ, సంతోషమూ కలిసి సహాను భూతి స్పష్టంగా అవుపించింది. బౌద్ధుల దుర్మార్గంమీద ఆచార్యులకున్నా ఆవేశం కలిగింది. ఆపుకున్నా డాయన. శాంతచిత్తంతో మళ్ళీ అందు కున్నాడు :

"కుమారిలభట్టు బౌద్ధధర్మం తెలుసుకున్నాడు. బౌద్ధుల దురా లోచనలు గ్రహించాడు. వాళ్ళ జాతీయవిరుద్ధమైన ప్రవృత్తులు కని పెట్టాడు. దేశంలో వ్యాపించిన విష మాయన నెంతో బాధించింది. దాంతో దేశమంతటా సంచారం చేశా డాయన. బౌద్ధధర్మం ఖండిస్తూ ప్రచారం చేశాడు. బౌద్ధధర్మానికి ప్రతిక్రియగా కర్మకాండ ప్రతిపాదించాడు. దాంతో నాస్తికవాదం హాహాకారాలు చేసింది. ఈ అపదనించి రక్షించడానికి నాస్తి కులకు ఒక దాతా, దైవం లేకపోయాడు. రాజశక్తితోడయిన దగ్గిర మాత్రం వాళ్ళు ఈ ఉద్యమాన్ని అణచివెయ్యాలని చూశారు. కాని స్వాతం త్ర్యాత్మను ఏ రాక్షసశక్తి అణచివేయలేదు; మోసం, కపటం కలిసి నిర్భ యత్వం గొంతుక నొక్కెయ్యలేవు. ఆపదలన్నింటిలోంచీ బైటపడ్డాడు కుమారిలభట్టు. తన ఆత్మవిశ్వాసమూ, ఆత్మశ్రద్ధా, అడ్డులేని తర్కమూ

ఆధారం చేసుకుని రాజుముందే బౌద్ధుల్ని పీగగొట్టాడు. తర్కంతో పాచిక పారక పోవడంతోనే గారడీ, హస్తలాఘవం ఆశ్రయించారు బౌద్ధులు. అందులోను వాళ్ళు మొట్టికాయలు తినేశారు. దాంతో కిక్కురు మనకుండా కూచున్నారు. ముల్లు ముల్లుతోనే తీయాలి. అంచేత బౌద్ధుల్ని ఓడించడం కోసం కుమారిలభట్టు కూడా అక్కడక్కడ తమాషాలూ అవీ చేసేవాడు. విజయభేరీ మ్రోగించేవాడు.''

కుమారిలభట్టు విజయగాథ వింటూ ఆనందిస్తున్నాడు ఉదంకుడు.

''కాని, ఉదంకా! అలాంటివి చేయవద్దని ఆయన ఆత్మ పీకుతూనే ఉండేది. మారువేషం వేసుకోవడమూ, బౌద్ధగురువు దగ్గిర ఉపదేశం పొందడమూ చేసి ఆయన పాపమే చేశాడు."

"ఇందులో పాపమేముంది స్వామీ?" ఆచార్యుల మాటకు అడ్డువచ్చి మధ్యనో అన్నాడు ఉదంకుడు.

''నిజమాలోచిస్తే పాపం లేదే అనుకో'' అన్నాడు ఆచార్యుడు. ''అయినా కుమారిలుడు కర్మకాండ ప్రవర్తకుడు. లక్ష్యంలో మంచీ చెడ్డా కలిసివుంటే సాధనకూడా మంచీ, చెడ్డా కలిసిందే అవుతుంది. ఒక స్వతంత్రమైన సత్తా అంటూ సాధనలో లేదు. అది ఆయన మరిచి పోయాడు. తుదకి ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు నిశ్చయించుకున్నాడు. ఈ ప్రయాగ తపోభూమిలోనే తుషానలంలో ప్రవేశించా డాయన. శరీరాన్ని హోమం చేశాడు. ఆయన ఎంతో చేసిపోయినా చెయ్యవలసింది ఇంకా ఎంతో మిగిలిపోయింది.''

గురువూ, శిష్యుడూ ఇద్దరూ వొక్కక్షణం ఉదాసీనత వహించారు. కొంతసేపు శాంతంగా వుండి మళ్ళీ అన్నా డాయన. ''కుమారిలభట్టు శిష్యుడు మండనమిశ్రుడు మిధిలలో వున్నాడు. అతడు కూడా గొప్ప పండితుడు. అతడి సహాయం మనకు లభిస్తే, పూర్వమీమాంసకుల యావన్మంది సహాయమూ మనకు లభిస్తుంది. వాళ్ళలో అతడే ముఖ్యుడు. ఇక్కడినించి మిధిలకే మన ప్రయాణం.''

౨

శంకరాచార్యులు తూరుపుగా బయలుదేరాడు. మగధ చేరాడు. గతకాలం జ్ఞాపకం చేస్తోంది మగధ. పాటలీపుత్రం శిథిలాలు, మౌర్య చక్రవర్తి చంద్రగుప్తుడి కీర్తి, అశోకసామ్రాట్టు యశస్సూ గానం చేస్తున్నాయి. గుప్తులనాటి వైభవం అక్కడా అక్కడా చెదురుమదురుగా ఇవాళకూడా కనిపిస్తుంది. ప్రయాగలో సముద్రగుప్త చక్రవర్తి శౌర్య స్తంభంలో కనిపించిన కాఠిన్యం, మగధలో కోమలమై సంవేదనా హృదయంతో సాక్షాత్కరిస్తుంది. ధర్మద్రోహుల్నీ, దేశద్రోహుల్నీ కఠోరంగా క్రూరంగా దండించిన చేతులతోనే వీణాతంత్రులతో అమృతగానం పలికించాడాయన. అది నేటికికూడా హిందువుల హృదయాలు పులకింపజేస్తూ మగధలో ప్రతిధ్వనిస్తుంది. అందుకనే అన్నాడు కవి : 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి' అని. దీనికి ప్రత్యక్ష నిదర్శనం మగధ.

మండన మిశ్రుడికోసం ఒంటరిగానే వెళ్ళాడు శంకారాచార్యులు. శిష్యుల్ని వెనక వొదిలేశాడు. శిష్యుల బ్రహ్మాండమైన దండుతో మండన మిశ్రుని మీద ప్రభావం తేలేదుకదా? శంకరాచార్యులు పట్నంలో ప్రవేశించాడు. నూతిదగ్గిర పనిమనిషి నీళ్ళుతోడుతూ వుంది. మండనమిశ్రుల ఇల్లెక్కడ అని ఆమె నడిగాడు శంకరాచార్యులు.

పనిమనిషి వినయంగా శ్లోకంతో జవాబు చెప్పింది—

స్వతః ప్రమాణం పరతః ప్రమాణం
కీరాంగనా యత్ర గిరో గిరంతి,
ద్వారస్థ నీడాంతర సన్నిరుద్ధా
జానీహి త స్మండనమిశ్ర ధామ. ౧

ఫలప్రదం కర్మ, ఫలప్రదోషః
కీరాంగనా యత్ర గిరో గిరంతి,
ద్వారస్థ నీడాంతర సన్నిరుద్ధా
జానీహి త న్మండనమిశ్ర ధామ. ౨

జగ ద్ధ్రువం స్యా జ్జగ దధ్రువం స్యాత్
కీరాంగనా యత్ర గిరో గిరంతి,
ద్వారస్థ నీడాంతర సన్నిరుద్ధా
జానీహి త న్మండమిశ్ర ధామ.* ౩

వాకిట్లో చిలుకలు గోరువంకలూ ఇలా సంస్కృతంలో చర్చలు సాగించేచోట రోజు రోజంతా తత్వచర్చలు జరుగుతూ వుండడంతో వింతేముంది? ఆ మాటలే ఆ పిట్టలలా పలుకుతూ వున్నా యన్నమాట! ఎంత మేధావియైన పండితుడో మండనమిశ్రుడు - పనిమనిషే అలా చెప్పింది! ఎంతో సంతోషించాడు శంకరాచార్యులు. దాసదాసీజనమూ, చిలుకలూ, గోరువంకలూ దేవవాణి సంస్కృతంలో మాట్లాడుతున్నారు. అంతటి ప్రకాండ పండితుడి సహాయం తన కెంత తోడ్పడుతుంది!

---

* "వేదం స్వయం ప్రమాణమా, లేక వేదాల కేదయినా ప్రమాణముందా? కర్మ ఫలం ప్రసాదిస్తుందా? లేక ఫలదోషమునా? లోకం నిత్యమైందా, అనిత్యమైందా?" ఇలా చిలుకలూ గోరువంకలూ ఎవరి గుమ్మంలో పంజరాలలో కూర్చుని చర్చలు సాగిస్తూ వుంటాయో, అదిగో - అదే మండన మిశ్రుల ఇల్లు.

ప్రాచీన సంప్రదాయాలూ, సంస్కృతభాషా, వైదిక ధర్మమూ పునరుద్ధరించడానికి ఎంత వినియోగ పడుతుంది!' ఇలా అనుకుంటూ మండన మిశ్రుణ్ణి కలుసుకునేందుకని తహతహలాడిపోయా డాయన. మనసిచ్చి మండన మిశ్రుడితో మాట్లాడాలి. తన ఆవేదనా, ధర్మవిచారమూ అతడికెరిగించాలి. అతడు తప్పకుండా తనతో చేతులు కలిపి తోడ్పడక పోడని గట్టి నమ్మకంతో ముందుకి సాగా డాయన. క్షణమయినా వ్యర్థం చేయడమాయనకి నచ్చలేదు. దాసీ వెంట తిన్నగా మండన మిశ్రుడింటికి వెళ్లాడు.

తాను వచ్చినట్టు కబురు చెయ్యడం, జవాబు వచ్చేవరకూ ఒక క్షణ మాగడం - ఈ శిష్టాచారం పాటించడానికయినా ఓపిక లేకపోయింది శంకరాచార్యునికి. తన సొంత ఇల్లయినట్టు, తడబడకుండా సరాసరి లోపలికి వెళ్ళిపోయా డాయన. నిజమే, ఏ హిందువు గృహమూ పరాయి గృహం కాదాయనకు. పైగా మండనమిశ్రుడు తనకు మల్లేనే వేద ధర్మం ప్రేమిస్తున్నాడు. అలాంటప్పుడు మండనమిశ్రుడి ఇల్లు తన ఇల్లే అని అనుకోవడంలో వింతేముంది? మండనమిశ్రుడప్పుడు శ్రాద్ధకర్మ చేస్తున్నాడు. శ్రాద్ధసమయంలో సన్యాసి రావడం కూడనిపని; పైగా ఆగంతుకుడైన ఈ క్రొత్త సన్యాసి కబురు ఏమీ లేకుండా ఇంట్లో దూరిపోయాడు. మండనమిశ్రుడికి అరికాళ్ళమంట నెత్తికెక్కింది. తన యుగంలో అందరికంటే గొప్పవాడైన మహాపురుషుడు తన ఎదటనుంచున్నాడు. నిజమే, కాని తనకేం తెలుసు? మండనమిశ్రుడి కోపం కనిపెట్టాడు శంకరాచార్యులు. శాంతంగా, మృదువుగా అన్నాడు: "మిశ్రమహాశయా, క్షమించండి. ఒకే దారిని నడుస్తూన్న బాటసారులం మనము. మనలో వొకరి మీద వొకరికి కోపం దేనికి?"

"ఒకేదారిని నడవట మేమిటయ్యా, సన్యాసీ!'' ఏవగింపు గొంతుకతో అన్నాడు మండనమిశ్రుడు. శంకరాచార్యులమాట అర్థంకాలేదతడికి.

''అడగకుండా, చెయ్యకుండా లోపల ప్రవేశించావూ? పైగా ఈ డొంక తిరుగుడు మాటలు కూడానా?''

''అదికాదు, మండనాచార్యా! మన మిద్దరమూ వైదిక ధర్మం పునరుద్ధరించడానికి నడుం కట్టిన వాళ్ళమే. పగలెంత నిజమో ఈ మాటా అంతే నిజం!'' దృఢంగా అన్నాడు శంకరాచార్యులు.

వైదిక ధర్మ మన్నమాట వినగానే మండన మిశ్రుడి కోపం రవంత శాంతించింది; అయినా శంకరాచార్యుల ప్రవర్తన తనకేమీ అర్థం కాలేదు. మళ్ళీ అన్నాడతడు: ''వైదిక ధర్మమంటూ పెద్ద కబుర్లు చెపుతున్నావు, కాని ప్రవర్తనేమో బౌద్ధులమల్లేనే వుంది. వైదిక ధర్మంలో సన్యాసు లెక్కడయ్యా? వైదిక ధర్మంలో తద్దినం జరుగుతూ వుంటే సన్యాసులు రావడం కూడదు కదా, యతీ!''

''ఈ విషయాలు మాట్లాడడం కోసమే మీ దగ్గరికి వచ్చాను బ్రాహ్మణోత్తమా——"

శంకరాచార్యుల మాట సగం నోట్లోనే వుంది. అక్కడున్న బ్రాహ్మల్లో వొకాయన లేచి శంకరాచార్యునికి ప్రణామంచేసి మండన మిశ్రుడితో అన్నాడు :"భగవంతుడికి ధన్యవాదాలర్పించండి మిశ్రజీ! తమ ఎదుట శంకర భగవత్పాదులు నుంచునివున్నారు "

శంకరాచార్యుల పేరు వినగానే మండనమిశ్రుడు తడబడిపోయాడు, తన ప్రవర్తన తనకే సిగ్గుపేసింది. "క్షమించండి ఆచార్యా!" అన్నా డాయన- "ఎవరి సిద్ధాంతం వాళ్ళది. మీ మార్గంమీద గౌరవంలేదు నాకు."

శంకరాచార్యులు చూశాడు; మండన మిశ్రుడు శ్రాద్ధ కర్మలో వున్నాడు. దేశాన్ని గురించీ ధర్మాన్ని గురించీ మాట్లాడే చిత్త వృత్తితే దిప్పుడు. అంచేత శాంతస్వరంతో ''మీరు శ్రాద్ధకర్మ పూర్తి చేయండి. ఇప్పటి స్థితిలో దేశం పనీ, ధర్మం పనీ ఎలా చెయ్యాలో ఉభయులమూ కలిసి తరువాత చర్చిద్దాము" అంటూ బైటికి వచ్చేశా డాయన.

మండనమిశ్రుడు యథావిధిగా శ్రాద్ధకార్యం ముగించాడు. బ్రాహ్మణులకు భోజనం పెట్టాడు, దక్షిణలిచ్చి పంపేడు. తరువాత శంకరాచార్యులకు బసా, భోజనాదికాల ఏర్పాటూ చేశాడు. అంతలో ఆయన శిష్యులున్నూ వచ్చి చేరుకున్నారు. మాహిష్మతీవాసుల్లో శంకరాచార్యులు వచ్చిన వార్త గుప్పుమంది. తండోపతండాలుగా ఆయన దర్శనానికి విరగబడ్డారు.

మూడోజామున - మండనమిశ్రుడూ, శంకరాచార్యులూ శాస్త్రచర్చ కోసం కూచున్నారు. ఏమిటా శాస్త్రచర్చ? దేశంలోని ఇద్దరు విద్యావంతులు, ఇద్దరు దేశభక్తులు సదిచ్ఛా, సద్భావనా మనస్సులో పెట్టుకుని దేశీయ సమస్యలు పరిష్కరిందంకోసం చర్చ ప్రారంభించారు. ఒకళ్ళనొకళ్ళు వోడించాలని కాదు. ఒకళ్ళమీద ఒకళ్ళమతం రుద్దాలన్న మొండి పట్టుతో కాదు. ఒకళ్ళ నొకళ్ళు కించపరచాలని కత్తులు నూరుతూ కాదు. ఒకళ్ళనొకళ్ళు బోధపరుచుకోవాలన్న ఉత్కంఠ మాత్రమే ఉందక్కడ. సత్యం వెదకాలన్న జిజ్ఞాసమాత్రమే వుంది. సత్యమార్గంలో నడవాలన్న అభిలాష మాత్రమే వుంది. మండనమిశ్రుడి భార్య భారతి విదుషీమణి. ఈ చర్చల్లో ఆమె మధ్యవర్తిగా కూచుంది. మాహిష్మతీ పట్టణం తీర్థ రాజమైన ప్రయాగగా మారిపోయిందా అనిపించినదప్పుడు. ఒకవంక శంకర భగవానుడి జటాజూటాలనించి ప్రవహించిన గంగా భవానిలా శంకరాచార్యుల నోట శుద్ధమైన జ్ఞానమార్గమనే తెల్లటి గంగ ప్రవహిస్తోంది. మరోవంక తమాల వృక్షాల చీకటిలోని సూర్య తనూజ యమునా తరంగిణిలా ప్రాచీన సూర్యుడు, యజ్ఞయాగాదుల పురస్కర్త, ప్రకాండ పండితుడు, ప్రచండ కర్మకాండవాది మండనమిశ్రుడి వాగ్ధార అనే యమున ప్రవహిస్తోంది. ఈ రెంటిమధ్యా సరస్వతి అపరావతారం భారతి వుండనే వుంది. ఈ తీర్థరాజమైన ప్రయాగ త్రివేణీ సంగమంలో స్నాన మాడి తమ హృదయాలు నిర్మలం చేసుకునేందుకు ఎంతో మంది స్త్రీలూ

పురుషులూ ఓ రాణువలా మూగిపోయారు. ఈ ప్రవాహం ఎన్నో దినాలు సాగింది. ఐతే ఇక్కడ దాని సారాంశమే పని తృప్తిపడాలి.

ముందు శంకరాచార్యు లందుకున్నాడు, ''మిశ్రప్రవరా! ఇప్పటి దేశస్థితి మీకు తెలియందికాదు. కుమారిలభట్టు, పాదాచార్యులు తన జీవనం ధర్మ సేవలోనే గడిపారన్నది యదార్థం. జీవనంలో ప్రతి క్షణమూ వైదిక ధర్మం పునఃస్థాపన చెయ్యడంకోసమూ, వేద విరుద్ధమైన ధర్మాలు ఖండించడం కోసమూ వినియోగించా డాయన. అందులో ఆయనకి సఫలతకూడా లభించింది. కాని ఇవాళకూడా ఉత్తరాదినీ, దక్షిణాదినీ, పడమటనీ బౌద్ధ ధర్మం కనిపిస్తూనే వుంది. దేశానికి పెద్ద విపత్తులా వుందది. రండి, మనం కలిసి ఈ దేశద్రోహుల్ని అంతం చేద్దాం. భారతదేశమంతటా హిందూధర్మం ప్రచారం చేద్దాం. భట్టపాదులు వదలిపెట్టిన పని పూర్తి చేద్దాం. ఆయన ఆత్మకి శాంతి కలిగిద్దాం.''

''నిజమే, శంకరాచార్యా!'' మండనమిశ్రుడన్నాడు, ''వేదాలకి వ్యతిరేకమైన ధర్మం నాశనం కావలసిందే. తోడ్తో వైదికధర్మస్థాపనా జరగవలసిందే. నేనూ ఇదే కోరుతున్నాను. కాని ఒక్క ప్రతిక్రియమీదే ఆధారపడి మనం కలవలేం. మీరు ప్రచారంచేస్తున్న ధర్మం వైదికధర్మం కాదు. ఎప్పుడైతే ఇంటింటా జరిగే హవనాలతోనూ, అగ్నిహోత్రాలతోనూ ఎర్రని ఆకాశం పొగలు కమ్ముతుందో, వేదమంత్రాల స్వరలహరి వాయుమండలం పవిత్రంచేస్తూ ప్రతిధ్వనిస్తుందో, అదిగో అప్పుడు వైదికధర్మం ప్రచారమయిందనాలి. మీ పంచాయతన దేవతలకీ, వేదాంతానికీ వైదిక ధర్మంలో స్థానమెక్కడుంది?''

శంకారాచార్యులు ఈ విమర్శ విన్నాడు. శాంతభావంతో ఇలా ఎత్తుకున్నాడు: "నేనూ వైదికయుగం కలలు కనగలను. వేదపాఠకులూ, కర్మకాండ తత్పరులూ అయిన ఋషుల రక్తం నా రక్తనాళాల్లోనూ

ప్రవహిస్తోంది. నిజానికి దేశంలో యజ్ఞాలూ అవీ ముమ్మరంగా జరిగే ఆ దినాలు ఎంత గొప్పదినాలు! అందరూ ఒకే దారిని ఒక్క దేవత ప్రీతి కోసం యజ్ఞాలూ హవనాలూ జరిపేవాళ్ళు కాని మండనాచార్యా! యజ్ఞాలూ హవనాలూ, సంధ్యలూ, ఉపాసనలూ ఇవన్నీ మనస్సు శుద్ధిపరచడం కోసమూ, క్షుద్రభావాలు తొలగించుకుని హృదయం ఉన్నత భావాలతో నింపుకోవడం కోసమూ సాధనాలు మాత్రమే. అవి సాధ్యాలుకావు. సాధనం జీవనం కాదు. లక్ష్యమే జీవనం."

"ఐతే, యజ్ఞాలూ అవీ అక్కరలేకుండా, ఆర్యుల ప్రాచీనమార్గం తిరిగి అనుసరించకుండా ఆర్యధర్మోద్ధరణ జరిగిపోతుందనే మీ అభిప్రాయమా?" మండనమిశ్రు డడిగాడు.

"ఎందుకు జరగదు?" అన్నాడు శంకరాచార్యులు. "దేశకాలానుసారంగా సాధనం మారుతుంది. ఒకప్పుడు ఒక దేశంలో గోధుమలు తిని బ్రతికితే, మరొక దేశంలో వరికూడు తిని బ్రతుకుతున్నారు. ఎండాకాలంలో చల్లని పదార్థాలు అవసరమైతే, శీతాకాలంలో వేడి వస్తువులు అవసరమవుతాయి. వైదికధర్మం తాలూకు ఆత్మ జీవించివుందీ అంటే, అది జయించడమూ, సహించడమూ- ఈ రెండు మానసిక ప్రవృత్తులూ చక్కగా సమన్వయం చేసుకోబట్టే బ్రతికివుంది. ప్రాచీన పరంపరతో సంబంధం పెట్టుకుంటే వైదికధర్మంతో కూడా సంబంధముండి తీరుతుంది. పైపై మాటలవల్ల ఆత్మ నశించి పోతుంది అంటే వైదికధర్మం కూడా నశించి పోతుంది."

"ఐతే పాతరోజులు తిరిగి రావనే అంటారా?" కొంచెం విచారిస్తూ అడిగాడు మండనమిశ్రుడు.

"గతకాలమెన్నడూ మళ్ళీ తిరిగిరాదు. ఎవళ్ళెంత ప్రయత్నించినా గంగాప్రవాహం ఒకసారి మైదానం మీదికి వచ్చిన తరవాత తిరిగి పర్వతం మీదికి మళ్ళించలేరు. జాతి ముందుకు సాగింది. గత వెయ్యి సంవత్స

రాలలోనూ దానిమీద ఎన్నో సంస్కారాలు జరిగిపోయాయి. తన అస్తిత్వం నిలుపుకునేందుకు ఎన్నో ప్రయత్నాలు చేసిందది. సుప్తమైన తన శక్తులు మేలుకొల్పి ఎన్నో మార్గాలు ప్రయోగించింది. దాంతో జరిగిన పురుషార్థం మన సంపత్తిగా తయారయింది. జాతి ఉత్సాహానికి కేంద్రంగా ఏర్పడింది. దానిని మనం వదిలివేయడం పడదిక. మన శక్తులు మనమనుకున్న మార్గాలలో వినియోగపడలేదు. మన శక్తులు నిర్దేశించిన మార్గాల్లో వినియోగపడ్డాయవి. వాళ్లేవైనా ఆక్రమణ సాగిస్తే, మనమావైపు ప్రతీకారం చేశాం. వాళ్ళు ఏ దిక్కు దుర్బలులై కనిపిస్తే, మనం ఆ దిక్కు ప్రత్యాక్రమణ సాగించాం. నదియొక్క మార్గం నది ఇష్టానుసారంగా సాగదు. నేలపల్లం మీద ఆధారపడి ఉంటుందది. ఐతే, దాని లక్ష్యమూ, జీవన ప్రవృత్తీ, దాని ధర్మమూ సముద్రం చేరు కోవడమే. దాన్నెవడూ అడ్డలేడు. ఎవడైనా అడ్డేందుకు ప్రయత్నించాడో, ఆ మూఢుడు నాశనం కావడం తప్పదు. మన జాతీయ జీవనమనే భాగీరథీ ప్రవాహంకూడా వేలాది సంవత్సరాలనుంచీ వైదిక జీవనమనే హిమా లయంనుంచి కిందికి దిగింది. పౌరాణిక జీవనమనే మధ్యదేశం మైదానాల్లో సంచారం చేస్తూ సముద్రంవైపు ముందుకి సాగింది. ఇవాళ గంగానది ఘోష వినపడడం లేదని మీరు విచారించడంలో అర్థంలేదు. శాంత మయిన కలకల ధ్వనికూడా ఆ గంగాభవానిదే. గత వెయ్యేళ్ళలోనూ మారిన మన స్వరూపం చూసి మనం భయపడనక్కరలేదు. శిశువు సుకుమార స్వరూపం మారిపోయి బలిష్ఠమైన యవ్వన స్వరూప మేర్పడిం దనుకోండి, ఆ చిన్నప్పటి కోమలత్వం కోసం ఏడవడం కానీ, బాహ్యో పచారాలు జరిపి ఆ కోమలత్వం తిరిగి రావడంకోసం ప్రయత్నించడం కాని వెర్రితనం. వెయ్యి సంవత్సరాలయి వికాసం పొందిన మన ప్రవృత్తులు నాశనం కావు. వాటిని నాశనం చెయ్యవలసిన అవసరమున్నూ లేదు. ఏ గౌరవ చిహ్నాలు మనం వికసింపజేశామో, వేటి రక్షణకోసం

మన జాతీయ వీరులు తమ ప్రాణాలు బలి పెట్టారో ఆ గౌరవ చిహ్నాలు మనం నాశనం కానిస్తామా?''

ఈ ఆవేశపూర్ణమైన ఉపన్యాసం విని మండన మిశ్రుడు కొంచెం ఆపుకుంటూ కూచున్నాడు. తరువాత అందుకున్నాడు: ''ఏదో ఒక తప్పుడు ఆదర్శం పెట్టుకుని దానికోసం త్యాగం చెయ్యడమూ, ఆ త్యాగమే చాటుకుంటూ ఆ తప్పుడాదర్శానికే అంటిపెట్టుకుని ఉండడమూ ఏం న్యాయం స్వామీ! త్యాగం చేసినంత మాత్రాన ఆ తప్పుడాదర్శం మంచి దయిపోదు. ఆదర్శం స్వతహాగా మంచిదైంది కావాలి. చెడ్డదారిని నడిచి పరిశ్రమ చేసినంత మాత్రాన ఆ చెడ్డదారి మంచిదైపోదు. పండితులు సమ్మతించింది కావాలది.'' ఈ చివరిమాట లన్నప్పుడు మండనమిశ్రుడి కంఠం కొంచెం ఉత్తేజితమయింది.

''నిజమైన మాట అన్నారు మిశ్రజీ!'' అంటూ శాంతంగా ఎత్తుకున్నాడు శంకరాచార్యులు- ''మంచి ఆదర్శంకోసమైతేనే త్యాగమూ, ఆత్మాహుతి సార్థకమవుతాయి. అలా కానప్పుడు మన భయంకరమైన భ్రమ మరింత భయంకరంగా తయారవుతుంది. ప్రజ్వలితమై ఆత్మ ప్రకాశం తీక్షణమైంది. దాని వెలుగు సాధారణ మానవుల కళ్ళు మిరుమిట్లు గొల్పుతుంది. అంచేత ప్రకాశిస్తూన్న పదార్థ స్వరూపం సరిగా నిరూపించలేరు వాళ్ళు. కాని, సూక్ష్మదర్శి అయిన పండితుడు మాత్రం ఆ వెలుగులో ఆదర్శం యొక్క సత్యాసత్యాలు స్పష్టంగా తెలుసుకో గలుగుతాడు. ఎరిగిన వ్యక్తిలాగ ఈ త్యాగమనే ఆవరణ తొలగించి ఆదర్శ పరీక్షకి పూనుకున్నారు మీరు; మంచిపనే చేశారు.''

తానన్నదానికి శంకరాచార్యులు సమ్మతించడం చూసి మండన మిశ్రుడు మనస్సులో సంతోషించాడు. తన విషయం ప్రతిపాదించడంకోసం మళ్ళీ అందుకున్నాడతడు: ''నిజమే ఆచార్యా! సత్యమైన ఆదర్శం ప్రతిష్ఠించ

డానికే ప్రయత్నించాలి మనం. రండి, మనం దానికోసమే చేతులు కలుపుదాం.''

''అవును, మిశ్రజీ!'' శంకరాచార్యులన్నాడు- ''ఆర్యుల వైదిక మార్గమే మన మనుసరిద్దాం. అనంతమైన రత్నాలకు నిలయమైన హిమాలయం భూదేవికి మానదండం లాంటిది- అలాగే గంగా ప్రవాహంలాంటి ఉపనిషత్తుల జ్ఞానధారకు కూడా జ్ఞాననిలయమూ జ్ఞానలోకానికి మానదండమై నిలిచిన అపౌరుషేయాలైన వేదాలే మూలం. ఆకాశమంటుతూన్న ఆ గిరిరాజు చరియల్లో తపస్సు చేస్తూ, ఆ పర్వత శృంగాలతో సమానంగా లేచి జ్ఞానాకాశమందుకుని వేదాంత సూత్రాలు రచించిన ఆ మహాఋషి బాదరాయణుడు ఆర్య మార్గంలో నడిచిన పథికుడు కాదంటరా? ఆ వేదాంత సూత్రాలు వేదవిరోధాలంటారా? వ్యామోహం వల్ల అర్జునుడికి కలిగిన అకర్మణ్య భావం తొలగించి పురుషార్థ ప్రకర్ష ప్రతిష్ఠించిన భగవద్గీత వేదవిహితమైంది కాదా? జ్ఞానమూ, కర్మా, భక్తీ - ఈ త్రివేణీ సంగమంలో మునకలు పెడితే పాపం వదలకుండా వుంటుందా? గత వెయ్యేళ్ళలోనూ వికాసం పొందిన వైదికధర్మమే. దాని ఆదర్శం వైదికాదర్శమే.''

''అదంతా నిజమేనయ్యా, ఆచార్యా! కాని బౌద్ధులలాగ యజ్ఞాలూ, హవనాలూ వదిలిపెట్టి పూజా అర్చనా సాగించడం వైదికధర్మమా?'' కొంచెం దారికి దిగుతూ అన్నాడు మండనమిశ్రుడు.

శంకరాచార్యులన్నాడు, ఈ పద్ధతి బౌద్ధులది కానేకాదు. అదీ కాక బౌద్ధులకోసమని మనం హవనాలూ వదిలెయ్య లేదు. యజ్ఞాలూ మొదలైన కర్మకాండంతో పాటు అంతరాత్మ సాక్షాత్కారం కోసం ప్రయత్నించడ మనేది బౌద్ధులకు పూర్వమే మనలో కనిపిస్తుంది. బౌద్ధధర్మం పుట్టకపోయినా మనమీపని చెయ్యవలసిన వాళ్ళమే. బాహ్య యజ్ఞాలకు

బదులు ఆత్మయజ్ఞాలు జరిపే ఉత్తమాదర్శం ఉపనిషత్తులూ, బ్రాహ్మ ణాలూ గొంతెత్తి చాటుతున్నాయి. భక్తి ప్రేరణ సనాతనమైంది. ఇవాళ కూడా జన సాధారణం జరిపే పూజాదులలో దాని వికాసమే మనకు గోచ రిస్తుంది. ఐతే, దానికొక స్వరూప మేర్పరచడమూ, దానిని సరిదిద్దడమూ మన పని. అది వైదిక పద్ధతే. ఇంటింటా జరిగే శివపూజ మాటున వైదిక రుద్రుడి స్తోత్రం మీకు వినపడ్డం లేదా? వాసుదేవపూజ జరిపే భాగవత మతావలంబులు, వైదిక విష్ణువునే కదా పూజిస్తారు? పురాణాలూ, ఉప పురాణాలూ వైదిక ఋషుల మహిమే గానం చేస్తున్నాయి. ఆకాశం చిల్లులు పడినట్టు మన సూతులు కీర్తించిన రాజులు యావన్మందీ వైదిక మత మవలంబించినవాళ్ళే కదా? ఏమంటారు? ఈ వెయ్యేళ్ళూ భారతదేశం లోని ప్రజానీకం తమ పూర్వసంప్రదాయాలతో సంబంధం పెట్టుకో లేదంటారా? వాళ్ళమనస్సులో తమ గత తరంవాళ్ళమీద శ్రద్ధ లేదంటారా? ఈ పరంపరని ఎడపెట్టవలసిన అవసరం లేదంటాను. భారతీయుల మస్తిష్క వికాసమిది. ఆసింధు సింధుపర్యంతం తన కోటికోటి సంతా నానికి భారతమాత సమర్పించిన మాతృస్తన్య మది. దాంతో పరిపుష్టి చెందిన సత్పుత్రులు తల్లికోసం నిర్వహించిన ఉపాసనా విధీ, ఆరాధనా అది. ఈ వెయ్యేళ్ళలో జాతి అంతఃకరణ చతుష్టయంలా వికసించిన చాతుర్ధామకల్పన పరిత్యజించగలమా? మనం దాన్ని వొదిలిపెట్టలేం. సాధారణ జనులున్నూ వొదిలిపెట్టరు. ఏమంటే, అందులో మాతృభూమి దర్శనమిస్తుంది వాళ్ళకి. దక్షప్రజాపతి యజ్ఞంలో స్వాభిమానం కోసం ఆత్మాహుతి చేసుకున్న సతీదేవి మృతదేహం భారతదేశమంతటా చెదిరి ముక్కలై పడివుందివాళ. శాక్తేయుల ఈ తీర్థక్షేత్రాల వంక చూస్తే కళ్ళుంటూ వున్నవాళ్ళు ఇవాళకూడా ప్రజాపతి యజ్ఞజ్వాలలు చూడగలుగు తారు. ఆ జ్వాలల్లో అవుపించే మాతృమూర్తి ముందు ఎవడ్డు తలవంచ

కుండా వుండగలడు? బౌద్ధధర్మంలోని జాతీయ విరుద్ధమైన ప్రవృత్తుల్ని ఈ జాతీయ కల్పనలే అడ్డగించాయి. ఇవి ఒదిలేస్తే జాతీయ కల్యాణమెలా సాధ్యపడుతుంది?"

శంకరాచార్యు లాగాడు. మండనమిశ్రుడు ముగ్ధుడై వింటున్నాడు. శంకరాచార్యులు మళ్ళీ అందుకున్నాడు, "మన ఈ వికాసం పరాయి వాళ్ళని అనుకరించిందే అయితే మన ఆత్మాభిమానాన్ని, ఆత్మవిశ్వాస మునూ, స్వయం పోషకత్వాన్ని నాశనం చేసేదే అయితే మన ప్రాచీన సంప్రదాయాల్ని ఛిన్నాభిన్నం చేసే సేది అయితే, మనలో ఆత్మగౌరవం రేకెత్తకుండా చేసే జాతీయ విరుద్ధమైన ప్రవృత్తులకి మూలకందమయిన దైతే, అప్పుడు మనం దాన్ని సమూలంగా ఊడ పెరికేసేవాళ్ళం. ఏమాత్రం వ్యామోహముంచేవాళ్ళంకాము. కాని అదలా కాలేదు. మన పూర్వ సంప్రదాయాలకి పరిపుష్టి కలిగిస్తోందది. పూర్వులు నాటిన విత్తనమే ఇలా వృక్షమై పెరిగింది. విత్తనం పూర్వస్వరూపం మారి పోయిందని విచారించడంలో అర్థంలేదు. దాని పరివర్తనరూపం పోల్చు కోవాలి. వికాస స్వరూపం తెలుసుకోవాలి. చెట్టులోనే బీజం గుర్తించాలి. చెట్టుకే నీరు పెడితే పండు పండి, తిరిగి బీజం దొరుకుతుంది. అంతేకాని చెట్టు నరికేస్తే, వేళ్ళు పీకేస్తే విత్తనం దొరకదు. ఇవాళటి హిందూ ధర్మం తన ప్రాచీన ఆర్య ధర్మం తాలూకు వికాస స్వరూపమే. రండి, దీన్ని వృద్ధిచేద్దాం. భారతదేశ మంతటా అద్వైతం ప్రచారం చేద్దాం. భారత సంతతిని వొక్కతాటి మీద నిలుపుదాం"

"ఐతే, యజ్ఞాలూ హవనాలూ నశించవలసిందేనా స్వామీ?" చిన్న బుచ్చుకుంటూ అన్నాడు మండన మిశ్రుడు. శంకరాచార్యుల వాణి అతణ్ణి గెలుచుకుంది. కాని మనస్సుమీద పడివున్న సంస్కార ప్రభావం వెనకకు పీకుతోంది.

"నాశన మెందుకవుతాయి, మిశ్రజీ? మన జీవనంలో యజ్ఞానికి స్థానముంది. మహత్వమూ వుంది. అందుకే వాటిని మనం కాపాడుకుని తీరాలి. మన సమగ్ర జీవనమే యజ్ఞమయ మవుతుంది. ఆదిభౌతిక శక్తితో ఆదిదైవిక భావన సంధిస్తే ఆధ్యాత్మిక దృష్టి ఉత్పన్న మవుతుంది. అదే యజ్ఞం. మన దగ్గర వున్నదీ, మనం చేసిందీ - ఇదంతా మన జీవనోపభోగంకోసం కాదు- మానవాదర్శాల కోసం. ఇదే యజ్ఞీయ భావన. లోకంలోని సత్యమూ, శివమూ, సుందరమూ రూపాత్మకమైన ప్రతీదీ భగవంతుడు ఆవిష్కరించిందే. కనుక జీవన క్రియలు ఆయనకు సమర్పించడమే యజ్ఞం" అన్నాడు శంకరాచార్యులు.

"నిజమే స్వామీ!" ఆపుకుంటూ అన్నాడు, మండనమిశ్రుడు - "కాని, సిద్ధాంతానికి వ్యావహారిక రూపమున్నా వుండాలి. ఆదర్శాలు ప్రాప్తించాలంటే దానికి తగిన సాధనమున్నా వుండాలి. జీవనంలో ఇలాంటి యాజ్ఞికదృష్టి రావడానికి తగిన సంస్కారమున్నా కుదరాలి. ఇవి లేకుండా మన ఉద్దేశ మెలా ఫలిస్తుంది?"

"నిజమే చెప్పారు మిశ్రజీ!" అన్నాడు శంకరాచార్యులు— "సాధన రూపాలయిన సంస్కారాలు వదిలిపెట్టవద్దు మనం. మన యజ్ఞాలూ, హవనాలూ ఇలా తయారవుతాయి-ప్రతివాడూ పంచయజ్ఞాలు చేస్తాడు, మన ధర్మకార్యాలన్నిటిలోనూ యజ్ఞాలూ, హవనాలూ అవసరమవుతాయి. జీవన సంస్కారాలు యావత్తు విధిపూర్వకంగా యజ్ఞాలూ హవనాలూ ద్వారానే జరుగుతాయి. వీటి పరిశుద్ధమైన సాత్విక స్వరూపం మనదే. అది మనదిగానే వుంటుంది. అయితే మనం మూఢులం కాము. ఇతర సాధనాలవల్ల ఈ కోర్కె నెరవేరిందే అనుకోండి, అప్పుడు మనకి అభ్యంతర మెందుకుండాలి?"

మండనమిశ్రు డేమని అభ్యంతరపెట్ట గలడు?

అతడి తూణీరంలో తర్క బాణాలు మరిలేవు. శంకరాచార్యుని భావసరస్వతిలో స్నానం చేసి అతడు తన శంకలూ, కుశంకలూ తీర్చేసుకున్నాడు. ఐతే, జైమిని మహర్షి అంటే అతడికెంతో భక్తి. అందుకని వుండివుండి అతడి హృదయం పీకుతుండేది. తుదకి అనేశాడు కూడా, "ఆచార్యా! మీరన్నదంతా నిజమే కాని, జైమినిమహర్షి వంటి పండితుడు ఇవన్నీ ఊహించలేకపోయాడంటారా? ఆయన హృదయంలో దేశం మీదా, ధర్మం మీదా ప్రేమలేక పోయిందా?"

చాలా చిక్కయిన తర్కమిది. జైమిని మహర్షి పాండిత్యం కానీ, ఆయన దేశప్రేమ కానీ శంకించరానిది. ఐతే ప్రత్యక్షంగా ఆయనకి భిన్నమైన మార్గమే అవలంబించవలసివస్తోంది. కాని శాస్త్రజ్ఞానంలో శంకరాచార్యు లేమాత్రమూ తీసిపోడు. జైమిని మహర్షి వాక్యాలే ఉదహరించి తన మతం ప్రతిపాదించా డాయన. ఈ సందర్భంలో స్వయంగా జైమిని మహర్షి ప్రత్యక్షమై శంకరాచార్యుల మతం సమర్థించాడని వొక వదంతి వుంది. దాంతో మండనమిశ్రుడు శంకరాచార్యుల పాదాలమీద వ్రాలాడు. తనంతటతానే ఆయన ముందు తల వాల్చాడు. ఆనందాశ్రువులతో శంకరాచార్యు లాయనని గాఢంగా కౌగిలించుకున్నాడు. జాతీయ సంవేదనతో మండనమిశ్రుల హృదయం ఇంతకుముందే తొణికిసలాడుతూవుంది. ఇప్పుడు దానికి నిశ్చితమైన మార్గమున్నూ లభించింది. శంకరాచార్యుల మల్లే సన్యాసం పుచ్చుకుని ఆయన వెంట బైలుదేరడానికి నిశ్చయించా డాయన.

శంకరాచార్యుల ఈ విజయవార్త దూరదూరాలకి ప్రాకిపోయింది. లోకు లాయన మతం పుచ్చుకుందుకు విరగబడ్డారు. ఏమంటే, మండన మిశ్రులంతటి ఉద్దండ పండితుడే ఆయన శిష్యరికం పుచ్చుకున్నాడు కనుక. కాని ఇంకా పెనగులాడవలిసింది ఎంతో వుంది శంకరాచార్యులతో.

# ౬

తన కళ్ళముందు భర్త వీగిపోవడం చూసింది భారతి. ప్రతిజ్ఞ ప్రకారం అతడు సన్యాసం పుచ్చుకోవడమూ చూసింది. భర్తేమో వీగి పోయాడు, నిజమే. కాని తనకిమాత్రం సమాధానం కుదరలేదు. భార్యా భర్త విచారాలలో భేదముండడమూ - భర్త తన విచారాల కారణంగా సన్యాసం పుచ్చుకోవడమూ - ఇదంతా ఆమె కేమీ అర్థంకాలేదు. అందుచేత ఆమెకూడా శంకరాచార్యులతో శాస్త్ర చర్చ చేయాలని నిశ్చయించుకుంది. ఆమె అంది, "నా భర్తను అంగీకరింపజేశారు. కాని ఆయనని పూర్తిగా జయించలేదు. ఏమంటారు, భర్త సగం శరీరం భార్య. అంచేత నాతో కూడా వాదించి, నన్నుకూడా ఓడిస్తేనే తప్ప ఆయనని మీరు పూర్తిగా ఓడించినట్టుకాదు. కనుక ఆయన సన్యాసం పుచ్చుకోడానికి వీలులేదు."

చిక్కులో పడిపోయాడు శంకరాచార్యులు. భారతి ఇలా కయ్యానికి కాలుదువ్వుతుందనుకోలే దాయన. కొంతసేపాగి అన్నాడు. "నువ్వన్నది నిజమే కాని భారతీ, నీతో శాస్త్రచర్చ ఎలా కుదురుతుంది? నువ్వు స్త్రీవి కదా!"

ఇది వినగానే తన స్త్రీత్వాభిమానం ఒక్కసారి భగ్గుమంది భారతికి. ఆవేశం వచ్చేసిం దామెకి. ఆపుకుంటూ నెమ్మదిగా అందామె, "స్త్రీనైతే మాత్రమేమి? స్త్రీకి విచారశక్తి ఉండదా? ఆమె మనస్సులో

సందేహాల తుఫాను లేవదా? స్త్రీకి హృదయముంది. మేధ ఉన్నది. ఆమెకూడా దేశంలో ఒక భాగమే. దేశం గురించిన బాధ్యత ఆమెకీ వుంది. ఆ బాధ్యత నెరవేర్చుకునే అధికారమూ ఆమెకుంది!"

"అది నేనూ ఒప్పుకుంటున్నాను'' అన్నాడు శంకరాచార్యులు- ''కాని దేవీ, వాడుకలో ఉన్న నడవడిక కూడా కొంచెం గమనించాలి కదా!''

''మీరు నడవడిక విషయం నొక్కి చెపుతున్నారు. చిత్రంగా ఉంది." వ్యంగ్యంగా అంది భారతి- "కాని ఆచార్యా, స్త్రీలతో శాస్త్ర చర్చ లోగడ ఎన్నడూ జరగనే లేదంటారా? గార్గీ యాజ్ఞవల్క్యుల సంవాదం మీకు తెలియందా? గార్గి పురుషుడా? పైగా ఆమె సాగించిన శాస్త్ర చర్చ చిన్నచిన్న విషయాలమీద గాదు, ఆత్మ విషయం మీద. జనకుడూ సులభా జరిపిన శాస్త్రచర్చ సుప్రసిద్ధమైంది. సులభ పురుషుడు కాదే! పోనీ, జనకుడూ యాజ్ఞవల్క్యుడూ సామాన్య వ్యక్తులా? జగత్ప్రసిద్ధులయిన మహాపురుషులు. అంతటి మహాత్ములే స్త్రీలతో శాస్త్ర చర్చ జరిపినప్పుడు మీరేల నాతో జరపకూడదు?"

సరస్వతి యుక్తి యుక్తంగా, సోదాహరణంగా తన పక్షం సమర్థించుకుంది. మరో జవాబు చెప్పలేక పోయాడు శంకరాచార్యులు. చివరి కామెతో శాస్త్ర చర్చకి సమ్మతించక తీరింది కాదాయనకి. మళ్ళీ సభ ప్రారంభమయింది. అంత పెద్ద ఆచార్యులతో, పైగా తన భర్త వీగి పోయాక, భారతి శాస్త్ర చర్చకి సిద్ధపడింది! ఈ వార్త విని చుట్టుపట్ల జనం తండోపతండాలుగా విరగబడ్డారు. రకరకాల చెప్పుకోవడం మొదలు పెట్టారు- "ఏమిటీ భారతి సాహసం? కాశీ పండితులు హాతోస్మి అన్న మహనీయుడితో, ఇంత పెద్ద పండితుడు మండన మిశ్రుడు తల వంచినచోట ఈ స్త్రీ నెగ్గుతుందీ?"

"భారతి సాక్షాత్తూ సరస్వతీదేవి అవతారం. ఆచార్యులు పండితుల్ని గెలవచ్చు, కాని సరస్వతి నెలా గెలుస్తాడు? ఆయన ఈసారి తప్పకుండా పీగిపోతాడు.'' ఇలా ఎవళ్ళకి తోచినట్టు వాళ్ళు వాదించడం మొదలెట్టారు లోకులు.

భారతీ శంకరాచార్యుల శాస్త్ర చర్చ ఎన్నోదినాలు సాగింది. తత్వజ్ఞాన మొక్కొక్క విషయమూ వెదికి వెదికి పైకి తీసి ఎంతో చర్చించేది భారతి. శంకరాచార్యులు తొణుకు బెణుకు లేకుండా జవాబు చెపుతూవుండేవాడు. కాని మనస్సు మాత్రం లోలోపల తడబడుతూ వుండేది. ఈసారి ఏమవుతుందో? ఎవరు పీగిపోతారో? ఏమో! కానైతే, తన లక్ష్యంమీద తనకి పూర్తిగా విశ్వాసముంది. శ్రద్ధా వుంది. అందుచేత ఎంతక్లిష్టమయిన ప్రశ్న అయినా సరే, జవాబు చెప్పడంలో ఆయనకి కష్టమయ్యేదికాదు. దృష్టి సరిగావున్న వ్యక్తికి ప్రతిదీ సరిగానే అవుపిస్తుంది. అది మంచిదైనా సరే, చెడ్డదైనా సరే, కఠినమైందైనా సరే, కోమలమయిందయినా సరే, చిన్నదైనా సరే, పెద్దదయినా సరే- తన దారీ, తన గురీ తెలిసిన వ్యక్తి దేనికయినా సరే, సూటిగా స్పష్టంగా జవాబు చెప్పేస్తాడు.

చర్చించవలసిన విషయాలన్నీ బాగా చర్చించింది భారతి. అన్నిటికీ అన్ని సమాధానాలు చెప్పాడు ఆచార్యులు. చివరికామె అంది, ''మీ సిద్ధాంతాలన్నీ బాగానే వున్నాయి. కాని ఆచార్యా! మీ మాయాసిద్ధాంతమూ, సర్వాత్మైక సిద్ధాంతమూ - ఇవి సన్యాసులకి మాత్రం సత్యం కావచ్చు. సంసారం చేస్తున్న గృహస్థులు మీ నైష్కర్మ్య సిద్ధాంతం ఒప్పుకోలేరు. మీ వేదాంతం ఆచరణలో పెట్టలేరు. అందుచేత మీ సిద్ధాంతాల్లో వ్యావహారిక దోషం స్పష్టంగా అవుపిస్తోంది నాకు.''

దీనికేం సమాధానం చెప్పుతాడు శంకరాచార్యులు? బాల్యావస్థలోనే సన్యాసం పుచ్చుకున్నా డాయన. సన్యాసం పుచ్చుకుని ప్రపంచానికి దూరంగా పోలేదు. నిజమే కాని, సంసారం దేన్ని సంసారమని భావిస్తు న్నదో, దానిలో ఆయనకి ప్రవేశ మేముంది? ఆయన సిద్ధాంతాలు ఒక్క సన్యాసుల కోసమే కాదు, సంసారులకోసమున్ను. ఆయన వాదనే అది. ఈ వాదన కాదని తీసిపారెయ్యాలనుకుంటోంది భారతి. ఆమె అన్నదానికి మాటలతో సమాధానం చెపితే చాలదు. వ్యవహారంతో సంబంధించిన విషయమది. క్రియలో చూపించడమే దానికి సమాధానమవుతుంది. కనుక శంకరుడు ఒక ఆరు మాసాలు గడువు అడిగాడు. వేదాంతాన్ని వ్యవహారి కంగా చూపించడానికి.

ఈ సందర్భంలో ఒక వదంతి ప్రచారంలోవుంది. భారతి దగ్గిర నుంచి వచ్చేశాడు శంకరాచార్యులు. అడవిలో ప్రవేశించాడు. తన శరీరం లోంచి ఆత్మని తీసేసుకుని, అప్పుడే మరణించిన ఒక రాజు మృత దేహంలో ప్రవేశపెట్టా డాయన. చచ్చిపోయిన రాజు బతికి లేచాడు. రాజ పరివారం ఆనందం చెప్పతరంకాదు. మహారాణుల దుఃఖాశ్రువులు ఆనం దాశ్రువులుగా మారిపోయాయి. రాజ్యంలోని ప్రజలు ఆనంద తరంగాల్లో ఓలలాడారు. రాజు శరీరంలో ప్రవేశించి రాచకార్యాలు నిర్వహించడం మొదలుపెట్టాడు శంకరాచార్యులు సాంసారికానుభూతు లనుభవించాడు. రాజిప్పుడు వెనకటి రాజుకాదు. అతడి జీవనంలో పరివర్తనం స్పష్టంగా అవుపిస్తోంది. మహనీయంగావుంది అతడి మనుగడ. అతడిలో సాత్త్విక ప్రవృత్తి నిండివుండేది. రాచకార్యాలు మునుపటికంటే దివ్యంగా వున్నా యిప్పుడు. ప్రజల్లో సుఖశాంతులు వృద్ధయ్యాయి. రాజుగారి మంత్రులు గమనించారిది. 'ఏదో ఒక మహాత్ముడి ఆత్మ రాజుగారి మృతదేహంలో ప్రవేశించింది!' - ఈ నమ్మకం బాగా బలపడిపోయింది వాళ్ళకి. మహా

త్మ్రడి ఆత్మ తిరిగి తన పూర్వ శరీరంలోకి వెళ్ళిపోకుండా వొక ఉపాయ మాలోచించారు వాళ్ళు. నాలుగు దిక్కులా మనుషుల్ని పంపారు. ఎక్కడన్నా శవమన్నది కనిపిస్తేచాలు, తగలబెట్టెయ్యండని ఆదేశించారు. రాజసేవకులు శవంకోసం వెదకడం మొదలుపెట్టారు.

శంకరాచార్యుల శిష్యులు ఆరు మాసాల వరకూ నిరీక్షించారు. భద్రంగా ఆయన శరీరం కాపాడుతూ వచ్చారు. అంతవరకూ ఆయన రాలేదు. దానితో సందేహం కలిగింది వాళ్ళకి. ఆచార్యులు రాజ్య వ్యామోహంలో పడిపోయాడని భావించారు. వాళ్ళలో ఇద్దరు శిష్యులు వెదుకుతూ ఆయన కోసం బయలుదేరారు. శంకరాచార్యులు రాజుగావున్న రాజ్యంలో ప్రవేశించారు. రహస్యంగా కోటలోకి వెళ్ళారు. రాజభోగాల్లో వోలలాడు తున్నాడు రాజు. రాచకార్యాల్లో తీరికలేదాయనకి. చుట్టూ పరివారం గుమి కూడి వున్నారు. శిష్యుల్లో వొకడు వొక శ్లోకమల్లాడు. రాజు గారికి విని పించాడు. ఆచార్యుల కర్తవ్యమూ వాస్తవిక జీవనమూ జ్ఞాపకం చేశాడు. దగ్గిరవున్న వాళ్ళెవళ్ళకీ ఏమీ అర్థం కాలేదు. ఆచార్యుల పూర్వ స్మృతి వొక్కసారి పురి విప్పింది. ఉత్తర క్షణంలో రాజు ప్రాణాయామం బిగ బట్టాడు. నవ్వుతూ తుళ్ళుతూవున్న రాజు చప్పున క్షణంలో మరణించాడు. రాజభవనం యావత్తూ గొల్లుమన్నారు.

అటు రాజసేవకులు శవంకోసం గాలిస్తూ గాలిస్తూ తుదకి శంకరాచార్యుల శరీరం కనిపెట్టేశారు. దానిని తగలబెట్టడానికి సిద్ధపడ్డారు. వెంటనే చితిపేర్చారు. ఆచార్యుల శరీరం చితిమీద పెట్టారు. శిష్యులు గోలు గోలుమన్నారు. ఇంతలో కళ్ళు నలుముకుంటూ ఓం అంటూ చితిమీద లేచి కూచున్నాడు శంకరాచార్యులు. రాజసేవకులు భయపడిపోయారు శిష్యుల ఆనందానికి అంతు లేకపోయింది.

ఇలా పరకాయప్రవేశం* చేసి అన్ని అనుభవాలూ గడించాడు. తిరిగి మాహిష్మతీపురం వచ్చాడు. తన వేదాంతం వ్యావహారిక స్వరూపం భారతికి బోధపరిచాడు. ఆమె అడిగిన ప్రతి ప్రశ్నకీ సమాధానం చెప్పాడు భారతి మనస్సులో సందేహాలు పటాపంచలయిపోయాయి. ఆమె కూడా తన భర్తతోపాటు సన్యాసం పుచ్చుకుంది. వాళ్ళు యావన్మందీ కలిసి ఆచార్యులతో దిగ్విజయ యాత్ర సాగించారు. మండనమిశ్రులతోపాటు అతడి శిష్యులున్నూ ఎంతో మంది శంకరాచార్యుల వెంట నడిచారు. ఐతే మండనమిశ్రుల పేరు ఇప్పుడు సురేశ్వరాచార్యులయింది.

---

* పరకాయప్రవేశం గురించిన వదంతి ఎంతవరకూ నిజమో చెప్పడం కష్టం. యోగశక్తి గురించి అనేకమయిన వింతలు వింటాం. చూసిన వాళ్లూన్నూ ఎన్నో చెప్పడం కద్దు. శంకరాచార్యులువంటి యోగి ఏది చేశాడన్నా ఆశ్చర్యం లేదు. యోగశక్తి విషయం వదిలేసినా ఈ వదంతిలో కొంత సత్యం వుందనే అనిపిస్తుంది. శంకరాచార్యులు తన వేదాంతం వ్యావహారిక స్వరూపం చూపించడం కోసం ఆరు మాసాలు అమరుకరాజు శాసనసూత్రం తాను పుచ్చుకుని వుంటాడు. ప్రజాహితమైన పరిపాలన కోసం అంత మహనీయుడైన ఆచార్యులచేత రాజు శాసనాధికారం సమర్పించడంలో వింతేముంది? శంకరాచార్యులు దక్షతతో రాజ్యం పరిపాలించాడన్నది మాత్రం నిజం. తాను నిర్వహిస్తూవున్న రాచకార్యాల్లో పడి తన్ను తాను మరచిపోయాడాయన. ఆరు మాసాల తరవాత రాజ్యమూ, వైభవమూ - అన్నీ వొదిలేసి, తిరిగి సన్యాసానికి వచ్చేశాడు. ఇదే వ్యక్తం చేస్తుంది- ఆయన త్యాగమూ, నిస్పృహా ఎంత వుందో!

శంకరాచార్యుల కిప్పుడు హేమాహేమీలలాంటి కార్యకర్తలు దొరికారు. వేలాది జనమాయన మతం పుచ్చుకుంటున్నారు. కాని అంత మాత్రాన తృప్తిపడలే దాయన. భారతదేశం యావత్తూ ఒకే ఒక్క ఆత్మ కావాలని కోరుతున్నా డాయన. ప్రజానీకమంతటికీ అద్వైతం బోధించాలని ఆయన సంకల్పం. ఈ మహాలక్ష్యం సాధించడానికి ఇంతవరకూ జరిగినపని సముద్రంలో ఒక నీటిబిందువు. తన పనిమీదా, తన శక్తిమీదా ఆయనకి సంపూర్ణమైన విశ్వాసముంది. భగవంతుడిమీద శ్రద్ధా వుంది. తనకి తెలుసు, తప్పకండా తనకి విజయం లభిస్తుంది. అంచేత జయాపజయాలన్న విచారం మానేసి, తన పనిలో తాను నిమగ్నుడయ్యా డాయన. తన సర్వస్వమూ సమర్పించి కార్యమగ్నుడైనవాడు, తన జీవనంలోని ప్రతిదానిలోనూ తన లక్ష్యమూ, తన కార్యమూ పరలక్షితమైనవాడు సాఫల్యంకోసం చూడనక్కరలేదు. సాఫల్యమే తన పాదాల దగ్గిరికి వస్తుంది. శంకరాచార్యుల స్వల్ప జీవనంలో కూడా అదే అనుభవమయింది.

మాహిష్మతి నుంచి శంకరాచార్యులు దక్షిణాదికి బయలుదేరాడు. దారి యంతటా జనమాయన పాదాక్రాంతులయేవాళ్ళు. రకరకాల దేవతల పూజారు లాయనతో కలిశారు. తమ దేవతలే తమ సర్వస్వమని భావించే వాళ్ళు వాళ్ళు. శంకరాచార్యులు ఏ దేవతనీ కాదనలేదు. ప్రజల శ్రద్ధాభక్తులు ఖండించలేదు. శ్రద్ధ ఒక దైవగుణం. దానిని నాశనం చేయడ

మంటే ఒక మంచిగుణం నాశనం చెయ్యొద్దన్న మాట. అందుచేత శ్రద్ధా గుణం నాశనం చెయ్యకుండా, శ్రద్ధ తాలూకు కేంద్రం మార్చేసేవా డాయన. చిల్లర దేవతల పూజ జ్ఞానమయుడైన పరమేశ్వరుడి పూజే. ఏమంటే, ఆ పరమేశ్వరుడి శక్తి సర్వత్రా వ్యాపించివుంది. జడచేతనం లోనూ అతడే నివసిస్తున్నాడు. ఉపాసనా విధులన్నిటిలోనూ ఒకే ఒక హిందూ హృదయం ప్రేరణ కలిగిస్తోందని ప్రబోధించాడాయన. రక రకాల పూజా పద్ధతుల మాటున ఆ పరమ దయామయుడైన పరమేశ్వ రుడి మీద ఒకే రకమైన కృతజ్ఞతాభావం ద్యోతకమవుతుంది. ఆ పర మేశ్వరుడే మనకి ధన ధాన్యాలు ప్రసాదించాడు. విశాలమైన భూమీ, సకల విధాల సుఖ సాధనాలూ అనుగ్రహించాడు. సత్యాన్వేషణ కోసం, ప్రకృతి పరిణామ రహస్యాలు గ్రహించడం కోసం మానవుల్లో ఒక్క ప్రవృత్తే పైకి భిన్నభిన్న పరిణామాల్లో అవుపిస్తుంది. తమ వైదిక పరం పరను కాపాడుకోవాలన్న ఒక విధమైన ఇచ్ఛా, తమ పుణ్యభూమి భారతి నుంచి స్ఫూర్తిని పొందాలనే ఒకే విధమైన అభిలాషా, తమ జాతీయ జీవ నాన్ని స్వతంత్రంగా ఉంచుకుంటూ అత్యున్నతమైన వికాస స్థాయిని చేరుకోవాలనే ఆకాంక్షా - ఒకచోట సూర్యోపాసనగా రూపొందితే మరొక చోట శక్తి పూజగా పరిణమిల్లింది. ఒకచోట గణపతిని ఆరాధ్య దైవంగా మన్నించి భారతదేశంలో మూలమూలలా ద్వాదశ గణపతి మందిరాలను సృష్టిస్తే, మరొకచోట పద్దెనిమిది జ్యోతిర్లింగాలను స్థాపించి, భారతదేశానికి ప్రదక్షిణం చేయడానికి ప్రయత్నించింది. అదే మహదభిలాష ఒకచో భగవాన్ వాల్మీకి వాణినుంచి ఆదికావ్యమై అవతరిస్తే, మరొకచో శ్రీమద్భా గవతం యొక్క మధుర కథతో ప్రజా సముదాయాన్ని ముంచెత్తింది. అదే మహదభిలాష ఒకవైపు ఒకే ఆసనంతో యోగాభ్యాసంలో సంవత్స రాల తరబడి సాధన జరిపిన మహాయోగులను జన్మింపజేస్తే, ఒకచోట కఠోర కరవాలంతో క్రూరత్వాన్ని తలత్రెంచి యముని చేతుల నుంచి

తప్పించుకొన్న కాపాలికుల్ని సృష్టించింది. ఒకచో నిరంతరం సరస్వతిని ఆరాధించే సాహిత్యకారులకు సృష్టిసారం పిండగల కీర్తిని ప్రసాదిస్తే, మరొకవైపు దుర్మార్గులు దురాక్రామకులు దుర్వర్తనులు అయిన శత్రువుల రాణువలను కత్తులకెరజేసి ప్రజలపై కృపారసాన్ని ఒలికించిన రాజన్యులకు రాజ్యలక్ష్మిని చేకూర్చింది.

శాక్తేయులూ, వైష్ణవులూ, శైవులూ, గాణాపత్యులూ, సూర్యోపాసకులూ - వీళ్ళందరూ ఒకే పరాశక్తిని ఉపాసిస్తున్నారు. వెయ్యి ముఖాలు, వెయ్యి బాహువులూ, వెయ్యి పాదాలూ, వెయ్యి నేత్రాలుకల ఆ రాష్ట్రి పురుషుణ్ణి భిన్న భిన్న రూపాల్లో పూజిస్తున్నారు.

శంకరాచార్యుల ఈ సదుపదేశంతో లోకులు తమ నిధిని ఒదులుకోలేదు సరికదా, వాళ్ళకి మరో గొప్ప నిధి కూడా దొరికింది. జీవన వైశాల్యంతోనూ, లక్ష్యం తాలూకు ఔన్నత్యంతోనూ దానికి సంబంధం మేర్పడింది. పైకి వెళ్ళాలని మీది మెట్టుమీద కాలు పెట్టినవాడు సహజంగానే తొలిమెట్టు ఒదిలిపెడ్తాడు. కిందిమెట్టు మరిచిపోతాడు. దానిని వదిలెయ్యడ మతడికి కష్టమనిపించదు. అలాగే శంకరాచార్యులు యావన్మందినీ పైకి లేవనెత్తాడు. భిన్న భిన్న లక్ష్యాల సుడిలో పడిన పథికుల్ని విశాలమైన జాతీయ గంగా ప్రవాహంలో చేర్చాడు. దాంతో దానంతట అది నశించింది కుళ్లు జీవనంలో పావిత్ర్యం ప్రవేశించింది. హిందూ హృదయంలోని అగాధమైన విశ్వాసం ఇంతవరకూ చిల్లర దేవతల చిన్న చిన్న పాత్రల్లో ఇముడక పైకి పొంగిపోతూ ఉండేవి. పొరుగువాళ్ళని విమర్శించేది. దాని కిప్పుడు విశాలమైన ఏకత్వమనే అద్వైత సాగరంలో స్థానం దొరికింది. దాంతో హిందూ సంస్కృతీలత సహనమనే నీరు పీల్చి నవనవలాడింది.

ఎంతోమంది శత్రుభావంతో శంకరాచార్యుల దగ్గిరికి వచ్చేవాళ్ళు. కాని ఆయన ఎదటికి రాగానే వాళ్ళ శత్రుభావం పటాపంచలయిపోయేది.

అద్వితీయమైన మతిమంతుడు శంకరాచార్యులు. ధర్మమూ, విజ్ఞానమూ, సాహిత్యమూ, ఇతిహాసాలు, పురాణాలూ - అన్నిటిలోనూ ఉద్భటుడయిన పండితుడేగాక, జాతీయాత్మతో ఏకాత్మభావాన్ని పొందిన మనీషి. అంతటి మహనీయుణ్ణి కూడా బోధపరిచి తమ మతంలో కలుపుకోవాలని చూసేవాళ్ళు కొందరు! ఆయనకీ ఒంపులు దిద్దడానికి సాహసించేవాళ్ళు. అయితే ఆయన మార్గం సర్వాంగ పరిపూర్ణమైంది. ఎలాంటి పెనగు లాటకూ అక్కడ చోటుండేదికాదు. అలా గర్వంతో వచ్చేవాళ్ళు, తల దించుకు వెళ్ళిపోయేవాళ్ళు.

దక్షిణ దేశంలో సంచారం చేస్తూ శంకరాచార్యులు కంచి వెళ్ళాడు. కంచిని దక్షిణకాశి అంటారు. ఉత్తరాదిని కాశీలాగే దక్షిణాదిని కంచి సంస్కృతికి కేంద్రం. కేవలమది సంస్కృతికీ, ధర్మానికీ మాత్రమే కేంద్రంకాదు- ధనధాన్యాలకీ కూడా కేంద్రమే. పల్లవ రాజులకి రాజ ధానిగా ఉండే భాగ్యం దానికే లభించింది. మహా ప్రతాపశాలి పులకేశి మహారాజు ప్రతిభ నాశనం చేసిన నృసింహవర్మ మహారాజు కీర్తి నేటి దాకా కంచిలో వెలుగుతూనే ఉంది. కాంచీపురం అంగళ్లూ, ఎత్తయిన గోపురాలూ, తోరణాలూ, ప్రాకారాలూ లక్ష్మి నిలయంగా ఉండేవి. సరస్వతీదేవి కాంచీపట్నం కాశీగా తయారుచేస్తే, లక్ష్మీదేవి దాన్ని పాటలీ పుత్రం చేసింది. కంచిలో శంకరాచార్యులు కొన్నాళ్ళు నివసించాడు. నాలుగు దిక్కులా ఆయన పాండితీ ప్రతిభ వ్యాపించింది. దక్షిణదేశ మంతటా ఆయన వాణి ప్రతిధ్వనించింది. ఎక్కడ చూసినా ఆయన అనుయాయులే అవుపించారు. శంకరాచార్యుల జీవనకార్యం పూర్తయి నట్లనిపించింది. కాని ఆయనకి తెలుసు, ప్రజల జ్ఞాపకశక్తి పరిమిత మైంది. క్షణికమైన ఆవేశంతో వాళ్ళ భావాలోకవంక పెద్దపెద్ద కెరటాల్లా లేస్తాయి. లోకాన్ని ముంచెయ్యడానికి ప్రయత్నిస్తాయి. కాని ఒడ్డుకు వెళ్ళి దెబ్బ తినేస్తాయి. చిందరవందరయిపోతాయి. వాటి గుర్తుకూడా మిగలదు.

అందుచేత ప్రజల్లో ఐక్యభావం యుగ యుగాలదాకా చెక్కుచెదరకుండా వుండే ఏర్పాటు చెయ్యాలి. భావనలోనూ, ఆచరణలోనూ ఇప్పుడు తేచిన ఐక్యలహరి చిరస్థాయిగా వుంటేనే సమాజంలో సంఘటన దృఢపడుతుంది. శాశ్వతమవుతుంది. అలా కానప్పుడు, అది నీటిబుడగలాగ క్షణికమై నశించిపోతుంది. అంచేత మఠాలు స్థాపించాలని నిశ్చయించా డాయన. ఎలాంటి మఠాలవి? సంఘాన్ని ఉత్సాహపరిచేవి, దానికి జీవ నదిలా వుండేవి. ప్రతి ఒక్కరికీ శ్రద్ధాకేంద్రాలుగా వుండేవి. అలాంటి మఠాలాయన సంకల్పించాడు. విలాసాలు వెలిగించే మహంతులికీ, చాటుకారులైన శిష్యులకీ రంగస్థలాలు కావవి. నిజమైన సంఘ సేవకులు, దేశనాయకులు, జ్ఞానులు, పండితులు, స్వార్థత్యాగులూ, దృఢనిశ్చయులగు కార్యకర్తల్ని తయారుచేసి దేశమంతటా పంపే శిక్షాకేంద్రాలవి. అలాంటి మఠాలు స్థాపించాడు శంకరాచార్యులు. అది మఠం కంచిలోనే ఆయన స్థాపించాడంటారు. కాని శృంగేరీలో స్థాపించిన మఠమే హెచ్చు ప్రసిద్ధిపొంది, నేటివరకూ అవిచ్ఛిన్నంగా సాగుతూ వుంది. శృంగేరీలో సురేశ్వరాచార్యుల్ని తొలి మఠాధిపతిగా నియమించా డాయన. ఉత్తరాది మిథిల బ్రాహ్మణుడు, దక్షిణాదిని జ్ఞానశిక్షణ గరిపే మఠాధిపతి అయ్యాడు. ఆయన ధర్మపాఠాలు బోధించి, ఆయన తాలూకు ధార్మిక వ్యవస్థా సాంఘిక వ్యవస్థా నడిపే ఆచార్యుడయాడు. అలాగే దక్షిణాది బ్రాహ్మణుడు ఉత్తరాది జోశీ మఠాచార్యుడయ్యాడు. ప్రత్యేక జీవన క్షేత్రంలోనూ ఈ ఐక్యత నిలపడం కోసం ఎంతో జాగ్రత్త తీసుకున్నాడు శంకరాచార్యులు. అందు చేతనే ఇవాళ చైతన్యమయమైన, అవిభక్తమైన, అవిచ్ఛిన్నమైన భారత స్వరూపమే మనకి ఆరాధ్యమయింది.

శంకరాచార్యులు దక్షిణాది కార్యక్రమం పూర్తిచేశాడు. తిరిగి తన రథం ఉత్తరాదికి మళ్ళించాడు. ఆయన కీర్తి విని సుధన్వరాజు ఆయన వెంట నడిచాడు. శంకరాచార్యుల పేరు దేశం నలుమూలలా ప్రతిధ్వనిస్తోంది. ఆయన ఎక్కడికి వెళితే అక్కడ తండోప తండాలు జనం

విరగబడేవాళ్ళు. పెద్ద పెద్ద సభలలో ఉపన్యసించడమూ, గుంపులు గుంపులు ప్రజల్ని తన మతంలో కలుపుకోవడమూ దినకృత్యమే అయి పోయిం దాయనకి. ప్రజలముందు నుంచుని ఉపన్యసించినప్పుడు అయో మయమైన భాష ప్రయోగించేవాడు కాడాయన. తన భావాలు సూటిగా తేలికయిన వ్యావహారిక పదాలతో వ్యక్తపరిచేవాడు. ప్రజల్ని భగవత్స్వ రూపులుగా భావించేవాడు. వాళ్ళముందు ఆత్మ నివేదనం చేసేవాడు. హృదయం విప్పి ప్రదర్శించేవాడు. కళ్ళు విప్పి చూసేవాళ్ళు జనం. ఆయన హృదయంలో తమకోసం ప్రేమా, దేశంకోసం వేదనా, ధర్మంకోసం తహతహ దర్శించేవాళ్లు. స్వార్థం మచ్చుకయినా వుండేది కాదందులో. దంభమూ, అహంకారమూ ఏ కోశానా కనపడేదికాదు. ఆయన హృద యంలో తమ నిజ స్వరూపమే అవుపడేది జనానికి. అందులో తమకి చోటు దొరికేది. దాంతో ఆయనకి పాదాక్రాంతులయి పోయేవాళ్ళు వాళ్ళు. ఎన్నో మతాలవాళ్ళు ఆయన దగ్గరికి వచ్చారు. ఆయన మతం పుచ్చుకున్నారు. ఆయన దగ్గరే వుండిపోయారు. మధ్యార్జునంలో శైవులతో భేటీపడిం దాయనకి. శివుణ్ణితప్పిస్తే ఇంకో దేవతని పూజించడమే తెలియదు వాళ్ళకి. వైష్ణవులంటే వాళ్ళకి ఒళ్ళు మండేది. అది అనేకసార్లు కలహం వరకూ వచ్చేది. శంకరాచార్యులు వాళ్ళ విరోధం శాంతపరిచాడు. శివుడు నిజంగా దేవాదిదేవుడే అయితే, సర్వజ్ఞుడే అయితే అతడు సర్వాంతర్యామీ, సర్వ వ్యాపకుడూ, అనంత చైతన్యమయుడూ అయిన పరబ్రహ్మస్వరూపుడే కాని మరొకడు కాడుకదా! వైష్ణవులుకూడా శివపూజ చేస్తున్నారు. రూపం భిన్నంగా వుండడంచేత బ్రహ్మం భిన్నంలా అవుపిస్తుంది. తాను ఆరా ధించేదాన్ని సరిగ్గా తెలుసుకున్నవాడు కలహించనే కలహించడు. తెలియని వాడు కలహించాడంటే అది వేరే సంగతి. శంకరాచార్యులవాదం శివ భక్తులకి నచ్చింది. వాళ్ళ హృదయాల్లోని కల్మషం తొలగిపోయింది. సంపూర్ణ సమాజంయొక్క శివత్వానికై వారి హృదయం వికసించింది.

మధ్యార్జునంలో శివపూజా చర్చ సాగించి శంకరాచార్యులు విదర్భ వెళ్ళాడు. నల మహారాజు చరిత్ర వింటూ విదర్భ ప్రాంతాలు సంచారం చేశాడాయన. అనేకరకాల ఉపాసకుల్ని ఓడించాడు. లక్ష్మి ఉపాసకులు కేవలం లక్ష్మీదేవినే ఆరాధించేవాళ్ళు. పగలూ రాత్రీ డబ్బు డబ్బు- ఇదే పాట వాళ్ళకి. డబ్బు ఎలా వినియోగించాలో వాళ్ళకి బోధపరిచా డాయన. విష్ణుసేవలోనే లక్ష్మిజీవనం సార్థకమవుతుంది. శేషశాయి అయిన విష్ణుమూర్తి పాదాలు సేవించడమే లక్ష్మీదేవి జీవితకాలమంతా చెయ్యవలసిన పని. అందుచేత ధనం ధర్మం కోసమే వినియోగం కావాలి. దేవుడికార్యం కోసం వినియోగపడని ధనం వ్యర్థం. ధనమన్నది సాధనమే కాని సాధ్యం కాదు. శంకరాచార్యుల వ్యక్తిత్వ ప్రభావమూ, ఆయన ఉపదేశ ప్రకాశమూ ఉలూకవాహిని అయిన లక్ష్మీదేవి అనుచరుల హృదయాల్లో చీకట్లు పార దోలింది. వెలుగు ప్రసాదించింది. వాళ్ళజీవనంలో శాంతి, సమాధానమూ కుదిర్చింది.

ఇలా దారిలో దిగ్దిగంతాలు తన జ్ఞానంతో వెలిగిస్తూ, మార్గంలోని కష్టాలు తన పురుషార్థంతో మటుమాయం చేసుకుంటూ శంకరాచార్యులు జగన్నాథం వెళ్ళాడు. దేశమన్నిదిక్కులనించీ యాత్రికులు జగన్నాథస్వామి దర్శనం కోసం వచ్చేవారు. అంతమందీ తమ తమ భేదాభిప్రాయాలు మరచిపోయి ప్రేమతో అక్కడ కలుసుకునేవాళ్ళు. ఒకే భక్తిభావంతో జగన్నాథస్వామి ముందు తలవంచి నమస్కరించేవాళ్ళు. ఇవాళ్ళలాగే అవాళకూడా 'సర్వం జగన్నాథం' గానే వుండే దక్కడ. 'జగన్నాథప్రసాదంలో పంక్తి భేదం లేదు'. చిన్నా పెద్దా, రాజూ పేదా, బ్రాహ్మణుడూ శూద్రుడూ, పండితుడూ, మూర్ఖుడూ - భేదభావం లేకుండా ఒక్క పంక్తిలో ప్రసాద మారగించినప్పుడు - భారతీయైక్యతను గురించి సముద్రం గొంతెత్తి ఘోషిస్తుంది. ఘోషిస్తూ తూర్పుదిక్కు దూరదూర ద్వీపాల దాకా పరిగెడుతుంది. అనేక శాఖలుగా విభక్తమైన ద్వైపాయన

సభ్యతనీ, సంస్కృతినీ ఈ మహోదధి అమృతవాణే ఒక్క సూత్రంతో కూర్చింది. మాతృభూమి ఐక్యతా ప్రభావం ద్వీపాంతరవాసుల మీద పడిందంటే వింతేముంది?

కంచిలోనూ, శృంగేరిలోనూ స్థాపించినట్టే శంకరాచార్యులు గన్నాథంలో కూడా పూర్వ ప్రదేశాలకి మార్గదర్శకంగా గోవర్ధనమఠంజ స్థాపించాడు. శృంగేరీ మఠంలోంచి వెలువడినట్టే ఇక్కడినించి కూడా సన్యాసులు వెలువదేవాళ్ళు. అందుచేతే దక్షిణాదీ, తూరుపూ ఒక్కలాగే తయారయ్యాయి.

పూరీనుంచి కాశీగుండా పడమటి దిగ్విజయానికి బయలుదేరాడు శంకరాచార్యులు. తూర్పున ఎలా జరిగిందో పడమటినీ అలాగే జరిగింది. సూర్యు డెక్కడికి వెళితే అక్కడ వెలుగు ప్రసాదిస్తాడు తన ఐక్యతా సందేశం వినిపిస్తూ శంకరాచార్యులు ద్వారకాపట్నం వెళ్ళాడు.

దేశ కల్యాణంకోసం నింద లెక్కచెయ్యకండా, యుద్ధంలోంచి పారిపోయిన శ్రీకృష్ణుడు స్థాపించిన పట్నం ద్వారకాపట్నం. ఆ శ్రీకృష్ణుడి దేశభక్తి, ధర్మభావనా, ఏకరాజత్వం స్థాపించాలన్న మహత్సం కల్పమూ ఇవాళకూడ వెయ్యి నోళ్ళతో చాటి చెపుతోంది ద్వారక. ఈ భావాలను అణచాలని పడమటి సముద్రం తలెత్తుతుంది. కాని ఒడ్డుకి వచ్చి పశ్చాత్తాపంతో ఆగిపోతుంది. ఏడుస్తూ మళ్ళి పోతుంది. అంతేకాని మా తల్లి భూమి ఐక్యత భంగపరచలేదు. ద్వారకలో కూడా ఒక మఠం స్థాపించాడు శంకరాచార్యులు.

ద్వారకనించి ఉత్తరాదికి తిరగాడాయన. ఎంతో భయంకరమైన ఎడారికూడా ఆయనకి అడ్డురాలేకపోయింది. సూర్యుడి వేడికి ఎడారి ఇసుక కణకణలాడేది. శంకరాచార్యులు నెమ్మదిగా అడుగులు వేస్తూ నడుచుకు పోయేవాడు. చలీ, వేడీ- వీటికి అతీతుడయిపోయా డాయన. ఎడారి

మండిపోయి బుగ్గయి పోవుగాక, ఆయన లోపలి వేడితో పందెం వెయ్య లేకపోయే దది. సూర్యుడు తల-దించుకుని పారిపోవాలని ప్రయత్నించే వాడు. భూమి చల్లబడిపోయేది. శంకరాచార్యులు ముందుకి సాగిపోయే వాడు. ఆ ఘోరమైన ఎడారి దాటిపోయి పంచనదదేశం వచ్చేశాడాయన. అయిదు వేళ్ళలాగ అయిదు నదులూ విస్తరించి ఉన్నాయక్కడ. పంచ నద గర్భంలో గతమెంతో మరుగుపడి ఉంది. ఘనీభవించిన ఆ పురాతన స్మృతులు తలలోకి ఒకదానిమీద ఒకటి ముమ్మరంగా వస్తూవుంటే, వాటిని వేర్పరచడమే కష్టం. వైదిక సామగానం కలకలమని ప్రతిధ్వనించే సరస్వతి దగ్గర వేదవిరోధులయిన బౌద్ధుల కల్లోలం చూసి సహించలేక పోయాడు శంకరాచార్యులు. పురు చక్రవర్తి ప్రచండపౌరుషకీర్తి విపాశా నది గానం చేస్తున్నచోట, చంద్రగుప్తుడి శౌర్యమూ చాణక్యుని చాతుర్యమూ వీటి ముందు సింధునది తలవంచిన చోట కొందరి జాతీయ విరుద్ధమైన ప్రవృత్తులవల్ల పరాయి ఆక్రమణకారులు విరగబడడం భరించలేక పోయాడు. ఈ వేదవిరోధుల్ని నాశనం చెయ్యడానికే ఆయన కంకణం కట్టాడు. దానికి సరయిన అవసరం ఇక్కడే వచ్చిందాయనకి.

ఇంతవరకూ ఆయన హిందూత్వంలో ఐక్యత ప్రతిపాదించడమూ, దానిని సంఘటితపరచడమూ, తన శక్తి చేకూర్చుకోవడమూ మొదలయిన పనులే చేశాడు. లోపలి శక్తి నిర్మించుకున్న తరువాత, బాహ్యశత్రువుల కేసి పరికించవలసిన అవసరమేర్పడిం దప్పుడు.

## ౧౧

శంకరాచార్యులు తన అభిలాష పూర్తిచేసుకుందుకు ఎన్నో దినాలు ఆగవలసినపని లేకపోయింది. తక్షశిల చేరాడో లేదో ఆయన, బౌద్ధులతో యుద్ధమారంభమై పోయింది. తర్కంలో తమని మించినవాళ్ళు లేరనుకునే వాళ్ళు బౌద్ధులు. శబ్దార్థాలు విడమర్చి, సూక్ష్మవిచారణచేసి, శాస్త్రచర్చలో ఎంతటి కొమ్ములు తిరిగిన పండితుణ్ణయినా సరే, ఇట్టే హతోస్మి అనిపించ గలమని వాళ్ళ ధీమా. శబ్దార్థాలు వ్యాఖ్యానించడము; తమ వాగ్వైభవం ప్రదర్శించడమూ-ఇదే వాళ్ళపనిగా మిగిలింది. వాళ్ళలో వాళ్ళున్నా పర స్పరం వితండవాదం చేసుకునేవాళ్లు. అలాంటపుడు పైవాళ్ళని ఆ గోదాలోకి లాగడంలో వింతేముంది? కాని, శంకరాచార్యులాగోదాలో దూరేవ్యక్తికాదు. ఆయన ఎదుట పెద్ద పెద్దవాళ్ళే నీరసించేవాళ్ళు. శబ్దాలాయన కాధారం కాదు. వ్యవహారమే ఆధారం. శుష్కతర్కమెన్నడూ ఆయన ఆశ్రయించ లేదు. అలా అని ఆయనకి తర్కం చేతకాదని కాదు. ఆయన సిద్ధాంతం తర్కానికి వ్యతిరేకమనీకాదు. ఐతే కార్యకౌశలమనే మొక్క తర్కమనే ఎడారిలో పెరగదు. భావన అనే లోయల్లోనే అది నవనవలాడుతుంది. శబ్దాల జంజాటం మనిషిని కింకర్తవ్యతావిమూఢుణ్ణి చేసి వొదిలి పెడుతుంది. అందుచేత శబ్దాడంబరమంటే క్రోసెడు దూరం పరిగెత్తేవా డాయన. ఈ మహాపండితుడితో శాస్త్రచర్చ సాగించడం కోసం కత్తులు నూరుతూ కూచున్నారు బౌద్ధులు. మళ్ళీ ఒకసారి ప్రియదర్శి అశోకుడి కాలంలో

సర్వత్రా బౌద్ధమయంగా వుండిన దినాల స్వర్ణస్వప్నాలు కంటూ కూచున్నారు వాళ్ళు. శంకరాచార్యుల్ని బౌద్ధంలో కలిపెయ్యగలమన్న నమ్మకం పూర్తిగా వుండేది వాళ్ళకి. శంకరాచార్యులంటే ఏమిటో వాళ్ళకి బాగా తెలుసు. ఆయన ప్రభావమెంతటిదో అదికూడా బాగా తెలుసు. ఆయనని బౌద్ధుల్లో కలిపేస్తే మళ్ళీ ఒకసారి భారతదేశమంతా బౌద్ధమయమయి పోతుంది. అదీ వాళ్ళ ఊహ. రెండు దిక్కులా వ్యూహాలు తయారయ్యాయి. బౌద్ధభిక్షువులే ముందు కథ ప్రారంభించారు:

"శంకరాచార్యా, మీవంటి మహాపురుషులు మా మధ్యకి వచ్చి, సత్యం తెలుసుకోవాలన్న ఉత్కంఠతతో మాతో ప్రసంగించడానికి పూనుకోవడం మహానందంగా వుంది మాకు. ఈ ప్రపంచం దుఃఖమయమైంది. ఇందులో శాంతికోసం ఏదన్నా మార్గముందా అంటే అది బుద్ధుడి మార్గమే. అది తప్పించి మరో మార్గం లేదు. జీవహింస వదిలిపెట్టండి. సేవాధర్మం పరిగ్రహించండి. వైదిక కర్మకాండ జంజాటంలో పడి మీ నైతిక జీవనం పాడు చేసుకోకండి. 'సంఘం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి' అంటూ నిర్వాణపదానికి అర్హులు కండి."

"మీ రన్నదానితో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను ధర్మభిక్షూ!" అన్నాడు శంకరాచార్యులు. "బుద్ధ భగవానుడు నాకున్నూ పూజ్యుడే, ఆయన సహృదయతా, మానవ కళ్యాణ భావనా, సమాజదుఃఖం తొలగించడం కోసం ఆయన చూపిన ఉత్కంఠా, తన ధ్యేయంకోసం ఆయన నడిపిన కష్టజీవనమూ, దానికోస మాయన పూనిన పూనికా, ఆయన తపస్సూ, వైరాగ్యమూ, శాంతిజిజ్ఞాసల ప్రవృత్తీ- ఇవన్నీ ప్రతి వాళ్ళూ అనుసరించదగినవే. మన జాతీయ మహాపురుషు డాయన. ఆయనముందు ప్రతి దేశభక్తుడూ తలవంచవలసిందే. బుద్ధ భగవానుడితో నాకే మాత్రమూ విరోధం లేదు. ఆయన నైతికాదర్శాలకి నేను వ్యతిరేకుణ్ణి కాదు.

కాని ఇవాళ ఆయన ఆదర్శాలు పాలిస్తున్నామా మనం? ఒక్క క్షణం మీరే ఆలోచించండి, ఆయన ఆత్మ చేస్తున్న ఆక్రోశం వినగలుగుతున్నామా మనం? మన సంఘంలోని దుఃఖం చూసేకదా ఆయన ద్రవీభూతు డయ్యాడు! ఇవాళ మనమా సంఘం తాలూకు సుఖ దుఃఖాలను గురించి చింతిస్తున్నామా? బుద్ధభగవానుడు చూచి గుండెలాగిపోయిన ఆ శత వృద్ధుడు-ఎవరతడు? యవ్వనమపుడు అతడి శరీరంలో నిగనిగలాడిన భారత భూమి ధూళికణాలే తల్లి ఒడిలో విలీనం కావడంకోసం వార్ధక్యంలో మారాము చేశాడు. ఈ తల్లి కోటి కోటి పుత్రుల్ని సుఖ పెట్టడం కోసమే బుద్ధ భగవానుడు ఘోరమైన తపస్సు చేశాడు. ఎన్నో కష్టాలు సహించాడు. తుదకి బుద్ధత్వం పొందాడు. ప్రజలకి జ్ఞాన ప్రకాశం ప్రసాదిస్తూ తన జీవన సర్వస్వమూ వ్యయం చేశాడు. ఆయన భావన కొంచెమైనా మన కంట లేదిప్పుడు. శకులూ, హూణులూ చేస్తున్న ఘోరాలు ఈ కళ్ళతోనే చూస్తున్నాం మనము. ఈ పాశవిక కృత్యాలు చూసి మన హృదయం రోదించదెందుకని? మన బంధుజనం దుఃఖపడుతూ వుంటే చూసి రెండు కన్నీళ్ళయినా కార్చలేమా మనం?"

"ఐతే, ఆచార్యా! బౌద్ధధర్మం ప్రపంచంలో వ్యాపించరాదని మీ అభిప్రాయమా? అడవి జాతి వాళ్ళకీ, అసభ్య జాతి వాళ్ళకి సభ్యత నేర్పడం కూడదంటారా?" వున్నట్టుండి ఒక భిక్షు వన్నాడు. మా అందరిదీ ఇదే ప్రశ్న అన్నట్టు భిక్షువులు యావన్మందీ శంకరాచార్యుల కేసి చూశారు.

"ఎందుకు కూడదూ?" గట్టిగా అన్నాడు శంకరాచార్యులు- "బుద్ధదేవుడి ఉపదేశాలు దేశ దేశాలు ప్రాకించాలి. 'కృణ్వంతో విశ్వ మార్యమ్'అని మన ప్రాచీన సిద్ధాంతం. అందుచేత మానవులు యావన్మం దినీ పైకి తీసురావాలి. కాని భిక్షువరా, పగిలిన పాత్ర చేత్తో పుచ్చుకొని

విశ్వదాహం తీర్చడానికి మీరు బయలుదేరుతున్నారు. స్వయంగా చీకట్లో వుండి, నూనెలేని దివ్వెతో జగత్తు వెలుగు చెయ్యాలని చూస్తున్నారు. ఎంత హాస్యాస్పద మిది!"

"మీరేమంటున్నారో అర్థం కాలేదు మాకు." సగంలో అన్నాడు భిక్షువు.

"ఏమిటీ? శకుల జీవనమూ, హూణుల జీవనమూ మేం ప్రకాశ వంతం చెయ్యలేదటారా?" మరొక భిక్షువన్నాడు.

"ఇది మీ భ్రమ," అన్నాడు శంకరాచార్యులు- "బౌద్ధ ధర్మం మీద ప్రేమవుండి కానీ, బుద్ధుడిమీద ప్రేమవుండి కానీ శకులూ హూణులూ బౌద్ధమతం పుచ్చుకోలేదు. తమ జీవనం ప్రకాశవంతం చేసుకుందామని కూడా వాళ్ళు బౌద్ధులు కాలేదు. రాజనీతి పాచికకోసం బౌద్ధధర్మం విని యోగించుకున్నారు వాళ్ళు, అంతే. బౌద్ధమతం పుచ్చుకోగానే వాళ్ళంతా మీవాళ్ళే అనుకున్నారు మీరు."

"ఐతే, పైవాళ్ళని మనవాళ్ళని భావించకూడదంటారా మీరు?" సగంలో ఒక యువక భిక్షువడిగాడు.

"అబ్బాయీ, కొంచెం ధైర్యం చిక్కబట్టు" అన్నాడు శంకరాచార్యులు - "పరజనం స్వజనమని తప్పకుండా భావించు. ఎవరు వద్దంటారు నిన్ను? కాని వాళ్ళు స్వజనంగా తయారయితేకదా? వాళ్ళని నువ్వు నావాళ్ళంటే నిన్ను నీ దేశీయులనుంచి వేరుచెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు వాళ్ళు. నా వాళ్ళని భావించబట్టే వాళ్ళుసాగిస్తున్న అత్యాచారాలకి తోడ్పడుతున్నావు నువ్వు. కనిష్కుడు బౌద్ధ ధర్మం తిరిగి సంస్కరించాడు. నిజమే. దాంతో భారతీయ స్వాతంత్ర్యము గొంతుకున్నూ నొక్కేశాడాయన. మీరు ఒక్క విషయమే చూశారు. రెండో దానివంక కళ్ళు విప్పలేదు సరికదా, దానికి సహాయమున్నూ చేశారు."

"ఆయన ఏం చేసినా ధర్మం ప్రేమించే చేశాడు. దాంతో రాజనీతి ముడిపెడతా రెందుకు మీరు?'' ఒక ధర్మం భిక్షువన్నాడు.

''అవును, అశ్వఘోషుణ్ణి బలవంతంగా అతడు పాటలీపుత్రం నుంచి బంధించి తేవడమూ ధర్మాన్ని ప్రేమించడమే! శాసకుడికి ధర్మ మంటూ వుండదు. అతడికి వున్న ధర్మమల్లా ఒకటే - చన శాసనం బాగా వేళ్ళు తన్నాలి. దానికోసమే పన్నవలసిన పన్నాగమంతా పన్నా డతడు. తెలిసిందా? శాసకులు ఎత్తే ఎత్తులన్నీ దానికోసమే. వాళ్ళకి తెలుసు, భారతదేశం ప్రాచీన సంప్రదాయాలు పట్టుకు కూచుంటే, దాని సాంఘిక వ్యవస్థ యథాతథంగా వుంటే అది ఏనాటికీ తమ పాచికలో పడదు. దేశంలోని స్వాతంత్ర్యేచ్ఛ పాడుచెయ్యడానికి సహజమైన ఉపాయ మేమిటంటే - జాతీయ సంస్కృతినీ, సభ్యతనీ నాశనం చెయ్యడమే. మీరు వాళ్ళ చేతి కీలుబొమ్మలయిపోయారు సర్వవిధాలా ఈ దేశంలోని వ్యవ స్థలూ, సంప్రదాయాలూ నాశనమయిపోయివుంటే భారత భాగ్య భాస్క రుడు శాశ్వతంగా అస్తమించిపోయేవాడు. కాని ఇవాళ కూడా ఆ భాస్క రుడు దివ్యంగా ప్రకాశిస్తూనే వున్నాడు. ఈ కీర్తి ఎవళ్ళది? ఆ ప్రాచీన సంప్రదాయాల నభిమానించిన శకకర్త విక్రమాదిత్యుడిది. నాగ వాకాట కులది. గాంగులది. గుప్తులది. యశోవర్ధనుడిది. హర్షుడిది. సంప్రదాయాలు లేని హృదయంలో స్వాతంత్ర్యాభిలాష ఏదీ? ఎక్కడుందో, ఒక్క నిద ర్శనం చూపించండి?'

మాట్లాడకండా తలదించుకు కూచున్నారు భిక్షువులు. బహుశా తాము చేసిందానికి పశ్చాత్తాప పడుతున్నా రేమో వాళ్ళు! శాంతభావంతో మళ్ళీ అందుకున్నాడు శంకరాచార్యులు: "మీ సత్య సిద్ధాంతాల మీద

ఎవరికీ అగౌరవమంటూ లేదు. బుద్ధభాగవానుడు మాకున్నూ పూజనీయుడే. ప్రపంచ దుఃఖంనించి మేమున్నూ బైటపడాలనే కోరుతున్నాము. మీ పూజలూ అవీ భక్తిభావంకల ప్రతివాళ్ళకీ అవసరమే. మీకు మాకూ భేద మెక్కడుంది? మీరున్నూ హిందువులే. మనలో మనకి వాదం దేనికి?"

''ఏమిటి? మేం హిందువులమా? బౌద్ధులంకామా?'' ఎంతో మంది భిక్షువులు ఒక్కసారి గొల్లుమన్నారు.

''అవును. మీరు హిందువులు; బౌద్ధులు కూడాన్ను. మీరు హిందువులు; వైష్ణవులు; శైవులు-అన్నీను'' అన్నాడు లంకరాచార్యులు.

''ఇదేమిటీ సాలిపట్టు స్వామీ!'' మళ్ళీ గొల్లుమన్నారు బౌద్ధ భిక్షువులు.

''సాలిపట్టుకాదు, స్నేహితులారా!" స్నేహపూర్వకంగా అన్నాడు శంకరాచార్యులు - ''హిందూ దేశం మీ జన్మభూమి. ఈ పుణ్యభూమిలో నివసించిన ఆర్యుల సంతానం మీరు. రాముడూ, కృష్ణుడూ మీ పూర్వ పురుషులు. అంచేత మీరు హిందువులు. బుద్ధభగవానుడి ఆత్మ సాక్షాత్కారం పొందడంచేత మీరు బౌద్ధులు. విష్ణుమూర్తి అవతారమే బుద్ధుడు. ఆయన పూజారులు మీరు. అంచేత వైష్ణవులు. జాతి శివత్వాన్ని ఆరాధిస్తున్నారు మీరు. అంచేత శైవులు.''

''ఇవన్నీ వేదాల్లోని సంగతులు చెపుతున్నారు మీరు.'' ఒక బౌద్ధ భిక్షువన్నాడు.

''ఏం, మీ విషయం వేదంలోనూ దొరికిందనుకోండి, మీకు అభ్యంతరమెందు కంటాను?'' నవ్వుతూ అన్నాడు శంకరాచార్యులు

''ప్రాచీన గౌరవం కోసం జనం దేవులాడతారు. మీరో? మీ గౌరవం మీరు పోగొట్టుకోవడానికి పూనుకుంటున్నారు!''

''లేదు ఆచార్యా! మేమేదీ పోగొట్టుకోవాలని పూనుకోలేదు''. ఏకగ్రీవంగా అన్నారు భిక్షువులు.

''మరింకేమి? పూర్వం మన మందరమూ ఒకే ప్రవాహంలోని నీటి బిందువులం. అదిగో, ఆ ప్రవాహం పేరే ఆర్యం, హైందవం. అదే మన గౌరవ చిహ్నం. మన మన సన్మానాల మూలకందం. రండి, దాని కోసమే మన శక్తులు వినియోగిద్దాం. భగవంతుడెప్పుడూ మనల్ని రక్షిస్తూనే ఉన్నాడు. మన సంఘాన్ని పాలిస్తున్నాడు. దీనికి జీవన శక్తిని ప్రసాదిస్తున్నాడు. రాజకుమారుడు సిద్ధార్థుడు బుద్ధత్వం పొంది ఈశ్వర సాక్షాత్కారం పొందాడు. ఆయన సదుపదేశంతో పురాతన సమాజలత చివురు తొడిగింది. తప్పకుండా భగవంతుడి అవతారమే ఆయన. రండి, మనమంతా ఆయనకి నమస్కారం చేద్దాం. బుద్ధ దేవుడు ఆత్మ సాక్షాత్కారం పొందిన గయ మనకి తీర్థక్షేత్రం. అది మన పూర్వ తీర్థ పరిక ప్రవాహానికి అడ్డంకికాదు సరికదా దోహదకారి కూడా. ఆ పురాతన ప్రదేశంలో మన ప్రాచీన జీవనంమీద, మన పూర్వులమీద శ్రద్ధాభావం కలగాలి. కాగా, ప్రతీ భారతీయుడూ గయలోనే పితృ తర్పణం చేస్తాడు అక్కడే పితృ శ్రాద్ధం జరుపుతాడు. అక్కడే తన పూర్వుల పాదాల మీద శ్రద్ధాంజలి సమర్పిస్తాడు.''

శంకరాచార్యుల ఉద్బోధ ముగిసింది. ''హిందూకీ జయ్'', ''బుద్ధ భగవాన్‌కీ జయ్'', ''వేదాకుల జయ్''- సభంతా ఆకాశం చిల్లులు పడ్డట్టు ప్రతిధ్వనించింది. జయజయ ధ్వనులు దశదిశలూ పిక్కటిల్లాయి. శంకరాచార్యులు శంఖం పూరించాడు. ఆ అమృత ధ్వని చెవులపడ్డ ప్రతి

వాడూ కృతకృత్యుడయ్యాడు. ప్రతివాడూ తనంత తాను హిందువుణ్ణని భావించుకున్నాడు.

శంకరాచార్యుల విజయవార్త నాలుగుదిక్కులా ప్రాకిపోయింది. ఏక జాతీయ తరంగం పైకి లేచింది. లక్షలాది బౌద్ధులు అందులో మునకలు పెట్టారు. హృదయ కలంకం, జాతీయ వ్యతిరేక సంకుచిత స్వభావం వదులుకున్నారు. వాళ్ళ హృదయాలు స్నేహ పూర్ణమయ్యాయి, నిర్మలమయ్యాయి.

భారతీయ సమన్వయాత్మక సంస్కృతీ గ్రంథంలో ఒక క్రొత్త అధ్యాయం తెరుచుకుంది. ఇంటిలోంచి అలిగి వెళ్ళిపోయిన కుర్రాళ్ళని శంకరాచార్యుడు తిరిగి ఇంటికి తీసుకువచ్చాడు. ఎంత ఆనందకరమయిన దినమది!

౧౨

తక్షశిల నుంచి శంకరాచార్యులు కాశ్మీరం వెళ్ళాడు. కశ్యపమహర్షి దేశం కాశ్మీరం. కుంకంపువ్వు మళ్ళకే కాదు, కావ్యాలకీ కళలకీ కూడా క్రీడాస్థలమే కాశ్మీరం. ప్రకృతి సౌందర్యానికి నందన వనం కూడా సిగ్గు పడుతుంది దాని ముందు. సంస్కృత సాహితీ ప్రవాహాల శోభవల్ల సరస్వతీదేవి స్వయంగా వెలసిందక్కడ. శ్రీనగరంలోని శారదా మందిరం సుప్రసిద్ధమైంది. గొప్ప గొప్ప విద్వాంసులు వచ్చి శారదాదేవి పాదాలకి నమస్కరించేవాళ్లు. ఆమె వర మాశించేవాళ్ళు కాని హతాశులై మళ్ళి పోయేవాళ్లు. యుగాయురాల నుంచీ శారదా మందిరంలో ఒక్కరూ ప్రవేశించలేకపోయారు. శారదాదేవి వరం లభించందే ఎవరు జగద్గురువు కాగలుగుతారు?

శంకరాచార్యులు శారదాదేవిని ధ్యానిస్తూ దేవాలయం దిక్కు బయల్దేరాడు. ప్రకృతి నటి సింగారించుకొని ఆయనని మోహపరచాలనుకుంది. వికసించిన పుష్పాలు నవ్వుతూ ఆయినకి స్వాగతం చెప్పాయి. పలకరించబోయాయి మొగ్గలు మురుస్తూ మెల్లిమెల్లిగా ఆయన చెవిలో ప్రేమరాగాలు వినిపించాయి. కరస్పర్శకోసం కులికాయి. సరోవరాల్లో తమ రూపురేఖలు చూసుకునే మిషమీద అప్సరసలు దిగివచ్చారు పక్షుల స్వరంతో గంధర్వులు గానం చేశారు. కానైతే, ఎవ్వరూ ఆచార్యుల్ని ఆపలేకపోయారు. సంసారంలో అసత్యమైన మాయాస్వరూపం. కళ్ళకి

ఎంత లోలుపంగా వుంటేనేమి? సత్య సాక్షాత్కారం పొందినవాడు శంకరాచార్యులు. ఆయన్నెలా అకర్షిస్తుంది? ధ్యేయవాది అయిన యువకుడి మల్లే, ధ్యేయపథంలో ముందడుగు వేస్తూ ముందుకి పోయాడాయన. ఆయనకి తెలుసు, ఆగకండా నడుచుకుపోతేనే చివరికీ ర్తి దక్కుతుంది. ఆయన కీర్తి చంద్రికలు హిమశిఖరాల మీద వెల్లివిరిశాయి. ప్రాతర్వేళల మంచు శిఖరాల మీద బాలారుణ స్వర్ణకిరణాలు పడుతూవుంటే, కుంకం మళ్ళ ప్రతిబింబాలూ, ఆచార్యుల తేజస్సూ కలిసి హిమాలయశృంగాలు మెరిసేవి. ఉషాదేవి శలవు పుచ్చుకుంటూ, తన చేతులతో కుంకంబొట్టు భారతదేశం లలాటఫలకం మీద దిద్ది వెళ్ళేది. శంకరాచార్యులు ముందుకి సాగేవాడు. భారతీయాత్మ యొక్క ఆధ్యాత్మిక, ఆదిదైవిక, ఆదిభౌతిక స్వరూపం తాలూకు సంపూర్ణ దృశ్యం నృత్యం చేసేది.

శంకరాచార్యులు శ్రీనగరం చేరాడో లేదో, నాలుగు దిక్కులనుంచీ విద్వాంసు లక్కడ కిటకిటలాడారు. భారతదేశమంతటా శంకరాచార్యుల విజయపతాకం ఎగురుతూవుంది. కాని కాశ్మీరం శారదాభక్తులు మాత్రం ఆయన ముందు తల వంచడానికి సమ్మతించలేదు. సరస్వతి అవతార మైన భారతిని జయించా డాయన. ఈ బహుశ్రుత సత్యం కూడా వాళ్ళ దృష్టిలో ఒక లెక్కలోకి రాలేదు. విన్నదానికంటే చూసిన దానిమీదే హెచ్చు నమ్మకం వాళ్ళకి. వాళ్ళని తన మతంలో కలుపుకోందే శంకరా చార్యులు మాత్ర మెలా వూరుకుంటాడు? శరీరమెంత ఆరోగ్యంగా వుంటే నేం, మస్తిష్కంలో వికారముంటే ప్రయోజనం ఉండదు. భారత దేశానికి కాశ్మీరం భౌగోళికంగానే గాక జ్ఞాన విజ్ఞానాల దృష్ట్యా కూడా శిరస్సు లాంటిది.

శంకరాచార్యులు మందిరము వైపు వెళ్ళాడు. ఎంతో మంది పండి తులు సమావేశమై వున్నా రక్కడ. తక్కిన పండితుల మల్లేనే శంకరా చార్యులు కూడా శారదాలయం నుంచి హతాశుడై, శృంగభంగమై తల దించుకు మళ్ళిపోతాడనే అనుకున్నారు వాళ్ళు. ఆచార్యులు ఆలయ ద్వారం దిక్కు అడుగులు వేస్తున్నకొద్దీ ప్రజల ఔత్సుక్యం పెరుగుతూ వచ్చింది. ఆచార్యులకి తప్పకుండా శృంగభంగ మవుతుందనుకుంటూ వున్నవాళ్ళ

సంతోషానికి మేరలేకుండా వుంది. ఏమంటే, పరాభవం పొందిన వెంటనే తమతో సమానుడే అయిపోతా డాయన, శంకరాచార్యులు శారద దేవాలయం ద్వారం నగ్గరికి వెళ్ళాడు. చేతులు చాచాడు. వేలాది కళ్ళు లాయన చాచిన చేతులు చూశాయి శంకరాచార్యుల చేతులు వెనకకి మళ్ళలేదు. ద్వారం విడిపోయింది. తలుపులు తెరచుకున్నాయి. తణుకూ బెణుకూ లేకుండా లోపల ప్రవేశించాడు శంకరాచార్యులు. జయజయధ్వని భూమీ ఆకాశం ప్రతిధ్వనించింది విరోధులు ఖిన్నత పొందారు. ప్రజల హర్ష ధ్వానాలు ఆకాశమంటుతూంటే, పండితుల పాదాలకింద నేల రసాతలానికి కుంగిపోయింది.

శంకరాచార్యులు శారదాదేవిని పూజించి బైటికి వచ్చాడు. భక్తి భావంతో ప్రజ లాయన దర్శనం చేశారు. ఆయన మొహం చుట్టూ ఒక అలౌకికమైన కాంతి ప్రకాశించింది.ఆ తేజస్సులో ప్రజలకొక బలంవచ్చినట్టయింది. హిమాలయ మాయన తేజస్సు సహించలేకపోయింది. విచారంతో కరిగిపోవడ మారంభించింది. అక్కడ ప్రజా సమూహానికి శంకరాచార్యులు ప్రబోధించాడు. భారతీయైక్య సందేశం వినిపించాడు. ఆత్మ సత్యం వివరించాడు. రకరకాల పండితు లెంతోమంది, అక్కడ సమావేశమైన యావన్మందీ ఆయన భక్తులైపోయారు. వాళ్ళందరినీ ఆదరించాడు శంకరాచార్యులు. తనతో వచ్చిన యావన్మందినీ వెంటపెట్టుకున్నాడు. జగద్గురు వాయన అయినా విద్వాంసుల్ని ఆదరించడం తన కర్తవ్యమని భావించాడు. ఆయన స్వభావమే చిన్నా పెద్దా అందరినీ తన దగ్గిరి కాకర్షించింది. మాయ అబద్ధమని దండోరా వేసే ఆచార్యులు ఎంత మాయావో చూడండి! ఆయన జీవనంలోని ఈ విరోధాభాసం ఎంతో మందికి అర్థంకాదు. పైగా విపరీతార్థాలు కూడా చేస్తారు వాళ్ళు.

శంకరాచార్యులు కొన్నాళ్ళు కాశ్మీరంలో వున్నాడు. ఆయన వుండినచోటు 'శంకరాచార్యుల గుట్ట' అని ఇప్పటికీ ప్రసిద్ధంగా వుంది. అయితే ఒక్క గుట్టనే శంకరాచార్యుల గుట్ట అనడం పొరపాటు. ఏమంటే, ఆయన పాదాలు తాకినచోటల్లా ఆయనదే. భారతదేశంలో ఆసింధు సింధుపర్యంతం ప్రతి ధూళికణమూ ఆయన పాదాల్ని స్పృశించింది.

ఉత్తర దక్షిణాలు రెండూ ఆకంఠంగా భారతీయ సమన్వయా మృతం పానం చేశాయి. కేవలం దూరంగావున్న ప్రాగ్జ్యోతిషానికే శంకరా చార్యుల శంఖధ్వని చేరకుండా మిగిలిపోయింది. అంచేత రథం తూర్పు దిక్కు మళ్ళించాడు. శిష్యకోటి వెంట నడిచింది. నదులూ, వనాలూ దాటు కుంటూ ఆయన ప్రాగ్జ్యోతిషం చేరాడు. ప్రాగ్జ్యోతిషంలో శాక్తేయ మతం విశేషంగా ప్రచారంలో వుండేది. కామరూపలోని కామాఖ్యదేవి దేవాలయం ఇవాళలాగే అప్పుడు కూడా ప్రసిద్ధిలో వుండేది. దూరదూరాల నుంచి దేవి దర్శనార్థం యాత్రికులు వచ్చేవాళ్ళు. అయితే శక్తి శుద్ధస్వరూపం దర్శించ డానికి బదులు మంత్ర తంత్రాల భ్రమలోపడి, వామాచారకూపంలో దిగబడి పోయేవాళ్ళు. జీవనముయొక్క, జాతియొక్క వాస్తవశక్తిని వదిలేసే వాళ్ళు. తాంత్రికశక్తి యొక్క మోహనరూపం వెంట పరిగెత్తేవాళ్ళు. పథ భ్రష్టులై లక్ష్యానికి దూరమయిపోయేవాళ్ళు.

మానససరోవరం శంకరభగవానుడి పాదాలు కడిగి జ్ఞానమూ, భక్తీ అనే చరణోదకం సింధు బ్రహ్మపుత్రల ద్వారా భారతదేశానికి పంపు తుంది. ఈ రెండు నదుల బాహుపాశాలలో వుండి యుగయుగాల నుంచీ భారతమాత శివుణ్ణి ఆరాధిస్తోంది. పడమటికి పరిశుద్ధమైన శివప్రసాదం దొరికింది. అంచేతే అక్కడ నిర్మలమయిన జ్ఞానధార ప్రవహిస్తోంది. కాని తూర్పున మానససరోవరంనించి వెలువడిన బ్రహ్మపుత్ర, టిబెట్టు కొండల్లో తన వాస్తవిక స్వరూపం మరిచిపోతుంది. పాములా మెలికలు తిరిగిపోతుంది. గడించిన శివజ్ఞానం నిర్మలంగా అట్టే పెట్టలేకపోతుంది. దాంతో టిబెట్టులోని తాంత్రికవాదంతో కలిసి శాక్తేయవాదం తూర్పున వ్యాపించింది. అందులో శుభ్రమైన జ్ఞానజ్యోత్స్న మృగ్యం. అజ్ఞానం మాత్రం మెరుగు చిమ్ముతుంది. కుంకంపువ్వు బంగారు ఛాయ కాని,

ఆనందం కలిగించే శీతలసౌరభం కాని అందులో లేదు. తేయాకు కసటు రంగూ, తాతం కలిగించే మత్తూ మాత్రముంది. ఈ జ్ఞానవికారం శంకరాచార్యులు సహించలేకపోయాడు. తన భారతీయ జీవనానికి ఆ విదేశ ప్రభావం బాధ కలిగించింది. అందుకనే తన ప్రాణాలొడ్డి అయినా దాన్ని సమూలంగా నాశనం చెయ్యడం తన కర్తవ్యమని భావించా డాయన.

కామరూపంలో శంకరాచార్యులు ఎన్నో కష్టాలు భరించవలసి వచ్చింది. అక్కడి శాక్తేయులు తంత్రవాదమూ, వామమార్గమూ - వీటి ప్రభావంవల్ల బుద్ధి వాదానికి తిలాంజలి వదిలిపెట్టారు. జీవనంలోని అవినీతి ధార్మికమనే ముసుగు వేసుకొని నీతిమీద తిరగబడినప్పుడు దానిని సరిచెయ్యడం, బ్రహ్మాండమైపోతుంది. పుణ్యమనుకుని పాపం చేసే వ్యక్తిని పుణ్యమార్గంలో నడిపించడం దుష్కరమైన పని. శాక్తేయుల జీవనంలో వామమార్గం ప్రవేశించడం చేత వాళ్ళలో దురాగ్రహం కూడా బలిసిపోయింది. అది జాతీయ జీవనం చిందరవందర చేసి వొదిలిపెట్టింది. శరీరం ఆరోగ్యంగా ఉండినా వీపుమీద రాచకురుపు పుడితే ఎలా ఉంటుంది? అదిగో, అలాగే వుండేది దేశానికి ప్రాగ్జోతిషం.

శంకరాచార్యులు దృఢవ్రతుడు. దుష్కరమైన కార్యం వచ్చి పడినప్పుడు, వెనకడుగు వేసే వ్యక్తి కాదాయన. అక్కడి నాయకులూ, పండితులూ, హఠవాదులూ తర్కమనే త్రాసు పట్టుకుని, హస్తలాఘవం చేసుకురావడమే తమ కర్తవ్యమనుకునేవాళ్లు. సత్యం ముందు కళ్లు మూసుకునేవాళ్ళు. శంకరాచార్యుల తత్వము బుద్ధి గ్రాహ్యమూ, తర్కసమ్మతమూ అయినాకూడా వాళ్ళు దానిని తెలుసుకోదలచలేదు. అది తెలుసుకుంటేనే వాళ్ళకి బాధ. దానివల్ల వాళ్ళ స్వార్థం దెబ్బ తింటుంది. వాళ్ళ నాయకత్వం నశిస్తుంది. ధర్మం చాటున వాళ్ళలో ప్రవేశించిన దురాచారాలూ, కుసంస్కారాలూ వాళ్ళ జీవనం మీద తిష్ఠవేసుకు కూచున్నాయి. ఇచ్ఛాశక్తి ఎంత దుర్బలమయిపోయిదంటే, దుర్బలత్వం వదులుకుందికి కూడా దానికి సామర్థ్యం లేకుండా పోయింది. ఈ స్థితిలో తమ దురాచారాలు ధర్మసమ్మతమైనవీ, న్యాయసమ్మతమైనవీ అని పట్టు

బట్టి కూచోవడం కంటే ఇంకో మార్గం లేకపోయింది వాళ్ళకి. నాయకత్వా నికి దురాగ్రహం వొక్కటే సాధనంగా మిగిలింది. వాళ్ళ దురాగ్రహం కొద్ది రోజుల్లోనే గ్రహించేశాడు శంకరాచార్యులు. అంచేత వాళ్ళ మీద తన శక్తి ప్రయోగించి వ్యర్థపరచడ మాయనకి నచ్చలేదు. అదీగాక జన సాధారణంలో సాత్విక మనోభావ మధికంగా వుండేది. వాళ్ళ జీవనంలో వాసనాసంస్కారం కూడా అంతగా వుండేది కాదు. అహంకారమూ, స్వార్థమూ కూడా వాళ్ళలో లేవు. జీవన సంక్షేమ విషయాలు వాళ్ళు స్వాభావికంగా గ్రహించగలిగే వాళ్ళు. శబ్దాడంబరమూ, మోసమూ, కపటత్వమూ మొదలగునవి వాళ్ళ నాక్రమించినా, వాటికి దాసులు మాత్రం కాలేదు వాళ్ళు. అందులో భాగస్తులున్నూ కాలేదు.

సాధారణ జనంలోని ఈ నిజాయితీ చూసి, వాళ్ళతోనే తన పని మొదలెట్టాడు శంకరాచార్యులు. సత్యమైన జ్ఞాన మార్గం వాళ్ళకే బోధిం చాడు. వాళ్ళననుసరిస్తూ వున్న అపవిత్ర జీవనం బట్టలుబయలు చేసి వాళ్ళముందు పెట్టాడు వాళ్ళలోని సాత్విక భావాలు మేలుకొలిపాడు. ఆత్మసత్యమూ, అచ్చమయిన భగవద్భక్తీ వాళ్ళకి నూరిపోశాడు. సాధా రణ జనం శంకరాచార్యుల ఉపదేశ మహత్వం గ్రహించారు. తమ దోషాలు వాళ్ళకి అవగతమయాయి. భారతీయైక్యత సాక్షాత్కరించిన చోటల్లా ప్రజల్లో అపవిత్రత తొలగిపోయింది. పవిత్రత పాదుకుంది.

మెల్లి మెల్లిగా శంకరాచార్యుల చుట్టూ జనం మూగడం మొదలు పెట్టారు. ఆయన శిష్యుల సద్వ్యవహారమూ, సహానుభూతీ, ప్రేమా ప్రజా హృదయ మాకర్షించాయి. హృదయం మస్తిష్కానికి ద్వారం. హృద యంలో స్థలం దొరికితే మస్తిష్కం మీద అధికార మేర్పడడాని కెంతో కాలం పట్టదు. శంకరాచార్యుల శుద్ధమైన వేదాంతతత్వం ప్రాగ్జోతిషంలో ఇంటింటా చర్చనీయాంశమైపోయింది. అంతేకాదు, ప్రజలు దాని నాచర ణలో పెట్టడం కూడా ప్రారంభించారు.

ప్రజల్లో శంకరాచార్యుల మీద శ్రద్ధ పెరిగినకొద్దీ పురాతన శాక్తేయ నాయకుల పలుకుబడి తగ్గిపోతూ వచ్చింది. వాళ్ళు కట్టుకున్న

భవనం పునాదులు ఎవ్వరో కూలదోసేస్తున్నట్టు వాళ్ళు గ్రహించారు. ఆ భవనం గుమ్మటాల్లో కూచున్న తాము ఒకనాడు హటాత్తుగా కూలిపోయి పడిపోక తీరదని తెలుసుకున్నారు. ప్రజలఎదట శంకరాచార్యుల నెదిరించ డానికి శ్రద్ధ గాని, శక్తికాని వాళ్ళకి లేదు. అంచేత ఈర్ష్యతో మండి పోయారు. వాళ్ళు సత్యమార్గం ఒదిలివేశారు. అసత్య మార్గమనుసరించారు. ఒకనాడొక కాపాలికుడు శంకరాచార్యుల తల నరకడానికే ప్రయత్నించా డట! కాని ఆయన శిష్యుల జాగ్రత్తవల్ల అతడి ప్రయత్నం నెరవేరలేదు. శంకరాచార్యులీ ప్రమాదం నించి బతికిపోయాడు. కాని అభినవగుప్తు డాయనని తనకి అడ్డం లేకుండా చేసుకోవాలనే చూస్తున్నాడు. ఎన్నో విధాల ఆయనకి చెరుపు చెయ్యాలని ప్రయత్నించా డతడు. ప్రాగ్జ్యోతిష వాతావరణం కూడా ఆచార్యుల శరీరానికి విషమించింది. భగందర రోగ మాక్రమించిందాయనని. ఆయన రోగగ్రస్తుడు కావడం చూసి, ఆరోగ్య కరమైన మరోచోటికి వెళ్ళిపోదామని ప్రార్థించారు శిష్యులు ఐతే ప్రాగ్జ్యో తిషంలో ఆయన కార్యం పూర్తి కాలేదు. అంచేత శిష్యుల సలహా నచ్చ లేదు శంకరాచార్యులకి. "ఒక ప్రత్యేకమయినపని పూర్తిచేయడం కోసం భగవంతుడీ శరీరమిచ్చాడు పనికంటే శరీరానికి నేను ప్రాముఖ్యమిస్తే, అది భగవదిచ్ఛకి విరుద్ధమే అవుతుంది" అన్నాడు శంకరాచార్యులు. శిష్యులెంత వేడుకున్నా, చికిత్స కూడా చేయించు కోలేదాయన. చికిత్సకి అవకాశం కూడా పోయింది. ఆయన కార్యం నిరాఘాటంగా సాగిపోతూ వుంది. మెల్లిమెల్లిగా తూర్పు భాగం యావత్తూ సంచారం చేసి అద్వైత ప్రచారం సాగించా డాయన.

శంకరాచార్యుల కార్యమిప్పుడు పూర్తి కావచ్చింది. పద్మపాదుడు చేసిన ఉపచారాలవల్ల ఆయన రోగం కూడా మెల్లిమెల్లిగా నిమ్మళించింది. మాతృదేవి వామాంగంలోని వామమార్గమనే రక్తరోగం నయంచేసి, ఆమె శరీరం కాంతివంత మయినట్టు చేశాడు శంకరాచార్యులు. ఈ చివరి కార్యం పూర్తిచేశాక తన జీవన లక్ష్యం తనకి ప్రాప్తించిన దనిపించిం దాయనకి. దాంతో హిమాలయం వెళ్ళి చింతన, మనన, తపస్సులో లీన మయేందుకు సంకల్పించుకున్నాడు.

# ౧౪

భారతీయ జీవనంలో హిమాలయాని కొక ప్రత్యేక స్థానముంది. విశేషమయిన ఆకర్షణ ఉంది. ప్రతి భారతీయుడూ కృతజ్ఞతతో దాని ముందు తలవంచుతాడు. అది మాతృభూమికి అంగరక్షకుడిలాగ దృఢంగా నిలబడివుంది. ఎన్నో అసభ్య జాతులు దానిమీద దెబ్బతీశాయి. దెబ్బలు తినితిని స్వయంగా పాషాణమే అయిపోయిందది. కాని ఆ అసభ్యుల్ని మాత్రం లోపల అడుగు పెట్టనివ్వలేదు. శరీరం చీల్చుకుపోయే ఉత్తరాది మంచుగాలి తానే స్వయంగా పీల్చేస్తుంది. తన శరీరం మంచుమయం చేసుకుంటుంది. దధీచిలాగ మనల్ని రక్షిస్తుంది. ఉద్ధతమయిన దక్షిణ సాగరం మేఘంగా మారి భారతదేశం సరిహద్దు దాటేందుకు వ్యర్థంగా ప్రయత్నిస్తుంది. కాని ఈ అంగరక్షకుణ్ణి తప్పించుకోలేదు. బతిమాలుతుంది. కాళ్ళా వేళ్ళా పడుతుంది. అర్ద్రభావం కనపరుస్తుంది. అరుస్తుంది. గోల పెడుతుంది. కండ్ల నీరు పెట్టుకుంటుంది. వెక్కి వెక్కి ఏడుస్తుంది. కాని ఆ రక్షకుడి రాతిగుండె కరగదు సముద్రం ఓడిపోతుంది. నిలువునా నీరై పోతుంది. మళ్ళిపోతుంది. సముద్రం చేసిన ఆగడానికి తగిన శిక్షగా దాని నుంచి నీరు లాగేసి, హిమాలయం మనకి ప్రసాదిస్తుంది. అంతేకాని, తానుమాత్రం దాచుకోదు. ఎండాకాలం మండిపోయి, భారతభూమి యావత్తూ మలమలా మాడిపోయి, ఎండిన దొంతుకలతో ఆమె సంతానం అంగలార్చినప్పుడు, హిమాలయమే తన శరీరం కరగించి మనకి జలదానం చేస్తుంది. గంగా, యమునా, సింధులు అమృత కలశాలు పట్టుకుని దాని ఒడిలోంచి దిగి మనకి ప్రాణ దానం చేస్తాయి. ఉదయాన్నే

స్వర్ణ కిరణాలు హిమాలయాన్ని స్నానమాడిస్తాయి. వాటి బంగారు ఛాయ అది లాక్షని, అనంతమైన రత్నాలూ, వీర్యవంతమైన రకరకాల ఔషధులూ మనకి ప్రసాదిస్తుంది. కేవలం ఈ ప్రాపంచికదృష్టితోనే శంకరాచార్యులు హిమాలయాన్ని గొప్పగా భావించలేదు. ఆయన సత్య తత్వాలు మూర్తిమంతమై నుంచున్నట్లు ఉండేది హిమాలయం. లోక కల్యాణం చేస్తూనే నిర్లిప్తతా, విరక్తీ, శాంతీ కలిగి ధ్యానమగ్నుడైన కర్మయోగిలా ఆయన ఎదుట నుంచుండేదది దాని ప్రవృత్తినే హృదయంలో నిలుపుకోవాలని ప్రయత్నించేవాడాయన. శంకరాచార్యులకి హిమాలయం త్రివిష్టప పవిత్రభూమి. ఎంతోమంది తపస్వుల తపోభూమి. పురుషార్థుల కర్మభూమి. శివుని నివాస భూమియగు ఆ హిమాలయం ఆయన వలెనే యోగి స్వరూపేకాక, సర్వతో భావి సౌమ్యమూర్తియేకాక భీషణ స్వరూపి కూడాను. శాంతచిత్తయే అయినా సింహనాదం పిక్కటిల్ల చేస్తుంది. దయాపూర్ణయే కాని కఠిన హృదయకూడా. నిరంతరం ఇస్తూపోయినా లేమి ఎరుగనిది. అనేకులకు మరణ హేతువైనా జీవనదాయిని అది. వల్కలధారియయ్యీ దిగంబరాకారియే. హిమాంశుధారి అయినా మహోగ్రమూర్తి ఆ హిమాలయం. హిమాలయ వైశాల్యం శంకరాచార్యుల నాకర్షించింది. దాని ఔన్నత్యం ఆయన నాహ్వానించింది. ఆయన మోక్షానికది మెట్టులా ఉంది. హిమాలయ గాంభీర్య మాయన పానం చెయ్యాలని భావించాడు. కాకపోతే, హిమాలయాన్ని జయిస్తేనేకాని జగద్గురువు శంకరాచార్యుల దిగ్విజయ మెలా పూర్తవుతుంది? హిమాలయం ఎత్తుగా తల ఎత్తుకు నుంచుంది. తానుకూడా విశ్వ ప్రపంచానికి మానదండం కాగల విషయం దానికి తెలపాలని ఆయన అభిలాషలావుంది! తానుకూడా హిమాలయంలా గొప్పగా, విశాలంగా, గంభీరంగా కర్మమయ జీవనం సాగించగలడని నిరూపించడమే ఆయన కోర్కెలా వుంది. జీవనంలో గురుతరమైన కర్తవ్యభారం నెత్తిన వేసుకుని, శిష్యులమధ్య

గురువుగా ఉండడమే గొప్పగా భావించే శంకరాచార్యులు హిమాలయం ఒడిలో ఆత్మ సమర్పణం చేసి సుఖపడా లనుకుంటున్నట్లుంది. తన పరమ గురువు భగవద్గౌడపాదాచార్యుల దర్శనం కోసం లోగడ ఒకసారి బదరికాశ్రమం వెళ్ళాడాయన. కాని తల్లి ఆర్యాంబ పిలవడంవల్ల త్వరలోనే వెనుకకి వచ్చేశాడు. నాటినుంచీ నేటిదాకా హిమాలయం వెళ్ళలేక పోయాడు మహనీయమైన హిమాలయం గుహల నుంచి గ్రహించవలసిన జ్ఞానమే ఆయిన తన హృదయ గహ్వరంలోంచి సంపాదించాడు. అయినా అంతమాత్రాన తృప్తి కలగలే దాయనకి. యావజ్జీవమూ హిమాలయ మాయనని ఆహ్వానిస్తూనే ఉంది. ఈ ఆహ్వాన మార్గంలో కర్తవ్య మడ్డంకి కాలేకపోయింది. అంచేత బదరికాశ్రమానికి పయనం కట్టా డాయన.

బదరికాశ్రమంలో ఎన్నో దినాలుండలేదు శంకరాచార్యులు. అక్కడి నుంచి కేదారనాథం వెళ్ళా డాయన. పాండవుల మహాప్రస్థాన మాయన కళ్ళముందు కట్టినట్టయింది. ఆ దారినే ఎవరో తనని పిలిచి నట్టయింది అడ్డడానికి వీలులేని పిలుపది. యముణ్ణడ్డినవాడెవడు? సరి, ఒకనాడు శంకరాచార్యులు ధ్యానమగ్నుడై సమాధిస్థుడయిపోయాడు. శిష్యులందరూ చూస్తూ వుండిపోయారు. వేదాంత తత్వమెరిగిన వాళ్ళే వాళ్ళంతా. అయినా గురుదేవుడి నశ్వర శరీరం కోసం కళవళ పడి పోయారు వాళ్ళు. కన్నీళ్ళు కార్చారు. కాని హిమాలయం చల్లదనంలో వేడివేడి కన్నీటి చుక్కలు ఉత్తర క్షణంలో మంచుకింద మారిపోయాయి.

శంకరాచార్యులు భారత దేశంలో అవతార మెత్తిన మహాపురుషుల్లో ఒకడు. మన జాతీయ జీవన నిర్మాణంలో ఆయన చేసింది ఎంతో వుంది. ధర్మమూ, తత్వజ్ఞానమూ- ఈ క్షేత్రాల్లో ఆయన స్థానం చాలా ఉన్నతమయింది. ఆయన ప్రసాదించిన ప్రస్థానత్రయి చిరకాలం ధృవ తారగా వుంటుంది. ఆయన తరవాత కూడా ఎంతోమంది ఆచార్యులు

జన్మించారు. వారిలో ఆయన మతం సరిదిద్దినవాళ్ళూ, సంస్కరించిన వాళ్ళూ వున్నారు. అయితే, ప్రతివాళ్ళూ ప్రస్థానత్రయినే ఆశ్రయించారు. ప్రస్థానత్రయం ద్వారానే శంకరాచార్యులు తన మతం ప్రతిపాదించాడు. ఆయన ఆత్మ మహనీయమైంది. భావాలు శాంత పూర్ణమైనవి మస్తిష్కం దృఢమైంది. బుద్ధితీక్షణత అద్వితీయమైనది ఆయన కాయనే సాటి. ఆయన భావాం ఉదాత్తమైంది. ఆయన ప్రతిభ సర్వతోముఖమైంది. ఆయన తర్కం సూక్ష్మమైంది. ఆయన తాత్విక దృష్టి సర్వగ్రాహి. ఎందులోనూ ఆయనకి సాటిలేదు. తాత్విక గాంభీర్యంలోనూ, ధార్మిక భావుకతలోనూ బుద్ధ భగవానుడి కంటే కూడా ఆయన రెండడుగులు ముందుకి వేశాడు. ఆయన జీవనాదర్శం సాహసంతోనూ, శక్తితోనూ నిండి వుండేది. ప్రాణంపెట్టి సంఘమంతటినీ చైతన్యవంతం చేశాడాయన. సమాజంలోని భిన్న భిన్న మతాల, భిన్న భిన్న తత్వాల, భిన్నభిన్న సంప్రదాయాల మూలభూతమైన ఏకత్వం తర్కశుద్ధం చేశా డాయన. ఆకర్షవంతంగా చేసి దాంతో జాతీయ సమస్యలు నిష్పక్షపాతంగా పరిష్కరించాడు. ఇదంతా ఆ మహనీయుడికే చెల్లింది. ప్రాచీన వాఙ్మయానికి టీకలు వ్రాసి, దాని స్వరూప ప్రకటన చేశా డాయన. దాంతో ఆనాటి ఊహలన్నిటిలో వున్న ఏకత్వం తేటతెల్లమయింది. అభ్యుదయకరమైన సమాలోచనలకి సమాధానం లభించింది. ఆయన వ్యాఖ్యానాలు సరళమైనవి. సరసమైనవి. సుస్పష్టమైనవి. ఈ శ్రేష్టగుణాల వల్లే ప్రపంచంలో ఇవాళ తత్వజ్ఞానులందరిలోనూ శిరోరత్నమయ్యా డాయన.

భారతీయ జాతీయ జీవనంలో కృష్ణపరమాత్మ తరువాత జగద్గురు శంకరాచార్యుల అవతారమే దేశంలోని మౌలికమయిన ఏకత్వానికి వ్యావహారిక రూపం చేకూర్చింది. కృష్ణ భగవానుడు భిన్న భిన్నమయిన విచార శాఖల్లో భగవద్గీత ద్వారా ఏకత్వం స్థాపించడానికి ప్రయత్నించాడు. చాతురంతమయిన ధర్మరాజ సామ్రాజ్యం ద్వారా జాతీయతను స్థాపిం

చాడు. శంకరాచార్యులు భారతీయైక్యతకోసం ధర్మరాజు వంటి రాజకీయ పురుషుణ్ణి తయారుచేయలేదు. కాని జాతీయ జీవనంలో ప్రతి ఒక్క క్షేత్రంలోనూ ఏకత్వం స్థాపించాడు. ఆ ఏకత్వంలో పారంపర్యంగా సంస్కారం నిలుపుతూ వచ్చే వాళ్ళని సృష్టించాడు. దాంతో సాంస్కృతిక జీవనంలోని ఏకత్వానికి శక్తి లభించింది. అంచేత అవాళదాకా భిన్నమయిన్నీ ఆంతరంగికంగా వున్న భారతీయైక్యభావం సత్యం కింద పరిణమించింది. అనేకత్వంలో ఏకత్వమన్న ప్రాచీన సిద్ధాంతానికి శంకరాచార్యులే ఆత్మిక, భౌతిక, నైతిక, ధార్మిక, సాంఘిక, రాజనైతిక క్షేత్రాల్లో తన అద్వైత సిద్ధాంతం ప్రతిపాదించి వ్యవహారంలోకి తీసుకు వచ్చాడు. ఈ సిద్ధాంతమే మానవజాతికి శాంతి, కళ్యాణాలు ప్రసాదించడానికి కారణమయింది.

శంకరాచార్యుల సిద్ధాంతాలవల్లా, ప్రయత్నాలవల్లా, భారతదేశం ఒకవంక కర్మకాండ రూఢివాద కూపంలోనూ, ఒకవంక నాస్తికవాదుల జడవాదకూపంలోనూ కూలిపోకుండా బతికిపోయింది. శంకరాచార్యులు భారతదేశ ముద్ధరించాడు. ఆయన ఏకత్వ సిద్ధాంతం జీవనంలో మనమాచరణలో పెట్టి, తిరిగి భారతదేశం ఉన్నతమైందిగానూ, వైభవశాలిగానూ అయేటట్టు చేయడం కంటే మనమా జాతీయ మహా పురుషుడికి అర్పించగల శ్రద్ధాంజలి వేరే ఏ ముంటుంది? ముప్పయిరెండు సంవత్సరాల వయస్సులోనే అంత మహాకార్యం సాధించాడు శంకరాచార్యులు. అఖండమయిన ఆయన కర్మమయ జీవనంవల్ల మన జీవనంలో కూడా కర్మోత్సాహం కలగాలి. మన పురుషార్థమూ, నిశ్చయమూ, నిష్ఠా, త్యాగమూ - వీటి బలంతో అద్వైత సిద్ధాంతాల ద్వారా ప్రపంచ మంతటా నిజమైన శాంతీ, సౌఖ్యమూ కలిగించాలి. ఆ మహనీయుణ్ణి నిజమైన జగద్గురు పీఠం మీద మనం ప్రతిష్ఠించాలి. ఇదే ఆయన పుణ్యాత్మకి మనం చేయవలసిన నిజమయిన పూజ. *

